చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి శతావధాని

# కాశీయాత్ర

**(కథలు - గాథలులో చేరని మరికొన్ని రచనలు)**

సంపాదకుడు

**మోదుగుల రవికృష్ణ**


ప్రచురణ

**మోదుగుల రవికృష్ణ**

అన్నమయ్య గ్రంథాలయం, అన్నమయ్యవీథి,

బృందావన్ గార్డెన్స్ 5వ లైను, గుంటూరు - 522 006

ఫోన్ : 0863 - 2246365

# KAASI YAATRA

(Other Uncompiled Essays)

*'Sathaavadhaani'* Chellapilla Venkatasaastry

*Cover Page*
Rayana Giridhar Gowd

*Cover Setting*
Setlem Chandra Mohan

*Edited by*
Modugula Ravi Krishna
ravimodugula@gmail.com
Cell : 9440 320 580, 7396100173

*Copies :* 1000

*Published on :* April, 2017

*Price :* **₹ 120/-**

*For Copies*

1. M. Ravi Krishna
   Annamayya Grandhalayam,
   Annamayya Veedhi, 5th Line,
   Brindavan Gardens, Guntur - 522 006
   Ph : 0863 - 2246365

2. Navodaya Book House
   Kachiguda, Hyderabad., Ph : 040-24652387

3. Gurazada Book House
   Shop No. 1,NGO Home, Taluka Office Rooad,
   Vizianagaram, Cell : 9440343479

4. Visalandhra Book House all branches

*DTP*
Lakshmi Prasanna Graphics
2/5 Arundelpet, Guntur-2
9866016690, 9505676984

*Printing*
SriSri Printers
Vijayawada, Cell : 9490634849



'కాశీయాత్ర' గ్రంథం తిరుమల తిరుపతి దేవస్థానంవారి
ఆర్థిక సహాయంతో ముద్రింపబడినది.

'కాశీయాత్ర' గ్రంథ ముద్రణ అనంతరం వచ్చే విమర్శలకు, చట్టరీత్యా తీసుకునే
చర్యలకు సంపాదకునిగా నాదే బాధ్యత.

# ఇదీ వరుస......

# చెల్లియో చెల్లకో . . . !

"అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భోగము .......

........ అల చెళ్లపిళ స్వామికున్నట్లుగన్" అనే విశ్వనాథ పద్యం వినని వారుండరు. మధ్యన రెండు పాదాలు ఒకేఒక సమాసకట్టుతో తన గురించిన వివరణ వుంటుంది. సన్మానసందర్భంగా పద్యరత్నాలు అందిస్తూ, "ఇలాంటి అలఘుస్వాదు రసావతార ధిషణాహంకారపేశల బ్రాహ్మీమయమూర్తి శిష్యుడైనా డన్నట్టి భోగము నన్నయకు తిక్కనకు లేదు మా చెళ్లపిళస్వామికి మాత్రమే వుంది" అని ముక్తాయించారు. గురువుగారు "ఇంతకీ నీ గురించి రాసుకున్నావా, నా గురించా" అని అడిగితే "తమ చిత్తం" అన్నారట విశ్వనాథ. అయితే, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి పలు సందర్భాలలో "ఇతడు మాకంటెను పిండిగలవాడు" అని మనసా ప్రశంసించారు. గురువుని మించిన శిష్యుడు 'గురువుగారు' శీర్షికన రాసిన పద చిత్రాన్ని యీ పుస్తకానికి సింహద్వారంగా వుంచి సంభావించడం సముచితంగా వుంది. వడగళ్లరావూరు చెళ్లపిళ్ల ఒక ఉపాధ్యాయుడిగా స్కూలుకి రావడం, బొక్కెన పట్టుకు రావడానికి పోటీలు, ఆయన బొక్కెన్లు బొక్కెన్లు తనివితీరా – తనువుతీరా పోసుకోవడం, అప్పటికే దీపాలవేళ అవడం సంగతులు చెప్పారు శాస్త్రిగారు పాఠం చెప్పడానికి మళ్లుకుంటే అన్ని తరగతులవాళ్లూ చేరేవారట. సాక్షాత్తూ శివుని శిరస్సు నుండి గంగ దిగినట్టు ఆయన వాక్ఝురి సాగేదిట. ఒకసారి బొక్కెన యోగం రావూరుకి కూడా పట్టిందిట! ఇలాంటివి ఇప్పుడు అల్ప విషయాలుగా తోచవచ్చుగాని నాడు వారికెంత ప్రాభవం వుండేదో సూచిస్తాయి.

సరిగ్గా ముప్పై మూడేళ్ల క్రితం నాకో మహర్దశ కలిగింది. శెమ్మంగుడి శ్రీనివాసఅయ్యర్‌గారి తంబూరని బోగీలోంచి స్టేషన్ బయట గుమ్మందాకా పట్టుకునే అవకాశం వచ్చింది. అయ్యర్‌సారు మాత్రం నన్ను అనుమానంగా చూస్తూ, నిదానంగా తనముందే నడవమని తమిళంలో హెచ్చరించారు. ఈ బంటురీతి కొలువు కోసం నేను దేనికైనా సిద్ధమై ఆయనకి అందుబాటులోనే నడిచాను. ఇది నా జీవితంలోని మధురఘట్టాలలో శ్రావ్యమైంది.

"వానికేమి చెళ్లపిళ్లరాయుడు" అని మా అగ్రహారంలో తరచు వినిపించేది. ఏమిటో ఎందుకంటారో తెలిసేది కాదు. తర్వాత తెలిసింది – కర్నాటకలో మేల్కొటె (మేలుకోట) దగ్గర "సెల్వపిళ్లరాయుడు" అలయం వుందనీ, ఆ దేవుడు భోగమూర్తి అనీ, అదే వాడుకలో చెళ్లపిళ్ల రాయుడు అయిందని. చెళ్లపిళ్లవారు కూడా మహా భోగి. పింగళి, కాటూరి, వేటూరి, వేలూరి, విశ్వనాథ వంటి శిష్యులు గల గురువును

మించిన భోగపురుషుడు ఎవరుంటారీ నేలమీద. బందరు ఇసుకపర్రలలో బంగారు పంటలు పండించారని చెళ్లపిళ్లని ప్రశంసిస్తుంటారు.

ఆధునికయుగంలో తిరుపతి వేంకటకవులు ప్రముఖం, ప్రత్యేకం. జంట కవులుగా వాణిని వినిపించిన ఆద్యులు. రాచరికాలు, జమిందారీలు అంతరించని ఆ రోజుల్లో ఆస్థానాలలో యీ జంట అవధానాలు జనరంజకంగా చేసి, అవధాన కళకు కొమ్మెరుగులు దిద్దారు. ఆశుకవిత్వంగా వారు చెప్పిన పద్యాలు సైతం శిలాక్షరాలై నిలిచాయి. జంటలో ఒకరైన దివాకర్ల తిరుపతిశాస్త్రి యాభైలోకి రాకుండానే గతించారు. జంటగా వారు రచించిన కావ్యాలు, నాటకాలు, వచనాలు పద్యాలు ఎన్నో బహుళప్రాచుర్యం పొందాయి. మహాభారతాన్ని పద్యనాటకంగా రచించి, తెలుగుజాతి వారికి శాశ్వతంగా ఋణపడేలా చేసుకున్నారు. 'అదిగో ద్వారక ..... ', 'చెల్లియో చెల్లకో', 'జెండాపై కపిరాజు', 'బావా ఎప్పుడు వచ్చితీవు' వగైరా వగైరా పద్యాలు తెలుగునేల నాలుగు చెరగులా నేటికీ వినిపిస్తూనే వున్నాయి. మన పత్రికలలో "అయినను పోయి రావలయు హస్తినకు" అనే శీర్షిక తరచు కనిపిస్తూనే వుంటుంది. పండితుల నుంచి పశువులకాపరి దాకా పాండవోద్యోగ విజయాలలో పద్యాలను తమకు తోచిన విధంగా పాడుకుంటూనే వుంటారు.

కాశీయాత్రకు కొన్ని ప్రత్యేకతలున్నాయి. ఇందులో చెళ్లపిళ్ల తన అనుభవాన్ని వివరించారు. వారు కృష్ణాపత్రిక, భారతి యింకా మరికొన్ని పత్రికలలో రాసిన లఘు, దీర్ఘవ్యాసాలను దాదాపు రెండువేల పేజీలను సంపుటీకరించి "కథలు – గాథలు" అని పేరు పెట్టారు. అందులో వేంకటశాస్త్రి జీవితకథ కూడా చాలావరకు నిక్షిప్తమైంది. కాశీయాత్ర కూడా వారి జీవితంలో ముఖ్యఘట్టమే. అప్పటిలో కాశీ వెళ్లడమంటే యిప్పటిలా సాధారణ విషయం కాదు. ఏనుగుల వీరాస్వామయ్యలా విపులంగా యాత్రాచరిత్రను గ్రంథంగా రాయలేదు గాని, కొన్ని ఆర్థిక సాంఘిక విషయాలను ప్రస్తావించారు. చెళ్లపిళ్ల వచనంలో ఒక విలక్షణత వుంది. పదాలు మెత్తగా వుంటాయి. చెప్పడంలో మధ్యమధ్య చమత్కారాలుంటాయి. వాక్య నిర్మాణంలో అదుపులేని విశృంఖలత్వం వుంటుంది. అన్నీ కలిసి పాఠకులను నిగ్రహించుకోనీయవు. తిరుపతిశాస్త్రి పద్యంలో సొగసరి అయితే, వేంకటశాస్త్రి గద్యంలో గడసరి అంటారు. పేచీకి దిగితే పోట్లగిత్త! శ్రీపాదలతో గొడవలు పాదుకా పట్టాభిషేకాలదాకా వెళ్లాయి. తప్పయినా, తప్పున్నరైనా తన మాటను నెగ్గించు కోవడం చెళ్లపిళ్లతనం. తను పట్టిన కుందేలుకే కాదు, తాబేలుకి కూడా మూడేకాళ్లు! కడదాకా తన పంతం నెగ్గించుకున్నారు.

కాశీయాత్రతో బాటు ఎక్కడా సంపుటాలలో లభ్యం కాని చెళ్లపిళ్ల వ్యాసాలను కూడా యిందులో చేర్చారు. దీనితో కాశీయాత్రకు ఒక నిండుతనం వచ్చింది. ఈ జంట కవుల శ్రవణానందం, పాణిగృహీత గ్రంథాలు మిక్కిలి రసవత్తరాలు. ఆ రోజుల్లో వాటిని చదివేవారు గాని ఇంట్లో మాత్రం కనిపించేవి కావు. వీటి మీద ఎన్నో విమర్శలు వచ్చాయి. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి వీటిమీద దండయాత్ర చేశారు. జంకడం తెలియని కవియోధులు వాటన్నింటినీ ఒడ్డుకొని నిలబడ్డారు.

ఈ పుస్తకంలో పాఠకులకు నచ్చే అంశం దీని సంపాదకులు అత్యంత శ్రద్ధగా అందించిన పాదసూచికలు. నేటి తరానికి యివి చాలా అవసరం. అందునా చాలా విపులంగా యిచ్చి గొప్ప మేలు చేశారు. ఎక్కడెక్కడో ప్రచురితమైన వాటిని సేకరించి, చెళ్లపిళ్ల రచనలకు సమగ్రత తీసుకురావాలని తాపత్రయపడడం ఎంతో అభినందనీయం. తిరుపతి కవుల రచనలు చాలావరకు ముద్రితాలే. అయితే అప్పట్లో పత్రికలలో వచ్చినవి నేడు దొరికించుకు చదవడం సాధ్యమయే పనికాదు. అందుకని అవి అముద్రితాల కిందే జమ. నాకున్న కొద్దిపాటి పరిజ్ఞానంలో చెళ్లపిళ్ల వారి వ్యాసాలు మరికొన్ని వుండవచ్చు. చేసే వారికే పనులు చెప్పడం సహజం. అందుకని 'ర(వి)మ్యకృష్ణ', వారి మిత్రులు మిగిలిన అముద్రితాలను కూడా సంపుటిగా అందించాలని కోరుతున్నాను.

గిరిధర్ ముఖచిత్రం చెళ్లపిళ్లతనాన్ని సహజాతిసహజంగా ఆవిష్కరించింది. కాశీపురికి సంబంధించిన ఛాయాచిత్రాలు నాటివి–నేటివి పరిమితంగానైనా యివ్వడం పవిత్రంగా వుంది. జంటకవుల రచనల పట్టికని పొందుపరచడం బాధ్యతాయుతంగా వుంది. అదుగో మహత్తరమైన మహాద్వారం – ఆ తర్వాత దివ్యమైన ఘాట్‌లు, పుట తిప్పితే సాక్షాత్కరిస్తాయి. దివి నుంచి దిగివచ్చిన గంగానది ప్రవహిస్తోంది. అందులో మునకలు వేసి తరించండి. ఈ సత్కార్యానికి రకరకాలుగా సాయపడిన చల్లని చేతులకు కైమోడ్పులు. ఇంతటి పుస్తకానికి ముందుగా నా మాటలు వుండడం పూర్వజన్మ సుకృతం, ఆప్తుల అభిమానం.

హైదరాబాదు
20–12–2012.

ఇట్లు
శ్రీరమణ
(శ్రీరమణ)

# మనవి మాటలు

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి (వేంశా) అవధాన విద్యకు రూపురేకలు తీర్చిదిద్ది, వన్నె వాసి సమకూర్చిన తిరుపతివేంకటకవులలో (తివేం కవులు) ఒకరు. "గోణము (గోచి) కట్టుటాది బుధకోటి నుతింపఁ గవిత్వము" చెప్పనేర్చినవారు. సరస చమత్కార వచోమాధురీధారలను ఆంధ్రదేశమంతా ఎడతెరిపి లేకుండా వర్షించి, వర్షించి కూడా వట్టిపోని కాలమేఘం. రంగస్థల నాటకాల తరహాలో కాకుండా, శాస్త్రీయ సంగీతధోరణిలోనూ కాకుండా మృదుగంభీరస్వరంతో, శ్రోతలు ఉఱ్ఱూతలూగేటట్లు రాగచ్ఛాయతో మానసం ఆనందపడేటట్లు పద్యం చదవగలిగిన పండితుడు.

"కవనార్థం బుదయించిన" వేంశా తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రి సమీప గ్రామం కడియంలో 8, ఆగస్ట్, 1870 నాడు జన్మించారు. తల్లిదండ్రులు చంద్రమ్మ, కామయ్య. బ్రాహ్మణ శాఖలలో ఒకటైన ద్రావిడులలో ఆరామ ద్రావిడ అనే అంతశ్శాఖకు చెందినవారు. వారు రచించిన వేలాది పుటల వచనంలో కొంత భాగం ఈ కాశీయాత్ర.

జంటపేర్లు సొంపుగా కుదిరిన అతి కొద్దిమంది భాగ్యశాలురలలో ఒకరు తిరుపతివేంకటకవులు. మొదటివారు అన్నా కూడా తప్పు లేదేమో. 1890 నుండి విస్తరించడం మొదలుపెట్టిన వారి కీర్తికౌముది ధాళధళ్యం ఇప్పటికీ వెలవెలబోలేదు సరికదా, ఎప్పటికప్పుడు కొత్తమెఱుగు చూపుతూ ఉంది. ఆ తిరుపతివేంకటకవుల లోని వేంశా తన విద్యార్థిదశలోని ఒకానొక ఘట్టానికి ఇచ్చిన అక్షరచిత్రణే ఇప్పుడు మీ చేతులలో ఉన్న కాశీయాత్ర.



నేను 1994లో డిగ్రీ ముగించుకొని స్వగ్రామం బాపట్ల నుండి గుంటూరు వచ్చాను. భాష్యం పబ్లిక్ స్కూల్‌లో జీవశాస్త్ర అధ్యాపకుడిగా చేరాను. మధ్యాహ్నం ఒంటిగంట నుండి సాయంత్రం 5 వరకు విరామం ఉండేది. ఊరికి నేను కొత్త. నాకు ఊరు కొత్త. మొగమెరిగిన వారు ఎవ్వరూ లేరు. స్నేహితులు, శత్రువులు ఇంకా సమకూరలేదు. చుట్టాలు మొదలే లేరు, ఏం చెయ్యాలి? అప్పుడు విరామ సమయాన్ని రికామీగా పోనివ్వకుండా అరండల్‌పేట 5వ లైను లోని గ్రంథాలయం

ఒకటి అడ్డం పడింది. ఇందులో రిఫరెన్సు విభాగానికి ఉదయం 8 నుండి రాత్రి 8 వరకు 'ద్వారములు తెరువబడియే యుండును'. అందులోకి వెళ్లడం వెళ్లడంతోనే కథలు – గాథలు అనే మూడు సంపుటాలు ఎదురుగా రాక్‌లో కనబడ్డాయి. వెన్ను మీది టైటిల్ చూసి ఇవి ఏవో కథల పుస్తకాలు అనుకొన్నాను. వాటి వలం చూసి కొద్దిగా భయపడినా తీసి చదవడం మొదలు పెట్టాను.

అప్పటికి నా వాఙ్మయపఠనం చిన్ననాటి చందమామ, బాలమిత్ర, బుజ్జాయి, బాలజ్యోతి వంటి బాలసాహిత్యం కాక మధుబాబు రాసిన పదులకొద్ది షాడో డిటెక్టివ్ నవలలు. అయితే డిగ్రీలో ఒక్క మంచిపని చేసుకోగలిగాను. మా బాపట్ల ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాల గ్రంథాలయంలో ఉన్న ఆరు సాక్షి సంపుటాలు (వావిళ్ల ప్రచురణ), పానుగంటివారివే 12 నాటకాలు ఒక్కొక్కటి 3,4 సార్లు చదివి వున్నాను. అపరాధ పరిశోధక నవలల నుండి ఒక్కసారిగా సాక్షి వైపు ఎలా మళ్లగలిగానో ఈనాటికీ చిత్రమే నాకు. అప్పటికి పెద్ద భాషాజ్ఞానమేమీ లేదు. (ఇప్పటికీ అనుకోండి). అయినా సాక్షి సంపుటాలలో ఎక్కడో ఒక్కచోట ఖండకర కార్పాస కూర్పాసము (దీని అర్థం చేతుల బనియన్ అట), ఉత్తమర్ణుడు (అప్పిచ్చినవాడు) అనే రెండు మాటలు, కొన్ని విశిష్టాద్వైత సంబంధ పారిభాషిక పదాలు తప్ప ఎక్కడా నాకు నట్టుపడిందే లేదు. ఈ సాక్షి వ్యవహారం కాకుండా హరికథల ద్వారా చేకూరిన గాలివాటపు శ్రుతపాండిత్యం కొంత ఉండేది.

ఈ నేపథ్యంతో కథలు – గాథలు పుచ్చుకు కూచున్నాను. మీరు నమ్మాలి నా మాట, నాకు వూపిరి తిరగలేదు. ఆ వచన రచనా రససాగరంలో మూడు నాలుగు నెలలు మునకలు వేశాను. ఆ మూడు నెలలూ 1890–1940ల మధ్యే ఉండిపోయాను.

సమకాలీన సమాజంలో అసమాన సమ్మాన గౌరవాలంది ఇప్పుడు నస్మరంతులై పోయిన ఎందరో కవులను, పండితులను; కేవల రాజపదవాచ్యులు కాకుండా ఎదుటవారి పస నోరు విప్పగానే అర్థం చేసుకోగల సంస్థానాధీశులు ఎందరినో; విద్యాస్పర్థతో ఆయా శాస్త్రాలలో పైకొచ్చిన ఉద్దండులను; "నాకు రెండు కళ్లూ పోయినా ఫరవాలేదు ఎదుటివాడికి కనీసం ఒక కన్నేనా పోవా"లనే మత్సరగ్రస్తులను (పండితులలోనే); మహానుభావులను, సామాన్యులను ఎందరినో ఆయన ఆ పుటల మధ్య అక్షరమాత్రంగానైనా నిలిపారు.

చర్ల బ్రహ్మయ్యశాస్త్రి, మార్కొండపాటి చతుష్కం, చిలుకూరి చతుష్టయం,

ర్యాలిషట్కం (బొమ్మకంటి సోదరులు), ఐలందు పంచకం వంటి పండిత కుటుంబాల పేర్లన్నా నిలిచి ఉన్నాయీ అంటే అవి చెళ్లపిళ్ల వలన. అక్షరజ్ఞానం లేకపోయినా పండితభాషణంతోనే శ్రుతపాండిత్యంతో అనేక శాస్త్రాలలో గట్టి ప్రవేశం సాధించిన పిఠాపురం జమీందారు రావు గంగాధర రామారావు చిత్రచర్యలు నిలిచింది చెళ్లపిళ్ల వలనే. అనేక చిన్నజమీల్లో ఒకటైన మన్యంవారి ఔదార్యం లోకానికి ఇప్పుడు తెలుస్తుందంటే కారణం చెళ్లపిళ్ల. ఆయన కాలంలోనూ, అంతకు ముందు, ఆ తరువాత ఆయన్ను మించిన ఘనులు లేరా? ఉండి ఉంటారు. ఆయన మాత్రం కవిత్వధార ప్రదర్శించగలిగినవారు లేరా? ఎందుకు లేరు? మరేమిటి వేంశా గొప్పతనం అంటే – అందుకు కారణాలలో ఒకటి సమకాలీన సమాజాన్ని ఆయనకు తోచినరీతిలో రచనలో ఎక్కించి పెట్టడం. ముఖ్యంగా కవులను, పండితులను.

అటువంటి వచన ఖండాలలో ఒకటి ఈ కాశీయాత్ర.



నాకు వస్తుతః స్వీయ చరిత్రలు చాలా ఇష్టం. వాటిలో నాటి సమాజ చిత్రణ చదవడం ఎంతో ఆసక్తిదాయకం. నాటి ప్రజలు ఎలా ఉండేవారు, వారి కట్టూబొట్టూ, చదువుసాములు, తిండీతిప్పలు, వినోదాలు, నగలూనాణేలు, ఆచార వ్యవహారాలు, ప్రయాణాలు, తీరుతెన్నులు, వారి జీవితాలలోని మానవీయ సంఘటనలు, ఎదుర్కొన్న సంక్లిష్టపరిస్థితులు, పరిష్కరించుకొన్న సమస్యలు, తారసపడిన మాన్యులు, సామాన్యులు, గుణపాఠంగా గుర్తుంచుకోదగిన ఘట్టాలు – వంటి విశేషాలు నాకెంతో అద్భుతావహంగా, చదువుతుంటే ఆనందదాయకంగా అనిపిస్తుంటాయి. కేవల కల్పనా సాహిత్యాన్ని జొన్నదంటుతోనూ, స్వీయచరిత్రలను రసమహిత యిక్షుఖండంతోనూ ఉపమించ బుద్ధి పుడుతుంది.

అటువంటి వాటిలో కాశీయాత్ర కూడా ఒకటని నా భావన. అయితే ఈ ఖండాన్ని సంపూర్తిగా చదివిన మీదట నాకు కొంత నిరాశ కలగపోలేదు. వాటిని మూడు అంశాలుగా చెబుతాను.

1. కాశీ నుండి తిరుగు ప్రయాణంలోని కష్ట నిష్ఠూరాలను చెప్పినంత వివరంగా వెళ్లేటప్పుడు ప్రయాణం గురించి చెప్పలేదు. అయితే దానికి కారణం లేకపోలేదు. వెళ్లేటప్పుడు రైలు మీద రెండుమూడు మజిలీలతో ఎకాయెకిని వెళ్లారు. వచ్చేటప్పుడు జట్కా, స్టీమరు, ఒంటెద్దుబండి, కాలినడక – ఇలా రకరకాల ప్రయాణ సాధనాలను ఆశ్రయించడం వలన అనుభవాలలో వైవిధ్యం పెరిగింది.

2. అసలు వేంశా కాశీ వెళ్లింది విద్యాభ్యాసం కొరకు, ముఖ్యంగా వ్యాకరణ శాస్త్ర అధ్యయనం కొరకు. వేంశా ఆ సంగతులే ఎత్తుకోలేదు. ఎవరి దగ్గర అధ్యయనం కోసం చేరారో, వారి గురించి కొద్దిగానైనా వివరాలు దేన్ని చదవడానికి వెళ్లారో ఆ విద్యాభ్యాస వివరాలు పెద్దగా యివ్వలేదనే చెప్పాలి.

3. కాశీలో తెలుగు విద్యార్థులు ఎలా చదువుకొనేవారు, నాటి విద్యార్థులు ఆ పరాయి ప్రాంతంలో ఎలా మెలిగేవారు, భాషా సమస్యను ఎలా ఎదుర్కొన్నారు, కాశీలో పండిత సభలు ఎలా జరిగేవి, వాటిలో తాను ఎక్కడైనా పాల్గొని ఉంటే – ఎలా తాను మెప్పు పొందింది – ఇలాంటి వివరాలు వేంశా రాసింది చాలదు, ఇంకా ఉండాలి అనిపిస్తుంది. పైగా చిన్న చిన్న సంఘటనలను చిలవలు పలవలు పెంచి రసవత్తరంగా చెప్పడంలో వేంశా అఖండుడు. అయితే 'కాశీయాత్ర' రాయడంలో వేంశా ఉద్దేశం వేరు. "ఇది రాయడం మొదలెట్టావు కదా, ఇదిగో – ఇలా రాయి. ఈ సంఘటన కూడా చేర్చు. అది చెప్పడం మరిచావే – ఇలా కాదు – అలా" అని చెప్పడానికి మనమెవరం? ఆ ధార ఆయనకి తోచినట్టల్లా సాగుతుంది. గ్రహించ గలిగినంతమటుకు గ్రహించడమే మనవంతు.



మహానుభావులు తివేం కవుల పద్యాలు ఎలా తూగుగా, వాక్యాలు వాక్యాలుగా, మాట్లాడుతున్నట్లే నడుస్తాయో చూడండి.

ఆత్మకూరు (మహబూబ్‌నగర్ జిల్లా) సంస్థానం నుండి తిరిగి వెళ్లడానికి సెలవిమ్మని కోరుతూ రాజుగారితో చెప్పిన పద్యం.

> వేసవి దగ్గరాయె, మిము వీడుటకున్ మనసొగ్గదాయె, మా
> వాసము దూరమాయెఁ, బరవాసమొనర్చుట భారమాయె, మా
> కోసము తల్లిదండ్రు లిదిగో నదిగోనని చూచుటాయె, వి
> శ్వాస మెలర్పవే సెలవొసంగినఁ బోయెదమయ్య భూవరా!

గద్వాలరాజుకు శ్రీనివాసవిలాసచంపువు అనువాదకావ్యకృతి సమర్పణ ఉత్సవసభలో చెప్పిన పద్యం ఇది.

> ఏనుగు నెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కగ నిక్కినాము స
> న్మానములందినాము బహుమానములనే గ్రహియించినార మె
> వ్వానిని లెక్కపెట్ట కనివారణ దిగ్విజయం బొనర్చి ప్ర
> జ్ఞా నిధులంచు బేరు గనినారము నీ వలనన్ సరస్వతీ!

విశాఖపట్టణంలో గోడే గజపతిరావుని దర్శించపోయినప్పుడు ఎంతకాలానికీ సముఖానికి రమ్మనమని సెలవు రాలేదు. అప్పుడు విసుగుతో చెప్పిన పద్యం –

సంగరశక్తి లేదు, వ్యవసాయము సేయుట సున్న, సంతలో
నంగడివేసి యమ్ముటది యంతకుమున్నె హుళక్కి, ముష్టికిన్
బొంగు భుజాన వైచుకొని పోయెద యెక్కడికేని ముష్టిచెం
బుం గొనిపెట్టు యమోఘమిదే కద! దంతిరాణ్నృపా!

విజయనగరంలోనూ ఆనందగజపతి దర్శనం గగనం అయ్యింది. నాల్గైదు నెలలు వేచి ఉన్నారు. రాజదర్శనం యిప్పించమని కోరుతూ దివాన్ బీజాపురపు కోదండరావుకి పెట్టిన పద్యమయ అర్జీలోనివి యీ రెండు పద్యాలు.

"రాజతిపండితుడట బరాబరియౌనట మంత్రి రాజుతో
ధీజవ మొప్పునట్టి కవి ధీరులు తిర్పతి వేంకటేశులా
రాజును జూడ బోయిరట రాజును దర్శనమీయ లేదటౌ
రా! జగ" మంచు లోకులను నా యపకీర్తికి దాళజెల్లునో?

అటు గద్వాలిటు చెన్నపట్టణము మధ్యన్ గల్గు దేశమ్మునన్
జటుల స్ఫూర్తి శతావధానములు మెచ్చన్ జేసియున్నట్టి మా
కిట రా జీయకయున్న దర్శనము నింకెవ్వాని కీ రాజొసం
గుట చెప్పం గదవయ్య, పాలితబుధా! కోదండరామాభిధా!

మొత్తానికి అసూయాపిశాచావేశవిష్టులైన పండితమండలిని అధిగమించి శతావధాన కవులు ఆనంద గజపతి దర్శనం చేయగలిగారు. అప్పటి పద్యాలలో ఒకటి.

ఎందఱ జూపెనేని వరియింపదు మా కవితాకుమారి, క
న్నందుకు దేశముల్ దిరుగుటబ్బెను సౌఖ్యము లేకపోయె నా
నంద నృపాల! నీదు సుగుణమ్ములు చెప్పిన నాలకించి వెం
టం దల యూచె గావున దటాలున దీని పరిగ్రహింపుమా!

ఈ పద్యం విని ఒక పండితుడు "ఓహో! మీ కవితాకుమారిని ఎక్కడెక్కడో తిప్పి చివరకు మా మహారాజుగారి వద్దకు తెచ్చారా?" అని ఎంతో తుస్కరించి మాట్లాడాడు. చూడండి, పై వాక్యంలో ఎంత అశ్లీలం వుందో! మారు మాట్లాడలేని కవికి ఎంత శృంగభంగం అది! అదృష్టవశాత్తు రాజు ఆ పండితుని మందలించి, మన కవుల పద్యాన్ని ఆస్వాదించడం – అదంతా అవాంతర విషయం.

చెప్పవచ్చినదేమంటే ఇప్పటి దారుణ వచన కవితా ఖండాలకన్నా నూట ఇరవైయేళ్ల నాటి పద్యాలు అర్థమవుతూ ఉన్నాయని. దీనికి కారణం తివేం కవుల ప్రతిభ.



వేంశా గొప్ప చమత్కారి. హాస్యస్ఫూర్తి కలిగినవారు. తనకు కావలసినది ఇవ్వగలరు అనుకొన్నచోట రాబట్టగలరు. దీనికి ఎన్నో సంఘటనలు ఉన్నాయి. ఒక్కటి వివరిస్తాను.

విక్రమదేవవర్మగారికి వయసు మీరాక జయపుర సంస్థానం దఖలు పడింది. ఆయనకు 'కవిభూషణ' సెట్టి లక్ష్మీనరసింహం ఆంతరంగిక కార్యదర్శి. నరసింహం గారికి చెళ్లపిళ్ల అంటే ఉన్న అభిమానం కొద్దీ వర్మగారి సన్నిధిలో శతావధానం చేయించాలనుకొన్నారు. వేంశా ధారణాశక్తి లోపించిందని, రాజుగారు అనుగ్రహిస్తే ఏదో అంశం మీద కాసేపు మాట్లాడతానన్నారు. ఒకరోజు సాయంత్రం జయపురం వారి విశాఖపట్నం విడిది హవా మహల్‌లో మధ్యాహ్నం మూడు మొదలు ఎనిమిది గంటల వరకు అయిదు గంటల సేపు ఏకటాకీన "కవిత్వం" అనే అంశంపై ప్రసంగించారు. వెయిన్నూట పదహార్లు, జోడు శాలువాలతో సత్కరించాలని వర్మ గారి తలంపు. అది ముందే వేంశాకు తెలుసు.

అయిదు గంటల నిరాఘాట ఉపన్యాసంలో ప్రస్తావవశాత్తు కడియంలో తనకు రెండుచోట్ల విడివిడిగా మడిచెక్కలు ఉన్నాయన్నారు. ఆ విషయం అక్కడితో వదిలిపెట్టి ప్రధాన అంశంలోకి మళ్లి, కొంతసేపటికి ఆ రెండు మడిచెక్కల మధ్య ఉన్న భూమి చవగ్గా అమ్మకానికి వచ్చిందని, దానిని గనుక కొంటే తన పొలం అంతా ఒకే ఖండంగా ఉంటుందని చెప్పారు. తరువాయి ప్రసంగాన్ని కొనసాగిస్తూ ఒక అరగంట తరువాత ఆ భూమి కామందు మూడువేలకు తగ్గనంటున్నాడని ముక్తాయించారు. అలా తన కోరిక నేరుగా కాక వ్యంగ్యంగా వెలిబుచ్చి మొత్తానికి మూడువేల రూపాయలు విక్రమదేవవర్మగారి నుండి వసూలు చేసిన చతురుడు వేంశా. ఈ సంఘటనకు ప్రత్యక్షసాక్షి శ్రీశ్రీ *(అనంతం, శ్రీశ్రీ ఆత్మకథ, శ్రీశ్రీ ప్రచురణలు, మే, 2000, పు. 139).* అప్పుడు శ్రీశ్రీకి పాతికేళ్లు (25.12.1935).



వేంశా అంటే సమకాలీనులు చాలామందికి చాలాయిష్టం. మాటలలో దొర్లించే చమత్కారాలకి, పాడే విధానానికి ఆయనంటే పడిచచ్చేవారు. ఆయన ఎలా ఉండేవారో సమకాలీనులు ఇలా చెబుతున్నారు.

టేకుమళ్ల కామేశ్వరరావుగారు "నా వాఙ్మయ మిత్రులు"లో వేంశాని ఇలా మనకు రూపు కట్టించారు. "శాస్త్రిగారు సామాన్యం ఎత్తు, చామనచాయ, బహుచురుకైన మొహం. కంచుగంటలాంటి గొంతుక, పూర్వకాలపు కత్తు కాబట్టి పిల్లజుట్టు. పండిత శాలువను పైన వేసుకొని పంచను ధరించేవారు. చేతనున్న బంగారు కడియం కవితా దిగ్విజయాన్ని సూచిస్తుంది.

కవులు సాధారణంగా వాచాలురుగా ఉంటారు. వారికి వ్రాయడమెంత సహజమో సంభాషించడం కూడా అంతే. దీనికి భిన్నంగా ఉండేవారు సకృత్తు. అయితే సంభాషించడం వేరు, ఉపన్యసించడం వేరు. శాస్త్రిగారు అమితభాషి. ఆయన మాట్లాడుతున్నంతసేపూ వినాలనే ఉంటుంది. లోక వ్యవహారాన్ని, పూర్వానుభవాలను, పూర్వ కవిత్వ, నవీన కవిత్వాలను జోడించి సరసంగా మాట్లాడుతారు. లౌక్యులలో లౌక్యుడు, ఎదిరిని ఏ పద్ధతినైన చిత్తు చేయాలనే వ్యక్తి. పట్టుదలసందర్భాలలో మృగరాజుధైర్యం, నక్కజిత్తులను కూడ అవలంబిస్తారు.

కవితాధోరణికి తిరుపతిశాస్త్రిగారు, లౌక్యప్రజ్ఞకి వేంకటశాస్త్రిగారు అని తెలిసినవారు చెప్పుతారు".

విస్సా అప్పారావుగారు, వేంశా ప్రాణస్నేహితులు. విస్సావారు రాజ మహేంద్రవరంలో ఉన్నన్నినాళ్లు వేంశా రాజమండ్రి వచ్చినప్పుడల్లా వారింట్లోనే మకాం. ఆయన ఇలా చెబుతున్నారు. "చెళ్లపిళ్లశాస్త్రిగారు చాలా సౌమ్యుడు. జ్ఞానపిపాస అత్యధికం. కాలేజీకి వచ్చి రేడియో, ఎక్స్‌రే మొదలైన ప్రయోగాలను చేయించి తెలుసుకొనేవారు. ఏ సభలోనైనా ఆయన తప్పు చెప్పితే దానిని దిద్దుకోక దానినే సమర్థించేవారు. దిద్దుకొంటే గౌరవభంగం అనేవారు. కవులకు అంటగట్టే శృంగారం ఆయనను గురించి అనడానికి లేదు."

ఈ చివరి వాక్యం మాత్రం కొద్దిగా సవరించాలి. మరీ బరితెగించి కాదు కానీ యౌవనంలో ఆయన సరసుల పద్దుకెక్కినవాడే.

వారి ప్రియశిష్యుడు విశ్వనాథవారు గురువుగారిని వర్ణించిన విధమిది. "శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు అప్పుడు వారు వారని నాకు తెలియదు. అంత గొప్పవాడు ఇంత బక్కపలుచగా, ఇంత నల్లగా ఒక మాసిన కోటు తొడిగికొనునా! ఒక పిచ్చి తలపాగా పెట్టుకొనునా! వారు వీరని నేననుకోనే లేదు. తరువాత రెండేండ్లకు తెలిసినది."



వేంశా సాహితీప్రత్యర్థులపట్ల నాకు యించుక కోపం లేకపోలేదు. లేనిపోని లత్తుకోరు వివాదాలు (చాలా సందర్భాలలో) రేపి వాటిని సమర్థించుకోవటంలో, వేంశా కాలాన్నంతటినీ వ్యర్థపుచ్చారు. చూడండి కథలు – గాథలులో చొప్పదంటు శంకలు, అపవాదలు, వెక్కిరింపబోయి బోల్తాపడుట (3 భాగాలు), యింకో అపవాద, క్షంతవ్యుడుగారు, పిష్టపేషణం, బహిరంగలోఖి క్షమాపణ శీర్షికలు గల వ్యాసాలు (ఇవి కొన్ని మాత్రమే). లేకపోతే వేంశా ఇంకెన్ని రుచ్యమైన కబుర్లు చెప్పేవారో! పండితులెందరి ప్రతిభావిశేషాలు చెప్పేవారో! ఎన్నెన్ని పురాగాథలను తవ్విపోసేవారో! అన్నీ ఈ వివాదాలవలన "జీర్ణమంగే సుభాషితం" అయిపోయాయి.

తివేం కవులకు మొదటి నుండీ ప్రత్యర్థుల దాడి ఎక్కువ. ఇదివరకు అంతగా ప్రాచుర్యం లేని ఒకానొక విద్యకు ఎంతో "గ్లామర్" తెచ్చి చిన్నతనంలోనే – 20 యేళ్లలోపే తారాపథం చేరుకోవడం, సాటి కవి పండితులకు ఈర్ష్యాకారణం అయి ఉంటుంది. ఇద్దరూ చతురవచోవిలాసులు. అసదృశ ఆశుధార. సాధారణంగా పండితులకు తక్కువగా ఉండే సద్యస్స్ఫూర్తి ఉండటం, హాస్యరసపూరిత సంభాషణ చేయగలగడం వలన ఏ సంస్థానంకు వెళ్లినా రాజుని సూదంటురాయిలా ఆకర్షించేవారు. ఒకసారి పరిచయమయ్యాక, వారి ప్రసంగధారని చవిచూసిన తరువాత వాళ్లని వదలలేకపోయేవారు. గద్వాల వెళ్లినప్పుడు ఆరునెలలు, ఆత్మకూరులో మూడునెలలు, నూజివీడులో ఏడునెలలు, విజయనగరంలో మూడు నెలలు ఉండిపోయారు. అనుజ్ఞ లేకుండా సంస్థానం నుండి కదలకూడదు. అందుకే నెలల తరబడి ఉండిపోవలసి వచ్చేది. అయితే ఆ సంస్థానాధీశుని వద్దకు వెళ్లడానికి ఎంతో హైరానా పడవలసి వచ్చేది. ఆశ్రితపండితమండలి ఒక పట్టాన దర్శనం కానిచ్చేది కాదు. వారి కవిత్వంలో లోపాలు వెదకడానికి ప్రయత్నించేవారు. ఏవో కుశంకలు లేవనెత్తి, యువకవులకు శృంగభంగం చేయడానికి చూసేవారు. రాజు దర్శనం ఎవరైనా కవో, పండితుడో కోరుతున్నాడంటే ఎర్రబట్టను చూసిన ఎద్దువలే ఉండేది వారి ప్రవర్తన. ఇలాంటి గడ్డుసంకటాలను ఎన్నింటినో ఎదుర్కొన్నారు మన యువకవులు.

ఇవి కాక శతావధానాలు, అష్టావధానాల వలన సామాన్య ప్రజానీకంలో కూడా వారంటే గౌరవాదరాలు పెరగజొచ్చాయి. ఇది కూడా ఎందరో ప్రతికక్షులను సమకూర్చిపెట్టింది శతావధానులకు. వారి చమత్కారం అనండి – పరిస్థితుల అనుకూలత అనండి – ప్రతిపక్షుల శంకాబలం తక్కువగా ఉంది అనండి –

"టైము" అనండి – మొత్తమ్మీద అవమానం కాదగిన ప్రతి ఘట్టంలోనూ తిపేం కవులు నెట్టుకు వచ్చారు, ఔననిపించుకొన్నారు.

ఈ ప్రతిపక్షులలో ఆ కాలంలో కొద్దిగా నామరూపాలు ఉన్నవారే ఉండి ఉంటారు. ఇప్పుడు కనీసం వారి పేర్లు కూడా "నామాపి నశ్రూయతే". ఇక ఇప్పటికీ వినబడే పేర్లు వీరితో చిరకాలం పెనగులాడినవారు. వీరిలాగే జంటకవుల జంటలు రెండు. మొదటివారు గుంటూరుకే చెందిన కొప్పరపు సోదర కవులు (వేంకటసుబ్బారావు, వేంకటరమణ), రెండవవారు పిఠాపురాస్థాన కవులు వేంకట రామకృష్ణకవులు (ఓలేటి వేంకటరామశాస్త్రి, వేదుల రామకృష్ణశాస్త్రి). ఏ కారణాల వలన వీరి మధ్య యుద్ధకాండ చెలరేగిందో ఇప్పుడు ఏకరువు పెట్టజాలను, కానీ హోరాహోరీ యుద్ధం జరిపారు. కొప్పరపు కవులు, తిపేం కవుల కలహమయితే నియోగి, వైదీకి ముఠాకలహాలుగా మారి సాహిత్యలోకానికి కావలసినంత వినోదం పంచిపెట్టింది. ఆ మాటకొస్తే సాహిత్యజ్ఞానం కూడా.

ప్రతికక్షి జంటలను రెండింటినీ, తిపేం కవులను లోకఖ్యాతి, ప్రశస్తిరీత్యా చూస్తే త్రాసుమొగ్గు పూర్తిగా తిపేం కవులవైపే ఉండటం అబ్బురమేమీకాదు. కొప్పరపువారు కేవలఆశుకవులు కారు. అత్యాశుకవులు. మనసులో భావం ఎప్పుడు మొలిచిందో – ఎప్పుడు ఛందోరూపంలో వెలువడుతుందో లెక్కగట్టలేనంత వేగంగా పద్యాలపై పద్యాలు ఝరీవేగంతో చెప్పగలిగేవారట. ఈ వేగంతో, తిపేం కవులతో కలహాలతో, వారి అవధాన ప్రదర్శనల పరంపరలో పదికాలాలు నిలబడగల కావ్యమో, నాటకమో రచించలేకపోయారు. బిరుదులు చూద్దామా – అవధాని పంచాననులు, ఆశుకవి చక్రవర్తులు, కుండిన కవిహంసలు.

ఇక రెండవజంట యువకిశోరాలు. మేనత్తమేనమామ బిడ్డలు. అష్ట – శతావధానదక్షులు. ఆశుకవితానిపుణులు. వీరివి ఏవైనా పద్యాలు ఉటంకిద్దామా అంటే ఏవి? గొప్ప పద్యాలే చెప్పి ఉంటారు. జిగిబిగితో అలరారే పద్యాలే చెప్పి వుంటారు. నాటి సాహిత్య పత్రికల నిండా వారి ఖండన మండన పద్యాలే నిండి వుండవచ్చు. కానీ ఇప్పుడు వారి పేర్లే చెప్పగలుగుతున్నాము కానీ వారి రచనల నుండి ఏరి ఒక్క ముక్కను ఉదహరించలేకపోతున్నాము. మరి తిపేం కవులవో? పాండవోద్యోగ విజయ నాటక పద్యాల నుండి పదిముక్కలైనా రాని ఆంధ్రుడుండడు కదా! ఈ నాటకాలు రాసి నూరేళ్లయిన సందర్భంగా ఇటీవలే ఏలూరులో బ్రహ్మాండమైన ఉత్సవాలు జరిపారు. ఆ నాటకం ప్రదర్శించడంలో పోటీలు జరిపారు. అదీ తిపేం కవులకు, వారి ప్రత్యర్థులకు ఉన్న తేడా!

ఈ శత్రుబాధ తిపేం కవులలో వేంశాకి మరీ ఎక్కువ. కారణం ఆయన పట్టుదలమనిషి. మాటపట్టింపు వస్తే శతవిధాల తనమాటే నెగ్గాలని ఆయన అనుకొంటారు, ఒకవేళ తనమాట తప్పయినా కూడా. తిరుపతిశాస్త్రి ఎంతటి శీఘ్రకోపుడో అంతటి తీవ్రశాంతుడు కూడా. ఆయనే కోరి లేవదీసిన తంటాలలో కూడా ఆయనే చల్లబడి చప్పున తప్పుకొనేవాడు. ఈ జంటలో ఎవరు తంటా లేవదీసినా – దాని అంతు చూసేవరకు వేంశా శాంతించడు. దీనితో విద్వల్లోకంలో వేంశా మొండి అని, కజ్జాకోరు అని పేరు వచ్చిం×××ది. దీనికి తగ్గట్టే వేంశా ప్రవర్తన కూడా ఉండేదనుకోండి.

అయితే ఇదంతా వయసులోనే. ప్రాయం పొద్దు మళ్లేసరికి వేంశా ఎక్కడలేని శాంతం తెచ్చుకొన్నాడు. కొప్పరపుకవులతో అంతగా తగాదా తెచ్చుకున్నాడు కదా, వారితో వివాదాలను గ్రంథాలుగా కూడా అచ్చువేశాడు కదా, తనే శిష్యుల పేర్లతో కూడా కొప్పరపువారి మీదా, వేంకటరామకృష్ణకవుల మీద విమర్శలు కూడా రాశాడు కదా – కానీ చూడండి.

1943, సంక్రాంతినాడు విజయవాడ త్రిలింగ విద్యాపీఠంలో అష్టావధానం. చేసే కవులెవరో కాదు. కొప్పరపుకవుల పుత్రులైన సీతారామప్రసాదరావు, మల్లికార్జునరావు. అధ్యక్షత వేంశా. కుమార సోదరకవులను మూడు పద్యాలతో అత్యంతాదరంగా సంభావించి వారిని బరిమీద విడిచిపెట్టి వారి వీరవిహారాన్ని కనులారా గాంచి సంతోషించారు. అన్నట్టు ఆనాటి పృచ్ఛకులలో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారొకరు. ఆ మూడు పద్యాలలో ఒకటి ఉదహరిస్తాను.

అంబా! శాంభవి! యీ కుమార కవు లత్యంతాశుధారన్ కవి
త్వంబున్ ధాటిగ జెప్పి నేటి కవి విద్వద్గోష్ఠి అష్టావధా
నంబున్ దిగ్విజయంబుగ సలిపి మాన్యత్కృపాలోక పా
త్రంబుల్గా జరిగించినార లవుగాతన్ వీరికిన్ శ్రేయముల్

కొప్పరపుకవుల "సానుభూతిపరుడు" నెల్లుట్ల రామకృష్ణామాత్యుడు. కొప్పరపు కవులను భూషిస్తూ, తిపేం కవులను దూషిస్తూ భావార్ణవమును రాసి కొప్పరపు కవులకు అంకితం ఇచ్చాడు. ఒక ప్రతి వేంశాకి పంపాడు. తరువాతెప్పుడో వేంశా బెజవాడలో విడిసి ఉన్నప్పుడు నెల్లుట్లకవి ఆయనను చూడబోయినాడు. కవిగారితో వేంశా అవియివీ అభిమానంగానే మాట్లాడి "అబ్బాయీ! నీ గ్రంథం ఆసాంతం చదివాను. తిడితే తిట్టావు గాని కవితాధార మహాద్భుతంగా ఉంది" అని ప్రశంసించారు.

తరువాతి వచన రచనలలో కూడా లోగడ ఏయే సందర్భాలలో తాను తప్పుగా పలికిందీ, దానిని ఎలా బూకరింపుతో నెట్టుకువచ్చిందీ – అంతా వివరంగా రాసేశారు. ఈ సంకలనంలోని "మా విద్యార్థి దశ – నాటి కవిత్వం"లో రామత శబ్దం గురించి ఆయన బూకరింపు అలాంటిదే. వయసు మీద ఉన్నప్పుడు ప్రత్యర్థులను తీవ్రంగా ఢీకొనేవాడు. వయసు మీద పడినప్పుడు మాత్రం ఇంకా విమర్శలు చేస్తుండే వారిని "ఇలా పత్రికాముఖంగా కాదు నాయనా! ఒకసారి ఓపికచేసుకొని నాల్గుపూటలు మాయింట ఉండండి, మాట్లాడుకుందాం. అవన్నీ ఎలా ఒప్పులో మీకు వివరంగా తెలియచేస్తాను." అని అనునయ పూర్వకంగా మాట్లాడేదశలోకి వచ్చారు. "నాకిప్పటికీ (70 యేళ్ల వయసులో) శత్రుబాధ నివర్తించనే లేదు" అన్నారు. కానీ వారికి ఎప్పటికీ తెలియని విషయం ఒకటున్నది. 70 యేళ్లవయసులోనే కాదు చనిపోయిన తరువాత కూడా శత్రుబాధ నివర్తించలేదు. 1971 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో "విద్యారత్న" నిడుదవోలు వేంకటరావు గారు తివేం కవులపై అవాకులు చవాకులు రాశారు (చూ. ఆంధ్రసాహిత్యంలో శ్రీ తిరుపతివేంకటకవుల యుగం). వారికి విజయనగరంలో శృంగభంగమయ్యింది అన్నారు. అవమానం జరిగాక విజయనగరమే కాదు తుని దాటి వెళ్లలేదు అన్నారు. కవులు బ్రతికి ఉన్నప్పుడు పూర్వప్రత్యర్థులు తప్పు అని చెప్పి, శతావధానులచే ఒప్పు అని నిరూపింపబడి ఉన్నవాటిని తిరిగి త్రవ్వితీసి తప్పులనడం మొదలెట్టారు. తివేం కవులు ప్రచురించిన కొన్ని గ్రంథాల పేర్లు ఉటంకించి ఇవి అచ్చుపడినట్లు లేదని అనుమానం వెలిబుచ్చారు 'పరిశోధనాపరమేశ్వర' వేంకటరావుగారు. వారు రాసిన అసత్యాలను, అర్ధసత్యాలను ఖండిస్తూ ఒక చిన్నపుస్తకమే ప్రచురించారు.

అసలు ఆ వ్యాసం తివేం కవులను భూషించడానికి పుట్టింది. దూషించడానికి కాదు. అయినా రచన నిండా ఎన్నో సత్యవిరుద్ధాంశాలు ఉన్నాయి. ఆ సవాలక్ష లోపాలు అన్నింటిలో తేలిక అయినది ఇది.

1933లో వేంశా బొబ్బిలి యుద్ధ నాటకాన్ని రాసి, బొబ్బిలి జమీందారుకి అంకితం ఇచ్చాడట. ఆ అంకితానికి వేంశా బొబ్బిలి వెళ్లలేదట. అసలు వేంశా బొబ్బిలి యుద్ధం నాటకం రాయనేలేదు. బొబ్బిలి జమీందారు పట్టాభిషేకోత్సవాన్ని కావ్యంగా రాసి పట్టాభిషేకం అయిపోయిన రెండు, మూడేళ్లకు స్వయంగా శిష్యులతో బొబ్బిలి వెళ్లి వారంరోజుల పాటు ఆ కావ్యాన్ని వ్యాఖ్యానం చేస్తూ వినిపించి వారిని ఆనంద మగ్నుల్ని చేసి మరీ వచ్చాడు. ఆ ఆనందానికి చిహ్నంగా వేంశా

బ్రతికి ఉన్నన్నాళ్లు బొబ్బిలి సంస్థానం నుండి నూఱు రూపాయలు ప్రతి సంవత్సరం వార్షికం లాగా అందుకొన్నాడు. అప్పుడు ఒక విశేషం కూడా జరిగింది.

వేంశా కావ్యాన్ని వినిపించడానికి వెళ్లినప్పుడు 'విద్యాసుందరి' బెంగుళూరు నాగరత్నమ్మ కూడా బొబ్బిలి వచ్చి ఉన్నది. ఆమె వేంశా ప్రసంగధోరణి గురించి విని ఉన్నది. అయితే సభకు వెళ్లడానికి అవకాశం లేదు. అది కేవలం ప్రత్యేక ఆహ్వానితుల కొరకే. అందుకని ఆమె జమీందారుకు  పద్యరూపకంగా ఒక అర్జీ పెట్టుకొని అనుమతి పొంది మరీ సభకు వచ్చి వేంశా ప్రసంగాన్ని ఆస్వాదించింది. ఇవన్నీ నేను ఊహించి, కలగని చెప్తున్నది కాదు. ప్రతిదీ గ్రంథస్థమై ఉన్న అంశమే.

వేంశా జీవితాన్ని పరికించి చూస్తే ఆధునిక కవుల కాలంలో అంత మహర్జాతకుడు కనబడడు. నామరూపాలు కలగడానికి వీలులేని కుటుంబ స్థితి నుండి 'ఏనుగునెక్కి ధరణీశులు మ్రొక్కగనిక్కే" దశకు చేరుకొన్నారు. కుటుంబం, ఆర్థికస్థితి దోసపాదులాగా విటిసింది. ప్రత్యర్థుల దాడులను తన కీర్తిసౌధానికి సోపానాలుగా  వాడుకొన్నారాయన.

వేంశా శిష్యుల పేర్లు తలచుకొంటేనే, ఆయనను సర్వాత్మనా గురువుగా భావించి గౌరవించినవారి పేర్లు తలచుకొంటేనే వేంశా గొప్పతనం బోధపడుతుంది. విశ్వనాథ సత్యనారాయణ, వేటూరి ప్రభాకరశాస్త్రి, పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావు, వేలూరి శివరామశాస్త్రి, శ్రీరాముల సచ్చిదానందం (నాటి రోజులలో ప్రముఖ నాటకకవి) అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి – ఇటువంటి శిష్యవైభవం ప్రత్యర్థి కవులు సంపాదించలేకపోయారు. ఒక్క వేంకటరామకృష్ణకవుల తరఫున శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కనబడతారు.

వేంశాని పరికించి చూసిన మీదట మనకు తెలిసేది ఆయన పరమ శిష్య వత్సలుడు, మృదుస్వభావి, శత్రువును ప్రతారించగల తీవ్రప్రతిభ, మహిత సాంద్రతర కీర్తి సంపన్నులు అని.



ఇక వారి పద్య పఠనా విధానం గురించి కొంత ప్రస్తావిస్తాను.

వేంశా పద్యం చాలా చక్కగా చదివేవారట. చదవడం ఏమిటి – పాడేవారు. అసలు ఆ కాలంలో పద్యపఠనంలో ప్రత్యేక ఒరవళ్లు సృష్టించిన మహానుభావులు దేశమంతా తిరిగి ఎండుకొమ్మలకు కూడా చివురెత్తించారు. జాషువా, కృష్ణశాస్త్రి,

జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, విశ్వనాథ, వేదుల సత్యనారాయణశాస్త్రి, మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి, బసవరాజు అప్పారావు – ఇక అడివి బాపిరాజు సరేసరి. అందరూ కలంబలంతోపాటు గళంబలం కూడా కలిగినవారే. బుల్లిపాపలు అల్లిబిల్లి ఆటలాడుతూ అందమైన ముగ్గులు వేసి వేసి అరచేత్తో అలా తుడిచి శుభ్రం చేసి తుడిచేసినట్లు – ఈ మహానుభావులందరూ – కవనంతోనూ, గానంతోనూ రాతిలో సైతం తేమ పుట్టేటట్లు చేయగలిగిన మహానుభావులందరూ ఒక్కసారిగా తమ అంశనైనా విడువకుండా కాలయవనిక మఱుగులోకి జారిపోయారు. అందరూ ఒక్కకాలంలోనే కట్టుకట్టుకొని పుట్టి – ఒక తరాన్ని మురిపించి కూడబలుక్కొన్నట్లు మాయమయ్యారు. కాలాయ తస్మై నమః. చాలా ఆశ్చర్యకరంగా, బాధావహంగాను అనిపిస్తుంది తలచుకొంటే. ఆ కవుల సాహితీవారసులు – కనీసం – విత్తనాల వడ్లలాగానైన వెతికి చూద్దామన్నా కలికానికి కూడా లేకుండా పోవడానికి కారణం ఆ చదువులు జీవనోపాధి కలిగించక పోవడమేనా?

వేంశా పద్యపఠనం గురించి మనకెవ్వరికీ తెలియదు కదా! అందుకని విశ్వనాథ వారి మాటలు విందాం. “శ్రీ వేంకటశాస్త్రిగారు పద్యము చదువుటయనగా శ్రోతలను ముగ్ధులను చేయుట. ఆ రాగము, ఆ విఱుపు, ఆ ఉదాత్తానుదాత్తములు, వారి కంఠ మాధుర్యము, వారి మహావ్యక్తిత్వము – ఇవి యన్నియు కలిసి శ్రోతులను తలక్రిందులు చేయుచుండెడివి.” అసలు వేంశాగారే ఏదో ప్రసక్తిలో “నా పద్య పఠనధోరణి గాయకులు గూడ నభినందించిరి” అని చెప్పారు. సుఖసుఖాలా ఇంకొకరిని మెచ్చని పుట్టు పండితుడు, తృణీకృత బ్రహ్మపురందరుడు ఆదిభట్ల నారాయణదాసుగారే విజయనగరంలో కలసినప్పుడు, ఎక్కడేనా సమావేశాలు, సభలలో తటస్థపడినప్పుడు వేంశా పద్యపఠనం కోరి వినేవారు ఎన్నోమాట్లు.

విశ్వనాథవారు ఒక సందర్భంలో “మా గురువుగారు పొరబడి ఈ స్కూలు మాష్టరీపనికి ఒప్పుకొన్నారుగానీ, వారి కంఠస్వరంతో రికార్డులు ఇచ్చినట్లయితే లక్షలు సంపాదించేవారు” అని కితాబు నిచ్చారు.



తిశా, వేంశాల కవిత్వాన్ని పోల్చి చూడటం అంత సదుద్దేశ్యం కాకపోయినా వేంశాగారిలోనే ఈ చాపల్యం కొంత లేకపోలేదు. గనుక కొంచెం ఆ సంగతి కూడా చదువరుల దృష్టికి తెస్తాను.

1934లో బందరులో జాతీయ కళాశాలలో కాటూరి వేంకటేశ్వరరావు ఆధ్వర్యంలో వేంశా గౌరవార్థం విందు జరిగింది. ఈ విందుకి ఎక్కువమంది ఆహూతులు వేంశా శిష్యులే. అందరూ తివేం కవుల పద్యాలు చదివారు. విశ్వనాథవారు కూడా కొన్ని చదివారు. అప్పుడు గురుశిష్యుల మధ్య సంభాషణ–

**వేంశా** : ఈ పద్యములు నేను వ్రాసితినందువా? తిరుపతిశాస్త్రి వ్రాసెనందువా?

**విశ్వ** : తిరుపతిశాస్త్రిగారే వ్రాసియుండవలె.

**వేంశా** : ఎందుచేత?

**విశ్వ** : తిరుపతిశాస్త్రిగారి రచనలో కొంత జిగిబిగి యుండును. ఈ పద్యమునందది కలదు.

గురువు ఆపై మౌనం వహించాడు. కోపపడనందుకు శిష్యుడు "రక్షింపబడితిని" అనుకొన్నాడు.

ఈ శషభిషలన్నీ ఎందుకనుకొని కాబోలు వేంశా మామా రచనా విభాగము అనే వ్యాసంలో కలిసి రాసినవి, విడివిడిగా రాసినవి ఏవో రాసిపోసి తేల్చారు. 1920లో తిశా కైలాసవాసులవక ముందు వచ్చిన తిరుపతి వేంకట కవుల కవిత్వం 1920 తరువాత వచ్చిన కవిత్వం కంటే రంజకంగా ఉందనే సాహసోపేతమైన మాట పల్కుతున్నందుకు పాఠకులు నన్ను మన్నించాలి. నా బుద్ధికి అలా తోచింది.

అందుకే వేంశా వచనం వైపు మొగ్గారా అని కూడా అనిపిస్తుంది. 1920 తరువాతే వారి వచనం తామరతంపరగా వెలువడింది. అదీగాక పత్రికల సంఖ్య పెరగడం, కవిత్వం కన్నా వచనాన్ని ఆదరించే పాఠకవర్గం పెరగడం కూడా ఇందుకు కారణం కావచ్చు. గాలివాలు చూసి తెరచాప ఎత్తడమో, ముడవడమో వేంశాకి ఎవరూ నేర్పనక్కరలేదు. తదుపరి వారు వెలువరించిన పద్య వాఙ్మయం తక్కువది కాదు. అయినా జంట కవనం రోజులలో అల్లిన పద్యనాటకాలకే అప్పుడు ఇప్పుడూ ఆదరణ. అది వారిద్దరూ బ్రతికి ఉన్నప్పుడు పెల్లుబికే ఉత్సాహావేశాలు అని అనండి – ఒకరిలో కనబడిన లోటును మరొకరు దిద్దుకుంటూ వచ్చారు అని అనండి – నాటకసమాజాలు గుక్కతిప్పుకోకుండా మనకు ఊపిరాడనివ్వకుండా ఆ పాండవోద్యోగ విజయాలని ఎల్లెడలా ప్రదర్శించడం అని అనండి (నాకైతే పాండవోద్యోగ నాటక విజయాన్ని రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం ఖ్యాతితో ఉపమించాలి అనిపిస్తుంది) మొత్తానికి జంట కవనానికి వచ్చిన ఖ్యాతి ఒంటరి

కవనానికి రాలేదనే నా ఉద్దేశ్యం. నిజానికి 1930 తరువాత వేంశా పద్యకవిత్వంలో గాఢత పెరిగింది. విశ్వనాథవారు చెప్పే "జీవునివేదన" అందులో కదలాడటం ప్రారంభమయ్యింది. నిగూఢత పెరిగింది. వేదాంతభావన మెండయ్యింది. ఇదంతా చెప్పడం వెనుక ఉద్దేశ్యం ఏమిటంటే 1920 ముందు వారి కవిత్వంలోని కేవల జనరంజకత ఆ తరువాత కాలపు కవిత్వంలో తగ్గి పాండిత్యగరిమ వెల్లడి కావడం మొదలయ్యిందని తెలియడం కోసం.

వేంశా చెప్పే కబుర్లలో ఎన్నోచోట్ల పునరుక్తి కనబడుతుంది. ఒకే కథ రెండు మూడు సందర్భాల్లో మళ్లీమళ్లీ చెబుతారు. అయితే వాటిని "ఎడిట్" చేయడం కుదరదు. చెప్పిన ప్రతిసారీ కథలో కొత్తవిశేషాలు అదనంగా చేరుతుంటాయి. కథనరీతి నూతనజాతీయాలతో ఆకర్షవంతంగా మారిపోతుంది. మంచివచనం రాయడం, మాట్లాడటం తగ్గుతున్న ఈ రోజులలో వేంశా వచన పఠనపాఠనాలు ఆ కొఱతను కొంత తీరుస్తాయనే నా భావన.

"లోకుల రసనలె యాకులుగా నుండునట్టి యవివో కవితల్" అనే భాగ్యం పట్టిన కవులలో తివేం కవులది పెద్దఖాతా.



నా అదృష్టమేమిటో గానీ లోగడ హరికథా పితామహ ఆదిభట్ల నారాయణదాసు గారి స్వీయచరిత్ర 'నా యెఱుక' ముద్రించేటప్పుడు తలవని తలంపుగా బొమ్మిడాల శ్రీకృష్ణమూర్తిగారితో అజ్జాడ, విజయనగరం కలసి చూడడం సంభవించింది. మళ్లీ చెళ్లపిళ్లవారి ఈ కాశీయాత్ర పని మొదలెట్టి డి.టి.పి. కూడా అయిన తరువాత ఒకరోజు ఆయన "కాశీ వెళ్దాం, బయల్దేరు" అన్నారు. అప్పటి వరకూ వారికి ఆ ఊహ ఉందని నాకు తెలియదు. నేను ఈ పుస్తకం పని చూస్తున్నానని వారికీ తెలియదు. అసలు అప్పటి వరకు మా చూపు "ఆంధ్ర మహానగరం" ఓరుగల్లు పట్టణం, శిల్పకళాధామం రామప్ప దేవాలయం మీద ఉంది. దసరా సెలవలలో అటు విజయం చేయాలని మా ఊహ. హఠాత్తుగా కృష్ణమూర్తి గారు ప్రయాణాన్ని కాశీ క్షేత్రంవైపు తిప్పారు. ఈ రెండు సంఘటనలను కాకతాళీయమనే అనుకోవాలా! పైగా ఎలా వెళ్లాను వారితో! కన్యాశుల్కంలో బైరాగి చెప్పినట్లు "పవనం బంధించి ఖేచరీ గమనమ్మీద ఆకాశమార్గాన వాయువేగంగా" వెళ్లాను. కాకపోతే బైరాగి కాశీనుండి విజయనగరం అలా వచ్చానని సొరకాయలు కోశాడు. నేను విజయవాడ నుండి కాశీకి నిజంగా అలా వారితో వెళ్లాను.

కదలాడు నెచ్చోట కవిసార్వభౌముని
సరస సువర్ణసీసాల హేల
అగుపించు నెచ్చోట అక్షర రూపమై
శివసుమర్చన కళాశీల లీల
అలరారు నెచ్చోట వ్యాసర్షి, కుంభ సం
భవ మహేశ్వర దివ్య భక్తిడోల
హవణిల్లు నెచ్చోట అల డుంఠి దేవతా
ద్యతుల ప్రభావ మహత్త్వ ఖేల
అతిశయిల్లును ఎచ్చోట అఖిల జీవ
పాప విదళిత దైవ ప్రవాహమాల
అట్టి ఇచ్చోట చేర గణ్యంబు గాదె !
సార పుణ్యైక వారాశి వారణాసి.

*(శ్రీకాశీ కవితా సమారాధనము –*
*రామడుగు వేంకటేశ్వరశర్మ)*

అలాంటి వారణాసిలో నవంబర్ 19 నుండి 22 వరకు కృష్ణమూర్తిగారూ, నేనూ ఉన్నాము. కాశీ, వారణాశి సమానార్థకాలుగా వాడుకొనే పదాలే అయినా తేడా లేకపోలేదు. ముందు ఆ విషయం స్పష్టపరచి మిగిలిన సంగతులు చెప్తాను.

కాశీ క్షేత్రానికి సరిగ్గా కేంద్రబిందువులో ఉన్న శివలింగానికి మధ్యమేశ్వర లింగం అని పేరు. ఈ మధ్యమేశ్వరలింగం నుండి దేహలీ వినాయకుని మందిరం వరకు ఒక తాడు పట్టుకొని, మధ్యమేశ్వర లింగం వద్ద తాడును కదలకుండా వృత్తాకారంగా తిప్పితే ఎంత వైశాల్యం గల స్థలం ఏర్పడుతుందో అది బహుపుణ్య ప్రదమైన శ్రీ కాశీ క్షేత్రం.

దక్షిణంగా వరుణానది, ఉత్తరంగా అస్సినది, తూర్పున గంగానది, పడమర పాశపాణి గణేశ్వరమందిరం ఈ హద్దుల మధ్యగల క్షేత్రం వారణాసీపురం. ఇది ఐదు క్రోసుల వైశాల్యంగల ప్రాంతమట.

విశ్వేశ్వరలింగం చుట్టూ నాలుగు దిక్కులా రెండు వందల ధనువులమేర స్థలాన్ని అవిముక్త క్షేత్రం అంటారు. ధనువు అంటే సుమారు ఆరు అడుగులు.

తూర్పున గంగ, దక్షిణాన బ్రహ్మేజ్ఞానేశ్వర లింగం, పడమర గోకర్ణేశ్వర లింగం, ఉత్తరాన బారుభూతలింగం – ఈ హద్దుల మధ్య క్షేత్రానికి అంతర్గృహం అని వాడుక.

కాశీలో ఈ నాలుగు స్థలాలు దివ్యతరం. కాశీక్షేత్రం అంతా ప్రశస్త పుణ్యభూమి అయినప్పటికీ పైన పేర్కొన్న నాలుగు స్థలాల దర్శనమే కాదు. తలుచుకోవడం అమిత పుణ్యప్రదమని పురాణోక్తి.

ఆనందకాననం, మహాశ్మశానం, అవిముక్త క్షేత్రం అయిన కాశీని మొదటి చూపులో "అబ్బ! ఏం రోత" అనుకొన్నాను. కాశికాపురము నందంతటా ఇరుకు సందులే. ఒక్కొక్క సందు వెడల్పు నాలుగు అడుగులకు మించదు. ఆవులు, ఎద్దులు, మనుషులు ఒకరికొకరు రాసుకుంటూ తప్ప ఆ సందులలో తిరగలేరు. ఎక్కడ చూసినా పేడ, రొచ్చు. దీనికి తోడు అంత సన్నసందులలోనూ రయ్యిమని మోటారుసైకిళ్లపై స్థానికులు, నారీ నారీ నడుమ మురారి, హరికీ హరికీ మధ్య వయారిలాగా ఇంటిపక్కన ఒక మందిరం, మందిరం పక్క యిల్లు పడుగూ పేకలాగా అల్లుకుపోయి ఉంటాయి. "కాశీలో ఉన్న లింగాల సంఖ్య ఇంత అని నేను కూడా చెప్పలేను" అని శివుడు పార్వతీదేవితో అన్నాడట. ఆ మాట నిజమేననిపిస్తుంది.

ఒక్కొక్క ఇంటి అరుగుపై పెద్ద కళాయిలో పాలు మరుగుతూ ఉంటాయి. పొడుగాటి కాడగరిటతో అడుగంటకుండా తిప్పుతూ – ఇప్పుడేదో మాసి ఉన్నాయి కానీ రెండు మూడు నెలల క్రిందట శుభ్రంగా ఉన్న బట్టలే అనిపించేవి వేసుకొని – నోట్లో పాన్‌పరాగో, ఖైనీయో నములుతూ ఒక 'భాయీ' ఉంటాడు. కళాయి పెట్టిన అరుగు మీద మూలకో, లేదా వీధిలోకో నోరు నిండినప్పుడు తుపుక్కుమంటూ ఉంటాడు. కొనవచ్చిన వారితో మోర ఎత్తి మాట్లాడుతుంటాడు తుంపర్లు వారిపై పడకుండా. ఇవికాక కొన్ని సందులలో (నేను మాటిమాటికీ సందులు అంటున్నాను కానీ అక్కడి వారికి అవి వీధులే) ప్రతి పావుగంటకీ ఒకటి చొప్పున ఎర్రబట్ట చుట్టిన పార్థివదేహాలు మణికర్ణికా ఘట్టానికో, హరిశ్చంద్ర ఘట్టానికో దహనానికి వెళ్తుంటాయి. ఐతే ఈ కశ్మలమంతా నాకు 'ఇదిగా' అనిపించింది మొదటిరోజే.

హైందవధార్మికజీవనంలో కాశీ పాలలోని వెన్నవంటిదన్న స్ఫురణ రాగానే అకస్మాత్తుగా నా భావనలో నాకే ఆశ్చర్యకరమైన మార్పు వచ్చింది. నేను చూసినట్లుగా కాశీ కొన్ని వందల సంవత్సరాలుగా ఉండే ఉంటుంది. అయినా ఇన్ని వందల యేళ్లుగా అన్ని కోట్ల మందిని కాశీ ఎలా ఆకర్షించగలుగుతుంది – ఈ నీటిలో, ఈ గాలిలో, ఈ మట్టిలో ఏదో అలౌకికమైన అంతర్విభూతి లేకపోతే?

ఈ వీధుల్లోనే కదా, బుద్ధభగవానుడు చేత భిక్షాపాత్రతో, అప్పుడే సమకూరుతున్న శిష్యబృందంతో ధర్మప్రబోధం చేస్తూ తిరిగింది.

ఈ వీధుల్లోనే కదా, ఒక అరుగుమీద సహస్రాధిక మాసజీవి అయిన పండితుడొకడు కూర్చొని "డుకృఞ్ కరణే" అని పాణినీయ సూత్రాన్ని వల్లెవేస్తుంటే ఆదిశంకరాచార్యులవారు అతికరుణతో "ఇంకా ఎన్నాళ్లు ఈ శుష్కసూత్రాలను వల్లె వేస్తావు, ఇంక ఎప్పటికి గోవిందనామాన్ని భజించి ముక్తిమార్గంలోకి నడుస్తావు" అని ప్రబోధించింది!

ఈ మణికర్ణికా ఘట్టానికి శ్రీశంకరులు స్నానానికి వెళ్తుంటేనే కదా, నాలుగు కుక్కలతో చండాలుడు ఎదురయ్యింది. "తప్పుకో" అని గద్దించిన శంకరాచార్యులతో 'ఎవర్ని తప్పుకోమంటున్నావు, నన్నా? నాలోని ఆత్మనా?' అని ప్రశ్నించి జగద్గురువుని జాగరితం చేసింది ఈ కాశీ వీధుల్లోనే కదా!

ఈ వీధుల్లోనే కదా, కబీర్ 'రామ్ రహీమ్ ఒక్కడే' అని నినదించింది. 'రాయిని దేవుడు అనుకోకండి. అట్లాగైతే తిరగలికే నేను మొక్కుతాను. అది కనీసం పిండైనా ఇస్తుంది' అని సకలజీవరాశిలో నిబిడీకృతమైన దైవశక్తిని కానకుండా రాయి రప్పకి మొక్కే జనులకి ప్రబోధించింది ఈ వీధుల్లోనే కాదా? ఎందరు మహానుభావుల, సాధు సత్పురుషుల పాదస్పర్శభాగ్యానికి ఎన్ని యుగాలనుండి ఈ కాశీవీధులు నోచుకున్నాయో. ఆ వీధుల్లోనే కాదా నేను తిరుగుతున్నది అనే భావోద్వేగపు తాత్కాలికోద్రేకం నన్ను చుట్టుముట్టింది.

అసలు కాశీవెర్రి తెలుగువాళ్లకి ఎక్కువేమో అనిపిస్తుంది. పూలల్లో కాశీరత్నాలు, కూరగాయల్లో కాశీవంగ, కాశీదొండ, పండ్లల్లో కాశీరేగు, కాశీ భోగాలు అని వరిలో ఒకరకం, మిఠాయిల్లో కాశీమిఠాయి, దారాల్లో కాశీదారం. కాశీవఝ్ఝుల, కాశీసోమయాజుల, కాశీభట్ల, కాశీనాథుని, కాశీ, వారణాశి ఇంటి పేర్లున్నాయి మనకు. కాశీనాథ్, కాశీవిశ్వేశ్వరరావు, కాశయ్య, కాశీవిశ్వనాథ్ అనే పేర్లు సర్వసాధారణం.

కాశీకి వెళ్లి కోడిఈక తెచ్చినట్లు, కాశీలో కొబ్బరికాయ కానీ, కాశీగంగలో మునిగినంత మాత్రాన గాడిద గుర్రమవుతుందా?, కాశీకి వెళ్లినా కాటికి వెళ్లినా ఒకటే, కాశీ మిఠాయి తినని వాడూ ఏడుస్తాడు తిన్నవాడూ ఏడుస్తాడు, గోహత్య చేసి కాశీకి వెళితే కుడుపక వదుల్తుందా?, కాశీలో గోహత్య చేసినంత పాపం, మోకాళ్లు నావి కాకపోతే కాశీదాక దేకుతానన్నాడట, (తాటిపట్టె, ఢిల్లీ అని కూడా పాఠాంతరాలు ఉన్నాయి. రాజకీయాల ప్రాధాన్యత పెరిగాక ఆధ్యాత్మికత వెనుకబడి ఈ సామెతలో ఢిల్లీ వచ్చినట్లుంది) చేసిన పాపం చెంగున కట్టుకొని కాశీకి పోతే కడతేరుతుందా, కాశీకి పోయినా కావడిమోత తప్పలేదు, కాశీలో అయినా, కళ్లంలో

అయినా కుక్క మొరిగేది భౌభౌమనే – ఇవి తెలుగులో కాశీ ప్రసక్తి ఉన్న కొన్ని సామెతలు.

ఇక మనరాజులు వేయించిన శాసనాలలో చెప్పనే అక్కర్లేదు. శాసనం చివర్న దీనికి తప్పి నడిచినవారు కాశీలో తల్లిదండ్రులను చంపినంత పాపం, కాశీలో గోహత్య చేసినంత పాపం మూట కట్టుకుంటారని శిలాక్షరంగా రాయించారు. ఇవన్నీ తెలుగువారిపై కాశీ ప్రభావం తెలిపేవే.

కాశీ ఆధ్యాత్మిక క్షేత్రమే కాదు, పురాతన కాలం నుండీ గొప్ప విద్యాపీఠం. ముఖ్యంగా వ్యాకరణాధ్యయనానికి కాశీయే గమ్యస్థానం. కొవ్వూరి గోపాలశాస్త్రి, భాగవతుల హరిశాస్త్రి, పుల్లెల దక్షిణామూర్తి, ఇంద్రగంటి గోపాలశాస్త్రి, బొమ్మగంటి సుబ్రహ్మణ్యశాస్త్రి, యడవల్లి చంద్రశేఖరభట్టాచార్యులు, యడవల్లి జానకీరామశాస్త్రి, దండిభట్ల విశ్వనాథశాస్త్రి, భట్టాచార్య గంగాధరశాస్త్రి, కర్ణాట సీతారామశాస్త్రి, ఇంద్రగంటి విశ్వపతిశాస్త్రి, చర్ల బ్రహ్మయ్యశాస్త్రి, అహోబలశాస్త్రి, మంత్రవాది లక్ష్మీనారాయణశాస్త్రి 19వ శతాబ్దిలో కాశీలో చదువుకొన్న మహాపండితులలో నేను తెలుసుకోగలిగిన కొన్ని పేర్లు. వారందరిలో అహోబలశాస్త్రిగారు మరీ ఉద్దండులట. కాశీలో ఉన్న వ్యాకరణపండితులందరినీ జయించి "కాశ్యామేకః కాశీనాథోఽవశిష్టః" కాశీలో విశ్వనాథుడు తప్ప నేను జయించవలసినవారు లేరు అన్నంత ప్రశస్తిని గడించారట.

పురాతనకాలం నుండి భక్తజనులను ఆకర్షిస్తున్న విశ్వనాథాలయం ఇప్పుడు మసీదు క్రింద అణిగిపోయి ఉన్నదని, ప్రస్తుత విశ్వనాథ మందిరాన్ని నర్మదా నదిలో ప్రత్యక్షమైన శివలింగంతో ఇండోర్‌రాణి దేవి అహల్యాబాయి హోల్కార్ 1780లో కట్టించిందని తెలిసినా సరే, విశ్వేశ్వర మందిరాన్ని అప్పటి విశ్వేశ్వర మందిరమే అన్నంత అమితభక్తితో దర్శించి మరలి వచ్చాను. 'యద్భావం తాదృశీ' అని అన్నారు కదా!

కాశీ గురించి చెప్పి గంగ గురించి ప్రస్తావించకుంటే ఎలా?

రంగదనంత భవ్యధవళ ప్రభవాఢ్య తరంగ, కాశికా
గంగ, దయాంతరంగ, పరికల్పిత పాపతమః పతంగ, శు
భ్రాంగ, నిమజ్జనౌఘపరివర్తిత పావన దివ్యభావ వీ
థ్యంగ నుతింతు . . . . . .

*(శ్రీ కాశీ కవితా సమారాధనము–*
*రామడుగు వేంకటేశ్వరశర్మ)*

అని స్తుతిస్తూ గంగానది ఒడ్డుకు పరుగుపరుగున చేరాను. వెళ్లిన వాళ్లందరూ చెప్పినదే, అప్పుడప్పుడూ పత్రికలలో చదివిన సంఘటనలే కనబడ్డాయి.

గంగానదిని చూస్తే ఏడుపు ఒకటే తక్కువ. ఉత్తరాదిలో కాస్త ధార్మికుడైన వాణ్ణి ఎవణ్ణైనా కదిలించి చూడండి. మనం గంగ, గంగానది అంటాం కానీ వాళ్లు మాత్రం మాయీ గంగ, గంగా మాయీ, గంగాజీ అనే అంటారు. గౌరవం పిలుపులో మాత్రమే. చేతలలో ఉండదని కాశీలో గంగానది ఒడ్డున తిరుగుతుంటే తెలుస్తుంది. గంగనీటిలో సకల కల్మషాలు ఉన్నట్లు చర్మచక్షువులకే తెలుస్తుంది. అదంతా ఏకరువు పెట్టను కానీ ఒక్క దుశ్చేష్ట తెలియజేస్తాను.

ఊళ్లో ఎక్కడా కుదరనట్లు ఆ గంగానది ఒడ్డుమీదనే ప్రజానీకం క్షవరం చేయించుకొంటున్నారు. అదంతా గంగలోకే నెడుతున్నారు. కర్మాగారాల నుండి వెలువడి కలుస్తున్న విషాలతో పోలిస్తే ఇది ఏమాత్రం పట్టించుకోదగినది కాకపోయినా అమిత పూజనీయ గంగామాతను గౌరవించడం ఇలాగా! ఈ ఖర్మ ఇప్పటిది కాదని తరువాత తెలిసింది. ఏనుగుల వీరాస్వామయ్య కూడా ఒడ్డుమీద క్షవర కల్యాణఘట్టం ముగించుకొనే రంగంలోకి దిగారు. 1860లో కాశీ దర్శించిన విశాఖజిల్లావాసి రాంభట్ల జగన్నాథశాస్త్రి ఈ విషయం గమనించి కొంచెం రోతపడ్డారు. ఆయన గమనించిన ఇంకో విశేషం కూడా చెప్పారు. సుమంగళి అయిన స్త్రీ భర్త ఎడమతొడ మీద కూర్చొని మరీ జుట్టు తీయించుకోవాలట. మారిన పరిస్థితులకు అనుగుణంగా మనం ఎన్నో దురాచారాలను మానుకొన్నాం. స్మృతులను, శాస్త్రాలను సవరించుకొన్నాం. పాత సంప్రదాయాలను వదిలించుకొని, కొత్త సంప్రదాయాలను ప్రతిష్ఠించుకొన్నాం. ఇలాంటివాటిని మనం మానుకోలేమా? 'వివేకభ్రష్ట' అని భర్తృహరి గంగని పొరపాటున అన్నాడు కానీ, అనవలసింది గంగఒడ్డుకి భక్తిపేరుతో చేరి గంగలోకి సమస్త కశ్మలాన్ని దిగవిడిచి వెళ్లే ప్రజానీకాన్ని. ఏది ఏమైనా గంగ, కాశీ భారతీయ ధార్మిక జీవధాతువులు.



ఇక కాశీ ప్రసక్తిని విడిచి మళ్లీ చెళ్లపిళ్ల వద్దకు వస్తాను. చెళ్లపిళ్ల వారి కథలు – గాథలు అంటే ఉన్న మోజుతో శ్రీరమణగారితో సంప్రదించి "విదేశాలలో ఉన్న స్వదేశీహస్తంతో" పునర్ముద్రించే ప్రయత్నం చేసినా అది ముందుకు సాగలేదు. ఆ పుణ్యం చివరకు ఎమెస్కో వారు కట్టుకొన్నారు. ఆ ప్రచురణలో ఏ సహస్రాంశమో నాకు పాలు ఉందనే సంతోషం మాత్రం ఉంది.

కాశీయాత్ర ప్రచురణ సన్నాహంలో ఇంకొక రెండు చెళ్లపిళ్ల రచనలు దొరికాయి. ఇవి కథలు – గాథలు సంపుటాలలో చేరలేదు. అందుకని 'కాశీయాత్ర' తో పాటే వాటినీ కలిపి ప్రచురిస్తున్నాను. ఒక రకంగా ఈ సంపుటాన్ని 'కథలు – గాథలు' చివరి సంపుటంగా భావించవచ్చు.

దీనిని చెళ్లపిళ్లవారు 1948లో ఒకసారి ముద్రించారు. మరలా 1955లో ప్రచురించారు. డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారి సంపాదకత్వంలో ఒకసారి ప్రచురించారు. అయినా చెళ్లపిళ్ల మీద ఉన్న గౌరవభావం నన్ను కృతి ముద్రణకి ప్రోత్సహించింది.

"కొంటెలలో కొంటె" అయిన వేంశా స్వభావం అర్థం చేసుకొని నవ్వులో కొంటెతనం ద్యోతకమవుతున్నట్లు ఉండే చిత్రం వేసిన రాయన గిరిధర్‌గౌడ్‌గారికి కృతజ్ఞతలు.

నన్ను స్వజనంలో ఒకడిగా మన్నన చేస్తారు శ్రీరమణ. ఎప్పుడు మాట్లాడినా మనస్సుని ఆనందపరిఫుల్లం చేస్తారు. కోరిన ప్రకారం "ముందుమాట" ఇచ్చారు. వారికి ధన్యవాదాలు.



గతంలో నేను సంపాదకునిగా వనమాల (శ్రీకృష్ణదేవరాయల పంచశతాబ్ది పట్టాభిషేక ఉత్సవ సంచిక), చారిత్రక వ్యాసమంజరి (మల్లంపల్లి సోమశేఖరశర్మ గారి చరిత్ర వ్యాసాలు) బౌద్ధయుగము (మల్లంపల్లి వారివే బౌద్ధ సంబంధ వ్యాసాలు) నా యెఱుక (ఆదిభట్ల నారాయణదాసుగారి స్వీయ చరిత్ర) పుస్తకాలు ప్రచురితం అయ్యాయి.

సంపాదకుని బాధ్యతలు ఏమిటో ఎక్కడా నేను చదవలేదు కానీ ఇవి అయి ఉండవచ్చని కొన్ని ఊహించుకొన్నాను.

1. ప్రచురించబోయే పుస్తకం వీలైనన్ని ముద్రణలను సేకరించడం.
2. వీలైతే వ్రాతప్రతినే సేకరించగలగడం.
3. వేరు వేరు ముద్రణలను జాగ్రత్తగా చదివి పెంపులు, తగ్గింపులు ఉంటే గుర్తించడం.
4. రాతప్రతే దొరికితే ముద్రిత ప్రతితో పోల్చి చూడటం.
5. రచయిత రాసిననాటి విషయాలు తరువాతి కాలంలో సవరించ బడినా, అసత్యమని తేలినా, అదనపు అంశాలు కనుగొనబడినా వాటిని ఆయాచోట్ల పాదసూచికల రూపంలో తెలియజేయడం.

6. ఇప్పుడు వాడుకలో లేని పదాలకు, కఠిన పదాలకు సరియైన అర్థాన్ని లేదా రచయిత ఉద్దేశించిన అర్థాన్ని తెలియజేయడం.
7. రచయిత ఉపయోగించిన ఉద్ధరణలకు చేతనయినంత వరకూ మూలాన్ని కనుగొనడం.
8. ఆయా వ్యక్తులు ప్రస్తావనకొచ్చినప్పుడు, వారి పరిచయాన్ని స్వల్పంగానైనా తెలియజేయడం.
9. సందర్భానికి తగిన ఛాయాచిత్రాలను సేకరించగలిగితే యివ్వడం.
10. అన్నింటికంటే ముఖ్యంగా రచయిత హృదయానికి భిన్నంగా కాకుండా అచ్చుతప్పులు లేకుండా ముద్రించగలగడం.

ఒక పుస్తక సంపాదకుడి ఉండవలసిన లక్షణాలు ఇవి అని నా తలపోత. వీటిలో కొన్ని అయినా నేను పాటించగలిగాను.

ఈ పుస్తకంలో కూడా ఇదివరలో నేను సంపాదకత్వం వహించిన పుస్తకాలకు మాదిరిగానే పాఠకుల అవగాహనకు తోడ్పడతాయి అనుకొన్న కొన్ని అధోజ్ఞాపికలను ఉంచాను. చేర్చదగిన కొన్ని ఛాయాచిత్రాలను చేర్చాను. వ్యాసాలలో బ్రాకెట్లలో, ఇటాలిక్స్‌లో ఉన్నవి నేను ఉంచినవి. ఈ ప్రయాస అంతా పాఠకుల పని సులభతరం చేయడానికే అని గమనించకోరుతున్నాను.

కాశీయాత్ర గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి కృతజ్ఞతలు.

చెళ్లపిళ్లగారి గురించి చెప్పవలసిన మాటలలో స్వంతగొడవ కూడా కలసినందుకు చదువరులు అన్యథా భావించరని ఆశిస్తూ, ఇప్పటికి సెలవు అర్థిస్తున్నాను.

శ్రీ నందన మార్గశిర శుద్ధ పంచమి<br>గుంటూరు, 17-12-2012.

భవదీయ<br>**రవికృష్ణ**



# మా గురువుగారు

*విశ్వనాథ సత్యనారాయణ*

నేను నాల్గవ ఫారములోనికి వచ్చితిని. అంతటి వఱకు కవికులగురువై తరువాత తరువాత నేను గురువుగా స్వీకరించిన శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిని నేనెఱుగ లేకపోతిని. వారు మాకు తెలుగు చెప్పుటకు రానారంభించిరి. బక్కపలుచని వాడు, పొట్టివాడు, చామనచాయ యనుటకు మించిన నల్లని మేనివాడు. కాళ్లకు పావుకోళ్లు, ధోవతి, లోన తెల్లని చొక్కా, పైన నొక కోటు. అవి మాయనివి కావు మాసినవి కావు. ఒక తలగుడ్డ. మొగమున విభూతియు గంధమును నొసట పెద్ద కుంకుమ బొట్టు, ఎప్పుడు ప్రక్కననొక గొడుగు. కళాశాలలో నిది వారి వేషము. ఇందులో నే యొక్కటి తగ్గినను మొత్తము మీద నూరిలో తిరుగుటకు నిదియే వేషము. ఒక్కొక్కప్పుడు వారి చదువే మాకు మొదటి గంట. అనగా గంటలో సగమైన గాని రారన్నమాట! మా పాఠశాలకు సుంత దగ్గరలోననే వారి యిల్లు. దానిని బచ్చుపేట యందురు. అది యొక సందులో నున్నది. ఒక ముద్రాక్షరశాలయున్నది. దాని ప్రక్క సందులో నుండి దాని వెనుక సందులోనికి పోవలయును. రెండు సందులు ముద్రాక్షరశాల నంటుకొనియే యుండును. వారి గ్రంథము లా ముద్రాక్షరశాలలో[1] నచ్చు వేయుదురు. ముద్రాశాలాధికారి వారికి స్నేహితుడు. ముద్రాశాలాధికారికి వారు దైవము. అది ఆయన భాగధేయమనుకొను చుండెడివాడు. పాఠశాల గంట వారియింటికి వినిపించుచుండును. పాఠశాల తెఱచువేళ పావుగంట యున్నదనగా మొదటిగంట కొట్టుదురు. అంతవఱకు వారు కవిత్వమును వ్రాసికొంచు కూర్చుందురు. గంట విన్పించినంతనే తొందరపడుదురు. అప్పుడు పద్యము పూర్తియైనచో వెంటనే లేతురు. పూర్తిగానిచో పూర్తిచేసి లేతురు. లేచి యేమి చేయవలె? ఒక ధోవతి కట్టుకొని, ఒక తువ్వాల పైన వేసికొని చిన్న బొక్కెనయు త్రాడును పూని ఈ రెండు ఫర్లాంగుల దూరము స్నానము కొఱకు

---

**1.** ఈ ముద్రాక్షరశాల పేరు భైరవ ప్రెస్. వేంశా బందరులో ఉన్నంత కాలం వారి రచనలన్నీ దీనిలోనే అచ్చు వేయించేవారు. ప్రెస్ యజమానికి ఉన్న భక్తి వలన అచ్చు ఖర్చు వేంశా ఎంత యిస్తే అంత. ఇదికాక నోటు లేకుండా ఎప్పుడు కావాలంటే అప్పుడు వారికి కావలసినంత ధనం ప్రెస్ యజమాని వద్ద అప్పు తీసుకొనేవారు.

పాఠశాల యావరణలోనికి రావలయును[2]. బందరు సముద్రమునకు దగ్గఱి యూరు. బావులలో నీళ్లుప్పన. ప్రతిదిన మా నీళ్లతో స్నానము చేసినచో నొడలు దురద లెక్కును. అవి వాడుకొనుటకు పనికివచ్చును గాని స్నానపానములకు పనికిరావు. పాఠశాల యావరణలోని బావి మంచినీళ్లబావి. అందుచేత గురువుగారు అచ్చటికి వచ్చియే స్నానము చేయుదురు.

ఇచ్చటికి రావలయును. ఇంటినుండి యిక్కడికి దూరము సుమారు రెండు ఫర్లాంగులైన నుండును. స్నానము చేయవలయును. ఇంటికి పోవలయును, భోజనము చేయవలెను, చొక్కా, కోటు మొదలైన దిరీసు (*Dress ఆంగ్ల పదానికి దేశీయ రూపం*) వేసికొనవలయును. అప్పుడు పాఠశాలకు రావలయును వారు. మొదటిగంటలో నరగంటయైన తరువాత శాస్త్రిగారు వచ్చుట జరిగినచో పిల్లల యదృష్టము. దినదిన మింతే. దాని కవధిలేదు. ఏ యితరోపాధ్యాయుడు నట్లు వచ్చుటకు వీలు లేదు. ప్రధానోపాధ్యాయుడు మందలించును. కఠినముగా చెప్పును. చివరకుద్యోగము నిలుచుటయు కూడ కష్టము. ఆయన మా గురువుగారి యందు నిస్సహాయుడు. సంవత్సరము మొత్తము మీద నెప్పుడైన నొకటి రెండుసార్లు వినయంతో మందలించినచో గురువుగారే మందురు? "నన్నేమి చేయమందురండీ! పాఠశాల యున్న దినములలో నేను ప్రొద్దుటిపూట సరిగా నన్నము కూడ తినను" మొదలైన మాటలు చెప్పుదురు. ఆ మా గురువుగారు బ్రతికియున్నన్నినాళ్లు ప్రభువు. పాఠశాలలో గూడ ప్రభువే!

తరగతిలోనికి వచ్చును. చెప్పులు బల్లక్రింద వదలును. గొడుగు కుర్చీకి ఆనించును. తలగుడ్డ బల్లమీద పెట్టును. వారిచేతిలో నెప్పుడు నింత కాగితముల కట్టయుండును. అవి కొన్ని వ్రాసిన పద్యాలు, పద్యాలు వ్రాయుటకు తెల్ల కాగితములు, అవసరమైన యొండు రెండు ముద్రితమైన గ్రంథాలు. లక్ష్మీదేవి విష్ణుని వక్షస్థలమున నెట్లనపాయినియో ఆయనచేతిలో నీ కట్ట యట్లు. కుర్చీలో చేరగిలబడి పాదములు బల్లమీద నుంచి ఆ కాగితములను తీసికొని బాలురతో "మీరు చదువుకొనుచుండు"డని చెప్పి తాను వ్రాసికొనుచుండును. ఇంతయైన తరువాత గంట ఎంత మిగులును? అయిదు పది నిముషముల లోననే వాడు గంట కొట్టును. ఈయన వ్రాయుచున్నది పూర్తిగావలయును గదా! తరువాతి

**2.** బొక్కెనను వేంశా తెచ్చేవారుకారు. దానిని పట్టుకురావటానికి ఊరిలోని పిన్నపెద్దలు పోటీపడేవారు. "శతావధానిగారికి ఈ రోజు బొక్కెన నేను తీసుకువెళ్లాను" అని ఆనందపడేవారు. మోసేవంతుకోసం పోటీపడి ఒక్కసారి బొక్కెన తెచ్చి ఆనందపడిన వారిలో ప్రముఖహాస్యరచయిత రావూరు సత్యనారాయణగారొకరు.

గంట మేష్టరు వచ్చి నిల్చుండును. కొంతసేపటి కీయన యాయనను చూచి లేచి వెళ్లును. వారు మాకు పాఠము చెప్పవలయునన్నచో వారికా గంటలో గాని ఆ పూటలోగాని కవిత్వము వ్రాసికోవలసిన యవసరము లేకపోవుటయో తరువాత వ్రాయుదములే యన్న జాగు మనసులో కలుగుటయో హేతువులు. అప్పుడు పాఠము చెప్పెడివారు. ఎవడో నిలుచుండుటయు వాడు చదువుకొనుచుబోవుటయు నడుమ నడుమ గురువుగారు కొన్ని మాటల కర్థము చెప్పుటయు లేదా వారికి జ్ఞాపకము వచ్చిన కథలు చెప్పుటయు. నే నారవ ఫారములో నుండగా మా పాఠ్య గ్రంథములో నెవడో రచయిత "కూర్చొని" అని వ్రాసెను. గురువుగారు చదివెడివాని నాపి ఆ శబ్దము తప్పు అని చెప్పినారు. కూర్చు–ఉండు: కూర్చుండు – ఇది శబ్దపల్లవము. స్వార్థకము కూర్చుండి యగును గాని కూర్చొని కాదు. వారిట్లు చెప్పినవి నాకు కొన్ని డజన్లు జ్ఞాపకము. నా చదువులకు పునాది యిదే.

మేము నాల్గవ ఫారములో నుండగా గుంటూరిసీమకథ[3]. గురువుగారు మూడునెలలు పాఠశాలకు రాలేదు. మేము యథేచ్ఛముగా నుంటిమి. తిరిగి వచ్చిన తరువాత మా పంట పండినది. ఆ కథలు, ఆ పద్యములు రెండు మూడు నెలలు మాకదియే చదువు. నా చిన్నప్పుడు గుంటూరిసీమ, గీరతములోని పద్యములు వందలకొలది కంఠతః వచ్చును. నా తరగతిలో నేను తెలుగు పండితుడను. నేను కవిని. పోతుకూచి యజ్ఞనారాయణ యని మరియొకడుండెడివాడు. తరువాత తరువాత నా దస్తూరి చెడిపోయినది. వాని దస్తూరి బల్లిగ్రుడ్లవలె ముచ్చటగా నుండెడిది. మా కాంపోజిషన్ పుస్తకాలు కూడ శాస్త్రులుగారే దిద్దవలె. నామకః దిద్దెడివారు, ఎప్పుడైన చూచెడివారు. అతని దస్తూరికిని అతడు కూడ కొంచెము తప్పులు లేకుండా వ్రాసెడివాడు, దానికిని మా గురువుగారి కతని మీద ప్రేమ యెక్కువ. నన్ను పిలిచినచో వాని పేరుపెట్టి పిలిచెడివాడు. నాకు కోపముగా నుండెడిది. వాడు పద్యాలు వ్రాయలేడు. నేను వ్రాయగలను. వానికంటె నేనెక్కువ పండితుడనని నా యుద్దేశ్యము. నా పేరుతో వానిని పిలిచినచో వానికి గౌరవము గాని వాని పేరుతో నన్ను పిలిచినచో నాకవమానము కదా!

ఇట్లుండగా 'టరమ్' పూర్తి కావచ్చును. పిల్లలందఱకు మార్కులుండ వలయును. ఈ ఫారములలో ఈ మార్కులన్నింటిని పురస్కరించుకొని పరీక్ష యందుత్తీర్ణత యుండును. గురువుగారు చెప్పిన దేమిటి మేము వ్రాసినదేమిటి.

---

**3.** గుంటూరు శతావధానంలో (19, 20 ఆగస్టు 1911) తిరుపతి వేంకట కవులకు, కొప్పరపు కవులకు వివాదం ప్రారంభమై, అది ముదిరి ఎంతో కలహవాఙ్మయం ఉద్భవించటానికి కారణమైంది. ఆ పద్యాలన్నీ తిరుపతి వేంకట కవులు గుంటూరుసీమగా ముద్రించారు.

ఒక తరగతిలో ఈ మార్కులు మూడుమార్లైన వేయవలయును. గురువుగారన్నియు ఒక్కసారియే వేసెడివారు. ఒకడు లేచి నిలుచుండును. వాని నేదో శబ్దమున కర్థమడుగుదురు. వాడు చెప్పలేడు. వానికి క్రాపింగు లేదు. వాని మొగమున బొట్టున్నది. అందుచేత వానికి మూడైదులు పదునేనింటికి మూడు రెళ్లారు వేసెదువారు. ఇంకొకనిపేరు పిలువగా వాడు బహిర్దేశమునకు వెళ్లెనని చెప్పెడివారు. గురువుగారు "ఈ యూరినీళ్లు శీతపైత్యపునీళ్లు. వాడెంత యదృష్టవంతుడురా" యని మూడు రెండున్నరలు ఏడున్నర మార్కులు వేసెడివారు. ఇంకొకడెవడో ఆ మాట కర్థము చెప్పెడివాడు. సరియైన యర్థము. వాని కర్మము చాలక వాని మొగాన బొట్టులేదు. వానికి మూడు సున్నలు. నేను 1938లో విజయవాడ కళాశాలకు వచ్చితిని. వారు బెజవాడలో క్షీరసాగరము నందుండెడివారు. క్షీరసాగర మనగా ఒక కంటిఆస్పత్రి. దానికి సంబంధించిన గదులు కొన్ని బాడుగ కిచ్చెడివారు. ఒకసారి మా గురువు గారిని పిలిచి మా కళాశాలలో నొక యుపన్యాసమిప్పించితిని. ఆ సందర్భములో వారు మార్కులిట్లు వేయుటను గూర్చి చెప్పగా వారు నవ్వి "నేనట్లు చేసెడివాడ నందువా" యన్నారు.

ఆయన మడిగా పాఠశాలకు వచ్చును. మడిగా పోవును. వారి నెవ్వరును తాకకూడదు. విద్యార్థులు తాకుట జరిగినచో వారు కాలి పాపోజు తీసి కొట్టెడివారు. ఒకసారి పాఠశాల యొక్క ఉపప్రధానోపాధ్యాయుడుండగా నిట్లు జరిగినది. గురువుగారు "ఈ యింగ్లీషు చదువుకున్న వెధవలందరు నింతియే. వీరికి మడి తెలియదు. ఆచారము తెలియదు" అనగా నా యుపప్రధానోపాధ్యాయుడు కిక్కురు మనలేదు. వారి యందలి గౌరవ మట్లుండెడిది.

నేనైదవ ఫారములో నున్నాను. జిల్లా విద్యాధికారి పాఠశాలను పరిశీలించుటకు వచ్చినారు. మా తరగతిలోనికి ఎంతవాడు వచ్చినను మా గురువు గారు కుర్చీలో నుండి లేవరు. లేచి నట్లభినయింతురు. ప్రధానోపాధ్యాయుడును అధికారియు వచ్చిరి. వేఱ యాసనములు తెప్పించికొనిరి. కూర్చుండిరి. ఆ యుపాధ్యాయుడు పాఠము నెట్లు చెప్పుచుండెనో జిల్లాయధికారి చూడవలయును. ఆ పాఠ్యభాగము ఉద్యోగపర్వములోని కీచకఘట్టము. ద్రౌపది యప్పుడు సైరంధ్రీ వ్రతము నందున్నది కదా! ఆ శబ్దము వచ్చినది. జిల్లాయధికారి కొంచెము డొక్కశుద్ధియైనవాడు కాబోలును మమ్ము సైరంధ్రీ శబ్దమునకు వ్యుత్పత్తి చెప్పమనెను. చదివెడిది ఐదవ ఫారము, శబ్దములకు వ్యుత్పత్తి యేమి! ఈ రోగము మన విద్యావిధానములో నున్నది. శబ్దమున కర్థము తెలియదు. పద్యమున కన్వయము తెలియదు. సారస్వతమునం దభిరుచి కల్పించరు. ప్రకృతి వికృతులు వ్యుత్పత్తులు.

ఇది యొక జాతి నిర్మూలకమైన విద్యావిధానము. మాతృభాషా పరిజ్ఞానమును నాశనము చేసెడి విద్యావిధానము. "శతాంధాః కూపం ప్రవిశంతి".

సైరంధ్రికి వ్యుత్పత్తి మాకు తెలియునా? గురువుగారు మాత్రము చెప్పుదురా? మేము చెప్పలేకున్నచో నది గురువుగారి దోషమగును. మా గురువుగారికి కోపము వచ్చెను. వారిట్లనిరి. "అయ్యా! నేను దీనిని పిల్లలకు చెప్పలేదు" అనిరి. జిల్లా అధికారి యూరకుండవచ్చును గదా! గురువుగారిని చెప్పుమనిరి. ఆయనకు మరియు గోపము వచ్చెను. "నేనిదివఱకు దాని వ్యుత్పత్తిని గూర్చి తెలిసికొనలేదు. ఇప్పుడు తెలిసికొనను. భవిష్యత్తులో దానిని తెలిసికొనుట పరిహరింతును" అన్నారు. జిల్లాయధికారి "శాస్త్రులుగారికి కోపము వచ్చినట్లున్నది. నాకు తెలియక యడుగుచున్నాను" అన్నాడు. గురువుగారు "ఈ యూరిలో నిదిగో తూర్పు. తెలియనిచో నిటు తిరిగి దండము పెట్టుడు", అనగా జిల్లాయధికారి యేమి చేయును? ఆ దినములలో జిల్లాయధికారి చాల పెద్దపదవి. ఇప్పుడు మన సొంత మంత్రులు వచ్చిన తరువాత యే పదవియు పదవియే కాదు. అధికారికి కోపము వచ్చి వెడలిపోయెను. ప్రధానోపాధ్యాయునితో మాట్లాడెను గాబోలు! వారు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులలో నొకరనియు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారనియు జిల్లాయధికారికి తెలిసెను. ఆయన వెళ్లిన తరువాత మా గురువుగారు దాని వ్యుత్పత్తి మాకు చెప్పిరి. స్వైరం ధ్రియతి యితి సైరంధ్రీ. అందులోని వకారము లోపించును. అనగా 'తాను తన యిష్టము వచ్చినట్లుండు స్త్రీ'.

ఇంతకును శాస్త్రులుగారికి జిల్లాయధికారి మీద నంతకోపము ఎందుకు వచ్చినది అని ప్రశ్న. మా పాఠశాలలో నొక డ్రాయింగు మాస్టరుండెడివాడు. ఆయన తురకకులస్థుడు. పొట్టివాడు, బక్కపలుచనివాడు. కొంచెమెఱ్ఱనివాడు. ఎప్పుడును నవ్వుచుండెడివాడు, పెద్దగా నవ్వడు. ఆయన నవ్వినప్పుడు పై నడిమి దంతముల రెంటి చివళ్లు సన్నగా కన్పించుచుండెడివి. చాలా మంచివాడు. ఐదారుగురు బిడ్డలతండ్రి. ఆయనయందు మా గురువుగారి కవ్యాజకరుణ. ఆయన డ్రాయింగులో పరీక్షలేమియు కాలేదు. ఆయనకు నెలకు పదునేను రూపాయల జీతము. మా గురువుగారికి పాతికయో ముప్పదియో. జిల్లాయధికారి డ్రాయింగులో పెద్దపరీక్ష లిచ్చినాడట! పాఠశాలకు వచ్చుచునే డ్రాయింగు తరగతిలోనికి వెళ్ళెను. ఆ సాహేబుగారు తట్టుకొనలేకపోయెను. తాను పనికిరాడని యీ యధికారి వ్రాయును. తన యుద్యోగము పోవును. ఆయన తన యీ భయమును మా గురువుగారితో చెప్పికొనెను. వారిద్దరు స్నేహితులు గదా! 'ఆయన పని నేను చూచెదనులే' యని గురువుగారాయనకు వాగ్దానము చేసిరి.

సాయంకాలమున నందఱు గృహాభిముఖులై పోయెడునపుడు ఆవరణలోనే అధికారి గురువుగారిని చూచుట సంభవించినది. ఆయన గురువుగారితో నిట్లన్నాడు. "శాస్త్రిగారూ! నమస్కారము. క్షమించవలసినది. నాకు మీరెవరో తత్పూర్వము తెలియదు. అంత కోపమెందులకు వచ్చినది?" అని. గురువుగా రిట్లనిరి. "కోపమా! ఎందుకు రాదు. ఆ డ్రాయింగుమేష్టరు పేదవాడు. అతనికి అయిదుగురు పిల్లలు. పదునేనురూకల జీతముతో నెట్లు బ్రతుకును? మీరు వాని పొట్టమీద గొట్టినచో వాని కుటుంబ మేమి కావలెను? మీకేమి? మీరు పెద్ద పెద్ద జీతగాండ్రు. అందఱును బ్రతుకవలెనన్న యూహ మీకుండదు" అని.

చివరకు జిల్లా అధికారి యిద్దరిని గుఱించి చెడామడా వ్రాసిపోయెనట. ప్రతి సంవత్సరము ప్రతి జిల్లాయధికారియు, 'వీరీ యుద్యోగమునకు తగరు తీసివేయ వలయును' అనియే వ్రాయుచుండెడివాడట. పాఠశాలయొక్క ఆధికారిక సంఘము వారి నెప్పుడును తీసివేయలేదు. వారు మా గురువుగారిని తమ పాఠశాల కది గౌరవమని ఏరికోరి తెచ్చికొనిరి. మా గురువుగారా పాఠశాలలో పాతికేండ్లు పనిచేసిరి. వారిమీద నీ జిల్లాయధికారుల వ్రాతలేమియు పనిచేయలేదు. గురువుగారి మూలముగ డ్రాయింగుమాస్టారి ఉద్యోగము కూడ పోలేదు. ఆయనను తీసివేసినచో తానీయన లేచిపోవుదు ననును.



బందరు పాఠశాలలో ఉపాధ్యాయుడుగా వున్నప్పుడు వేంకటశాస్త్రి

ఆ పాఠశాలలో నాయన గురువుగా నున్నారన్నది తెలుగుదేశములో నొక మహా విషయము. కొన్ని జిల్లాలలో నది యొక గొప్ప విషయము. వారా పాఠశాలలో నుండుట వలన నచ్చట చదివిన వారిలో కనీసము పదిమంది గొప్పకవులైనారు. నేను కవి నగుట వారి యనుగ్రహమే యనుకొందును. నేను నారవ ఫారము పూర్తిజేసి కళాశాల చదువులకు వెళ్లునప్పటికే నాకున్న భాషాజ్ఞానము

కొంత చెప్పుకోదగినదిగా నుండెను. ఎన్నో ప్రయోగములు, ఎన్నో శబ్దముల యొక్క స్వరూపములు, ఎన్నో తెలుగు పద్య రచనలోని సొగసులు నాకు తెలియును. వారు చెప్పిరా – చెప్పలేదు. వారు చెప్పలేదా – చెప్పిరి.

నేనా యూరిలో నప్పటికే ప్రసిద్ధులైన బాలకవులలో నొకడను.

మరొక చిన్న విషయము, వాగ్గేయ కారులు, మహా సంగీత విద్వాంసులు, అద్వైతము నందు ప్రస్థానత్రయ భాష్యమును చదివిన వారు భక్తులునైన శ్రీ హరి నాగభూషణము గారు మా పాఠశాలలో నొక యేడాది యుపాధ్యాయులుగా నుండిరి. వారు బి.ఏ. తరువాత న్యాయవాది వృత్తిలో చేరిరి. మా గురువుగారైన వేంకటశాస్త్రిగారికి గొప్ప సంగీతజ్ఞాన ముండెడిది. వారి సంస్కృతాంధ్ర భాషాజ్ఞాన మట్లుండగా సంగీతశాస్త్రములో జ్యోతిశ్శాస్త్రములో మా గురువులు గొప్ప విద్వాంసులు. వారు తెలుగుదేశమున తెలుగు పద్యము నొక బాణీగా చదువుట సర్వజనులు చెప్పికొనెడి విషయముగా చేసిరి. ఆనాటి కవులందఱు తెలుగు పద్యమును వారివలె చదువుటకు ప్రయత్నించెడి వారు. వారు గొంతును కొన్నిచోట్ల నక్కళించి మరికొన్నిచోట్ల మక్కళించి చదివెడివారు. అది వారికే సాధ్యము. అదియొకటే రాగము. మోహన యనుకొందును[4].

ఈ నాగభూషణముగారు గురువుగారు – వారిద్దరిని పాఠశాలలో నేనెప్పుడు చూచినను సంగీతశాస్త్రమును గూర్చి పెద్ద పెద్ద చర్చలు చేసికొనుచుండెడివారు. నాగభూషణముగారు గొప్పగాయకుడు. మా గురువుగారు కారు. కాని శాస్త్ర విషయములో ప్రయోగ విషయములో నిద్దరు నెప్పుడు తగాదా పడుచుండెడివారు. అది నాకు బాగుగా గుర్తు.

***(విశ్వనాథ వారి అసంపూర్ణ ఆత్మకథ నుండి)***



**4.** వేంశా శ్రీ, రేగుప్తి, సారంగ, మధ్యమావతి, నాటకురంజి, కాంభోజి రాగాలతో పద్యాన్ని రసవంతంగా చదవగలరు.

# కాశీయాత్ర

నేనీ పొత్తమును సర్వసాధారణమయిన వ్యావహారిక భాషలోనే వ్రాస్తాను. 64 వత్సరముల నిండు వయస్సులో (*క్రీ.శ. 1934*) వ్రాస్తూ వున్న దీనిని చూచి, నన్ను "తుద కబ్బెరా తురక భాష" అని నా మిత్రులూ, శిష్యులూ లోనగువారు కొందఱు నిందింతురని నాకు తెలిసిన్నీ, నేనిట్టి భాషను సమర్థించువారిలో చేరినవాడనుకాక యుండిన్నీ, ఇందులో వ్రాయుటకు కారణము, నాకు ఈ భాష అంటే అంతగా యిష్టం లేకపోయినా, ద్వేషం కూడా అంతగా లేదని లోకులకు తెలియజేయుటయే నా ముఖ్యోద్దేశ్యము. ఇదిన్నీ గాక, ఈ భాషకు చోటివ్వదగిన కబ్బము లెట్టివో సూచించుటకుగూడ నేనిప్పుడీ పనికి తలపెట్టినాను. ఇప్పుడే కాదు, ఇంతకు పూర్వము కూడా నేనిట్టి పట్టుల నిట్టి భాషనే ఉపయోగించి యుంటిని. 'పల్లెటూళ్ల పట్టుదలలు'లోనైనవి చదివినవారి కీసంగతి విశదమే. కావున విస్తరింపక ప్రస్తుతము ప్రారంభిస్తాను. ఇప్పుడు నేను వ్రాయబోయే విషయము అంతో యింతో 'జాతకచర్య' అను పొత్తములో స్పృశించి విడిచిందేకాని క్రొత్తది కాదు. అయితే మరల యెందుకు వ్రాయాలంటే, అందులో నెత్తికొన్న విషయాలొక్కొక్కటి విడదీసి వ్రాసేయెడల యెంతెంత గ్రంథము పెరుగునో చదువరుల కెఱుకపడే నిమిత్తమే కాని వేఱుకాదు.

## గణపతి నవరాత్రములు

నేను ఆయా గురువరుల సమక్షమున అక్షరములు, బడిచదువు, ఫ్రెంచి, సంగీతము, భారవి(*కిరాతార్జునీయం అనే సంస్కృతకావ్యం*) వఱకు కావ్యములున్నూ చదువుకొని, కొంచెము లఘుకౌముది[1] చదివి – బ్ర॥శ్రీ॥ చర్ల బ్రహ్మయ్యశాస్త్రులవారి[2]

---

**1.** కౌముది అంటే వెన్నెల. వ్యాకరణంమీద ప్రసరించిన వెన్నెల అనే అర్థములో ఈ పేరు పెట్టారు. లఘుసిద్ధాంతకౌముదిని రచించినది భట్టోజీదీక్షితుని శిష్యుడైన వరదరాజు. భట్టోజిదీక్షితుల వ్యాకరణగ్రంథం సిద్ధాంతకౌముదిని సంగ్రహపరచి లఘుకౌముదిని, మధ్యకౌముదిని సంతరించాడు.

**2.** పెద్దాపురం సంస్థానం చీలికపేలికలవగా మిగిలిన భాగమైన కొఠాం ఎస్టేట్ పండితులు మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులుగారి (1822–1900) ప్రధాన శిష్యులు చర్ల బ్రహ్మయ్యశాస్త్రులు (1839–1899). కాశీలో వ్యాకరణం గురుకులవాస పద్ధతిలో అభ్యసించారు. కిర్లంపూడి సంస్థానపాలకుల ఇలవేలుపు రాజగోపాలమూర్తి వెలసిన ధర్మవరంలో బుచ్చిసీతయ్యమ్మ గారు (బుచ్చితమ్మయ్యగారి భార్య) నెలకొల్పిన ధర్మపాఠశాలలో పండితులు. ఇంటివద్ద కూడా గురుకులవాసంగా శిష్యులు ఉండేవారు.

సన్నిధికి విద్యాభ్యాసమునకు వెళ్లేటప్పటికి నాకు పద్దెనిమిదో వత్సరము (క్రీ.శ. 1878) దాటవచ్చింది. శ్రీ శాస్త్రులవారి వద్ద సిద్ధాంతకౌముది[3] ప్రారంభించిన మాసం దాటునంతలో – గణపతి నవరాత్రములు సమీపించినవి. అపుడు గురువు గారు శిష్యుల నుద్దేశించి, "ఈ గణపతిపూజ విద్యార్థులకు చాలా ముఖ్యమైనది. కాశీలో దీనిని మిక్కిలి శ్రద్ధాభక్తులతో విద్యార్థులు చేస్తూ వుంటారు, కాబట్టి మీరు కూడా చేస్తే మీకు సకల శ్రేయస్సులున్నూ కలుగుతవి" అని ప్రస్తావించినారు. అప్పటికి శ్రీ శాస్త్రులుగారు కాశీనుండి వచ్చి కొలదికాలమే అగుటచే విద్యార్థులు నలుగురైదుగురికంటే లేరు. అందులో నేనొకడను. శాస్త్రములో నాకంటె తక్కిన విద్యార్థులు ఎక్కువవారేకాని, సంస్కృతము మాటెటులున్ననూ, తెలుగులో కవిత్వము చెప్పుటయందేమి, పురాణము చెప్పుటయందేమి, నేను "అల్లుల్లో మల్లు పెద్ద" అన్నట్లున్నాను. గణపత్యుత్సవాలకు కొంత ధనార్జన కావాలి గనక, నన్ను శాస్త్రుల వారు ఆ విద్యార్థులలో పెద్దచేసి సంపాదనార్థం పంపించినారు.

శాస్త్రులవారి గ్రామము తాడేపల్లిగూడెమునకు ఉత్తరంగా సుమారు రెండు క్రోసుల దూరములో నున్న కడియెద్ద అనే పల్లెటూరు. ఈ యూరికి రెడ్డిసీమ[4] కడు దగ్గఱ. ఇప్పుడెటులున్నను, అప్పటికి ఎవరేని యాచకులు వెళ్లేయెడల, ఆ రెడ్డిసీమలో అంతో ఇంతో డబ్బు సంపాదన కావడము నిస్సంశయము. అప్పటికి బ్రాహ్మణులంటే, అందులో చదువుకొన్నవారంటే, పట్నాల్లోనేమి పల్లెటూళ్లలోనేమి,

---

మృదువరి. నాటి పండితులలో చాలామంది వారికి స్నేహితులు. ఆ కారణంగా వారి ఇంటికి వచ్చిన ఆయా పండితుల దర్శన భాషణలు ఆయన శిష్యులకు కూడా లభించేవి. తిరుపతివేంకటకవులకి గురువు కాకపోతే ఆ మహాపండితుడి పేరు ఇప్పటి తరం వారికి తెలిసేది కాదు.

**3.** మహారాష్ట్రుడైన భట్టోజీదీక్షితులు (17వ శతాబ్దం) రచించినది. పూర్తిపేరు వైయాకరణ సిద్ధాంతకౌముది. అతిప్రాచీన వ్యాకరణాలైన అష్టాధ్యాయి (పాణిని), వార్తికములు (వరరుచి), మహాభాష్యం (పతంజలి), కాశికావృత్తి (వామన జయాదిత్యుడు, 7వ శతాబ్ది) – మొదలైనవాటిని పరిశీలించి క్రమపద్ధతిలో విషయవిభాగము ననుసరించి రాశాడు. సిద్ధాంతకౌముది వెలువడిన నాటినుండి సమస్త భారతదేశంలో వ్యాకరణ పఠనపాఠనాలలో యిదే ఆధారగ్రంథం అయ్యింది. భట్టోజి తండ్రి లక్ష్మీధరుడు. భట్టోజికి రంగోజిభట్టు, వీరేశ్వరుడు అని యిద్దరు కుమారులు. భట్టోజికి శేషశ్రీకృష్ణపండితుడు వ్యాకరణ గురువు. అప్పయ్యదీక్షితుడు వేదాంత గురువు.

**4.** పశ్చిమగోదావరి జిల్లాలోని ఎర్నగూడెం, జంగారెడ్డిగూడెం, లక్కవరం మొదలైన ఏజన్సీ ప్రాంతాలు రెడ్డిసీమ. రెడ్ల పాలనాకాలంలో ఇది ఒక ముఖ్యప్రాంతం. రెడ్డిసీమలోనే జంగారెడ్డిగూడెం, రెడ్డిగూడెం, రెడ్డిపోలవరం వంటి ఊళ్లుండటం గమనార్హం.

గృహస్థులు మిక్కిలిగా ప్రేమించేవారు. ఎప్పుడోకాని బ్రాహ్మణుడు కనుపడని రెడ్డిసీమను గూర్చి చెప్పేదేమిటి! ఆ సీమలో "లక్కవరం" అనే గ్రామం పెద్దది. ఆ వూళ్లో కోమట్లు విస్తరించి వున్నారు. కోమట్లున్నచోట సర్వసాధారణంగా ధనలక్ష్మి కూడా వుంటుందని చెప్పనక్కరలేదుగదా, ధనమున్నచోట, సర్వత్రా కాకున్ననూ, నూటనాటనైనా దాన ముండకపోదు. మేము ఈ సంగతి మనస్సులో పెట్టుకొని ఆ వూరు వెడితిమి. ఆయూరి వర్తకులు మమ్మల్ని ఆదరించి మాచేత పురాణము చెప్పించి, విని మా ప్రయత్నానికి యథాశక్తిని తోడ్పడినారు. తరువాత, జంగారెడ్డిగూడెం, కామవరపుకోట మొదలైన వూళ్లు కూడా వెళ్లి ప్రయత్నించినాము. కామవరపుకోటలో పెద్దకోమటి యిచ్చిన చీటీ పుచ్చుకొని ప్రతి దుకాణం గోరుముష్టి[5] కూడా యెత్తేము. కాని లక్కవరంలోవలె యెక్కువగా లాభించిలేదు. అంతలో గణేశ్వరచతుర్థి సమీపించినది. గురువుగారి సన్నిధికి వచ్చి సంపాదించిన స్వల్ప ద్రవ్యమును వారికి నివేదించితిమి. వారు "చలినీళ్లకు వేడినీళ్లు తోడు" అన్నట్లు మఱికొంత ద్రవ్యమును జేర్చి ఆ వుత్సవమును సర్వోత్తమంగా జరిగించిరి. ఆ తొమ్మిదిరోజుల్లో విద్యార్థులకు పాఠములుండవుకాని, శాస్త్రములో పూర్వపక్షములు[6] కొందఱు చేస్తే – మఱికొందఱు సిద్ధాన్తములు[7] చేయడం మొదలైన వ్యాసంగములు గురువుగారు దగ్గఱవుండి జరిపించడము కాశీలో ఆచారము గనుక ఇక్కడ కూడా ఆలాటి సందర్భాలు గురువుగారు చేయించేవారు. దీనివల్ల శిష్యుల సభాకంపము

---

**5.** అతిస్వల్పధనానికి కూడా ఆశపడి యాచించడం గోరుముష్టి. దాత అవునా కాదా తెలియకుండానే, చేయిచాపడం కూడా గోరుముష్టి క్రిందకు వస్తుంది.

**6.** శాస్త్రచర్చలు, వాదోపవాదాలు జరిగేటప్పుడు ప్రారంభంలో వాది శాస్త్రంలోని ఎక్కడో ఒకచోటులోని విషయాన్ని ప్రస్తావించి, ఆ విషయాన్ని అవుననో కాదనో వాదించడం పూర్వపక్షం. దాని మీద ప్రతివాది ఆక్షేపణను అభ్యంతరాన్ని ప్రకటించడం ద్వారా చర్చ కొనసాగుతుంది. ఒక వ్యక్తి చెప్పినదానిని ఖండించడం కూడా పూర్వపక్షమే కాని ఇక్కడ ఆ అర్థం కాదు. సాధారణంగా పూర్వపక్షం చేసేవారే ఓడిపోతారట. తిమ్మిని బమ్మి చేయగల ఎంతో పండితుడైతేనే పూర్వపక్షం చేసి నెగ్గగలడట. అందుకని ఇంకా చదువుతున్న విద్యార్థిచేత పూర్వపక్షం ప్రతిపాదింపజేసి పండితులు చర్చలు జరిపేవారట. ఒక అంశాన్ని కాదని చూపి వాదించడం పూర్వపక్షం, అవును అని వాదించడం సిద్ధాంతం అని కూడా అర్థమట. అయితే ఈ వాదన అంతా శాస్త్రప్రమాణాలతో జరగాలి.

**7.** పూర్వపక్ష ఖండనమండనాది చర్చల ద్వారా నిగ్గు తేలిన అంశం సిద్ధాంతం. ఎటువంటి చర్చకు తావులేకుండా ప్రాచీనకాలం నుండి అన్ని పక్షాలవారికి ఆమోదయోగ్యం అయిన అంశం కూడా సిద్ధాంతం అనబడుతుంది. అయితే సందర్భాన్ని బట్టి వేరు వేరు అర్థాలు కూడా ఉన్నాయి.

పోయి గంద్రతనం కలుగుతుందని గురువుగారు సెలవిచ్చేవారు. ఇక నొకటి: ఈ గణేశ్వరుని పూజించడముకు విద్యార్థులలో బ్రహ్మచారిని గురువుగారు నియమించే వారు. ఒకయేడు పూజించిన విద్యార్థి మఱియొకయేటికి పనికిరాడు. కారణ మేమంటే : ఆ విద్యార్థి మఱుచటియేటికి ఈ పూజాకారణంవల్ల గృహస్థయి తీరుతాడు. గృహస్థుకు బ్రహ్మచారియైన గణపతిని పూజించుటకు అర్హత లేదని గురువుగారు చెప్పేవారు.

## కాశీ వెళ్లడానికి వూహ

ఈ రీతిగా గురువుగారివద్ద కడియెద్దలో చదువుకొంటూ వుండగా నాకు కాశీ వెళ్లడానికి వూహ కలిగింది. చక్కగా అన్నము పెట్టి చదువు చెప్పుతూ వున్న గురువును వదలి కాశీ వెళ్లడమెందుకని చదువరులకు శంక కలుగవచ్చును. కారణం వ్రాస్తూ వున్నాను. తఱుచు గురువుగారు కాశీవిశేషాలు ముచ్చటిస్తూ వుండేవారు. అవి విని విని వుండడమువల్ల, ఆయా విశేషాలు చూదామని అభిలాష యొకటి. ఇంకొకటి, నా చిన్నతనము సుమారు పదియేండ్ల వఱకు (*క్రీ.శ. 1880*) జన్మస్థానమైన కడియంలో వెళ్లినప్పటికి, తరువాత యానాములో వుండుట తటస్థించింది. కడియము పల్లెటూరు. యానామో, పట్నవాసము. అందుచేత కొంచెము నాగరకతకు సంబంధించిన అభ్యాసములకు అలవాటు పడ్డాను. ఆ అభ్యాసంలో ప్రతిరోజున్నూ తమలపాకులు వేసికొనుట ఒకటి. అది మిక్కిలి పల్లెటూరగు కడియెద్దలో దుర్లభమయినది[8].

కాశీలో సత్రాల్లో భోజనము పెట్టుటయేకాక ప్రతిరోజున్నూ తాంబూలము కూడా విధిగా యిస్తారని వినియుండుటచే కాశీ వెడదామని బలవత్తరమైన కోరిక వుదయించింది. అయితే అది ద్రవ్య సాధ్యమవుటచే, వెంటనే సాగలేదు. ద్రవ్యము లేకుండా బయలుదేరితే యేమవుతుందో యింతకు ముందొక పర్యాయము వేఱొకని ప్రేరేపణమీద బయలుదేరి విశాఖపట్నము వఱకును వెళ్లి పయిని వెళ్లలేక తిరిగి వచ్చిన నాకు పూర్తిగా తెలిసేవుంది గనుక, తొందరపడి బయలుదేరలేదు. ఈ లోపున శాస్త్రులవారు ఆయీ విద్యార్థులనెల్ల పోషించడానికి అప్పుడప్పుడు కొన్ని

---

**8**. అప్పటి రోజులలో తాంబూలం ఇప్పటివలె చౌక కాదు. తమలపాకులు, వక్కలు అన్ని చోట్లా పండే దినుసులు కావు. వక్కలైనా దొరికేవి కాని పచ్చిసరుకైన తమలపాకులు రవాణా సదుపాయాలు అభివృద్ధి చెందని 1888 ప్రాంతాలలో సులభసాధ్యమైన వస్తువు కాదు. శాస్త్రప్రకారం బ్రహ్మచారికి, విద్యార్థికి తాంబూలం నిషిద్ధం. మరి వేంశా విషయంలో ఇదెలా పొసగిందో !

గ్రామాలు సంచారం చేస్తూ వుండడములో, అక్కడక్కడ కొందఱు సంపన్నగృహస్థులు మా గురువుగారిని "మీ విద్యార్థులలో నెవరైనా పురాణం చెప్పేవారున్నారా" అని అడుగుచుండేవారు. వారికి మా గురువుగారు నన్ను చూపేవారు. నావలన ఆ గృహస్థులు పురాణం విని, నాకు పదో, అయిదో రూపాయలిచ్చి పంపుచుండేవారు. ఆ ద్రవ్యాన్ని నేను మా గురువుగారి వద్దనే దాచుకొనేవాడను. ఏలాగైతేనేమి ఆయీ బాపతు సొమ్ము నా తాలూకు మా గురువుగారి వద్ద సుమారు యాభై రూపాయల వఱకున్నూ నిలువ వుంది. ఈ సొమ్ముతో నేను కాశీకి వెళ్లవచ్చునను ధైర్యము కలిగింది. అప్పటికి రైలు బెజవాడ వఱకు వచ్చింది. బెజవాడనుండి కాశీకి సుమారు పద్దెన్మిది రూపాయీలు రైలుచార్జీ. అయితే యీ సొమ్ము గురువుగారి నేమని యడుగుదును? కాశీ వెళ్లెదనని వారితో చెప్పవీలులేదు గదా, ఏదో వంక పెట్టి పుచ్చుకోవాలి. ఇట్లుండగా గురువుగారు కిర్లంపూడి[9] వార్షికానికి[10] బయలుదేరినారు. అక్కడ జమీందారులు వార్షికము అరవై రూపాయీలున్నూ ఇచ్చినారు. వారిని సొమ్ము అడిగి పుచ్చుకొని, స్వగ్రామము వెళ్లివస్తానని మనవిచేసి, కాశీకి వెడదామని ఆలోచించుకొని, విరోధి సం॥ (*క్రీ.శ. 1889*) మార్గశీర్ష శుద్ధ తదియనాడు ముహూర్తము బాగున్నదని మనసులో పెట్టుకొని వున్నాను. సొమ్ము అడగడమే తరువాయి గాని, వారు ఇవ్వడానికి లేశమున్నూ అభ్యంతరము లేదు. అంతలో ఆ గ్రామంలో వుండగానే నాకు పెండ్లి తటస్థించి ఆ ప్రయాణ ముహూర్తము పెండ్లి ముహూర్తంగా పరిణమించింది. దాని సందర్భం టూకీగా వ్రాస్తాను.

## పెండ్లి మాటలు

కిర్లంపూడికి సమీపములో గెద్దనాపల్లి అనే పల్లెటూరిలో శ్రీ శాస్త్రులవారి అన్నగారి అల్లుడు రామడుగుల వేంకటాచలముగారు స్కూల్ మాస్టరుగా ఉన్నారు.

---

**9.** తూర్పుగోదావరి జిల్లా కేంద్రం కాకినాడకు 30 కి.మీ. దూరంలోని మండల కేంద్రం. పూర్వం ఇనగంటివారనే వెలమలకు జమీందారీ గ్రామం.

**10.** విద్యలపట్ల అభిమానం గల ధనికులు, జమీందారులు, సంస్థానాధిపతులు వారు మెచ్చిన కవులకు, పండితులకు సంవత్సరానికింత అని కొంతసొమ్ము ముట్టచెప్పడమే వార్షికం. సాధారణంగా ఆయా పండితులు, కవులు విజయదశమి రోజులలో లేదా సంక్రాంతి రోజులలో వార్షికం తెచ్చుకొంటారు. కొన్ని సంస్థానాలవారు ఏదో సందర్భాన్ని పురస్కరించుకొని ఒక ప్రత్యేకదినాన వార్షికాలు ఇవ్వడం కూడా ఉంది. మరీ గౌరవించ తగినవారికి తగువారి ద్వారా లేదా మనియార్డర్ ద్వారా కూడా వార్షికం పంపేవారు. ఉర్లాం, గద్వాల, విజయనగరం, పిఠాపురం నుండి వార్షికాలు పొందడం ఆ రోజులలో గౌరవప్రదంగా భావించేవారు. కారణం ఆ సంస్థానాధిపతులు 'విషయం' తెలిసినవారు. అర్హులను గౌరవించేవారు.

సమీపమగుటచే కిర్లంపూడికి ఆయన పినమామగారి దర్శనానికి వచ్చారు. ఆయనతో సుప్రసిద్ధులు నూకల సోమనాథశాస్త్రులుగారి కుమారుడు వేదశాస్త్ర పండితుడు వేంకటకృష్ణశాస్త్రిగారు కూడా అప్పుడు అత్తవారింటికి వచ్చియుండుటచే గెద్దనాపల్లి నుండి శాస్త్రులవారి దర్శనానికి వచ్చారు. వారిరువురున్నూ శ్రీవారి దర్శనానికి వచ్చే సమయానికి, శాస్త్రులవారి సన్నిధిని నేను తప్ప ఇతర విద్యార్థు లెవ్వరున్నూ లేరు. తక్కిన విద్యార్థు లందఱున్నూ ఆ సమీపంలోనే వున్న ధర్మవరపు పాఠశాలాపండితులగు తనికెళ్ల నరసింహశాస్త్రులవారి దర్శనం నిమిత్తం వెళ్లారు. అట్టి సమయంలో గెద్దనాపల్లి నుండి వచ్చిన యిరువురిలో పండితుడని యింతకు ముందుదహరించిన వేంకటకృష్ణశాస్త్రిగారు నన్ను ఏవో కొన్ని ప్రశ్నలు వ్యాకరణంలో అడిగారు. నాకు తోచిన సమాధానాలు చెప్పి, అంతతో వూరకుండక నేను ఆయన్నీ మళ్లా ప్రశ్నించడానికి మొదలుపెట్టినాను. అది గురువుగారు అంగీకరించక, “అబ్బాయీ! ఆయన నీకన్న సర్వాత్మనా పెద్దలు, నీవు ఆయనను ప్రశ్నించకూడదు” అని నన్ను గట్టిగా మందలించారు. విద్యార్థి అవస్థలో నుండుటచే నేను “వారి పెద్దఱికమునకు నేనేమి లోటు గలిగించాను. నన్ను వారడిగారు, నాకు తోచినవి చెప్పినాను, నేను మళ్లా అడిగాను” అనియొక మోస్తరు వినయముగా గురువుగారికి ఉత్తరము చెప్పినాను. అంతతో ప్రస్తుతవిషయము ఎట్లో ఆగింది.

నన్ను ప్రశ్నించిన పండితుడున్నూ, నాకు కాబోయే మామగారున్నూ ఆ రోజు అక్కడనే ఉండిపోయిరి పిమ్మట జామురాత్రి తెల్లవారువేళ మా గురువుగారితో నన్ను గూర్చి కాబోయే మామగారు ముక్తసరిగా ఈక్రింది మాటలను మాట్లాడినారు. “మీరు నా కొమార్తెను మీ బావమఱదికి యిమ్మని ఇదివఱలో నాతో చెప్పుతున్నారు. ఆ వరుడు వయస్సులో కొంత ముదురు. అందుచేత నాకు సంశయముగా వుంది. ఈవేళ నాతో వచ్చిన వేంకటకృష్ణయ్యశాస్త్రులుగారితో ప్రసంగించిన పిల్లవాని కివ్వవలెనని నాకు వుద్దేశము హఠాత్తుగా కలిగింది. నగలు వగయిరాలతో నాకేమి పనిలేదు. ఎట్లో బొమ్మలపెండ్లి మోస్తరుగా పెండ్లి చేసి పంపుతాను. అతనితో మీరీమాట చెప్పి అంగీకరిస్తాడేమో కనుక్కోండి”. ఈ మాటలకు గురువుగారు సమ్మతించారు. ఉదయము వారంతా కూర్చుని నన్ను పిలిచి యీ విషయము చెప్పినారు. చెప్పి దీన్ని గూర్చి మీ గ్రామము వెళ్లి మీ తల్లిదండ్రులతో ఆలోచించి ఏదో అభిప్రాయము తేల్చమన్నారు. దానిమీద నేను మా గురువుగారితో “మీకన్న మా తల్లిదండ్రులెక్కువవారుకారు, తమ యిష్టమునకు వారు మాఱుచెప్పరు. కాబట్టి తమ చిత్తము వచ్చినట్లు జరిగింపవచ్చు”నని నేను ప్రత్యుత్తరము చెప్పితిని.

ఇక్కడ నిక నొకటి చెప్పవలసి యున్నది. ఏమిటంటే, నాకు అప్పటికి కాశీ వెళ్లి అక్కడ అధమం పండ్రెండేండ్లేనా వుండి గొప్పపాండిత్యం సంపాదించి దేశానికి వచ్చిన పిమ్మటగాని పెండ్లి చేసుకోవాలని సుతరామున్నూ లేదు. అట్టి స్థితిలో గురువుగారు యీ ప్రస్తావన తేవడంతోనే అంగీకరించడానికి కారణమేమంటే నాకు అప్పుడు వుద్దేశించిన కన్యక నే నెరిగినదే కాని క్రొత్తదికాదు. నే ననుకొన్నంత కాలమున్నూ కాశీలోనున్నను భార్య ప్రతిబంధక మేమిన్నీ వుండదని వూహించు కొన్నాను. ఆ తరువాత నా తరఫున గురువుగారు తల్లిదండ్రులై తథాస్తు అన్నారు. ఆవేళ కార్తికబహుళత్రయోదశి. మార్గశీర్షశుద్ధతదియ సుముహూర్తం అనుకొన్నారు.

## వివాహ సన్నాహం

వెంటనే గురువుగారు సంస్థానంవారికి కబురుచేయుటకయి మళ్లా దివాణం లోనికి ప్రయాణమయినారు. వార్షికము ముట్టినది కదా, ఏమి, మరల శాస్త్రులవారు దయచేయుచున్నారని వుద్యోగస్థులు ఆశ్చర్యంగా చూడ మొదలిడినారు. వారివారితో ప్రస్తుతము శ్రుతపఱచి గురువుగారు శ్రీ బుచ్చిసీతయ్యమ్మగారి[11] ముఖ్య పరిచారికను కామాక్షిని పిల్చి, అమ్మగారితో ఈ సంగతిని మనవి చేయమని చెప్పినారు. బుచ్చిసీతమ్మగారనగా, అపుడు కిర్లంపూడి జమీను అనుభవించుచున్న శ్రీ యినుగంటి బుచ్చితమ్మయ్య, చిన్నరావుగార్లకు మాతామహి. ఎస్టేటు మనుమలు యిద్దరికి వశపరచి చాలాకాలమైనది. ఆమెకు మనుమ లిద్దఱున్నూ నెల 1టికి రు. 500-0-0[12] చొప్పున మాత్రము గౌరవార్థం ఇచ్చుచున్నారు. ఈ అయిదు వందలును ఆమె తన ముఖ్యపరిచారికయగు కామాక్షి చేతులో పోసి ధర్మఖర్చు

---

**11.** క్షత్రియులు, వెలమలలో రాజకుటుంబాలలో స్త్రీలకు పేర్ల చివరన పురుషుల వలెనే అయ్య చేర్చి సంబోధించే ఆచారం ఉంది. దీనికి వేంశా వేరొకచోట వివరణ యిచ్చారు. రాజపత్నులను నౌకర్లు అమ్మపదంతో సంబోధిస్తే 'అమ్మ బాబుకు పెళ్లాం అవుతుంది' అనే ఆక్షేపణ వస్తుందిట, కనుక ఆ దోషం తొలగించుకోవడానికి స్త్రీల పేర్ల చివరన అమ్మ పదం కాక అయ్య పదం వాడడం మొదలుపెట్టారట. అయితే స్త్రీల పేర్ల చివర అమ్మ రావడమే లోకాచారం కనుక ఆ అలవాటు చొప్పున 'అయ్య' పక్కన 'అమ్మ'ని కూడా చేర్చి పిలవడంతో రాజకుటుంబాల స్త్రీలు - సీతయ్యమ్మ, చెల్లయ్యమ్మ, కొండయ్యమ్మ, నరసయ్యమ్మ - ఇలా వ్యవహరింపబడుతుండేవారు.

**12.** రూపాయలు, అణాలు, పైసలు ఉండే కాలంలో రాత పూర్వకంగా పైకం వివరాలను తెల్పేటప్పుడు మూడు స్థానాలు ఉండేవి. 100-3-4 అంటే వంద రూపాయల మూడు అణాల నాలుగు పైసలు అని అర్థం. పాత పుస్తకాలలో ధరను ఇలా మూడు స్థానాలుగా ఇవ్వడం మనం గమనించవచ్చు.

చేయవలసినదని చెప్పుచుండేది. ఈ పరిచారిక, అమ్మగారంత వృద్ధు కాకపోయినా, సుమారు షష్టిపూర్తికి దాదాపు వయస్సులో వుంది. మిక్కిలి దేవబ్రాహ్మణ భక్తిపరురాలు. జమీందారులవద్ద మెలగుచుండుట చేతనో, పూర్వపుణ్యవశంచేతనో ఉదారమైన గుణసంపత్తి కలది. ఎట్టిదియును గాకున్న, ఆ జమీందార్లు బుచ్చి తమ్మయ్య, చిన్నరావుగార్లు అందఱు దాసీలతోపాటుగాగాక, ఈ పరిచారికను 'కామన్నప్ప' అని వరుసవావులతో పిలవడం తటస్థింపదుగదా? ఈ పరిచారిక యెవరి నవుకరో ఆ బుచ్చిసీతయ్యమ్మగారిని గూర్చి కొంచమిచట తెలుపవలసి యున్నది. ఈమె శ్రీ రావు నీలాద్రిరాయనింగారికి కోడలు. శ్రీ నీలాద్రిరాయనింగారి ప్రథమభార్యాపుత్రుడగు శ్రీ బుచ్చితమ్మయ్యగారి భార్య. ఈ బుచ్చితమ్మయ్యగారు శ్రీపితాపురసంస్థానము[13] ఏలవలసినవారయ్యును, తలిదండ్రులకు తాత్కాలికముగా కలిగిన మనఃకలహంవల్ల కోటలోని చరాస్తిని మాత్రము గైకొన్న తల్లిగారివల్ల కోట వదలి బాల్యమున నీవలికి రావలసినవారైరి. ఆ పిమ్మట అక్కడినుండి తెచ్చిన ధనమువలన ఈ కిర్లంపూడి యెస్టేటు తల్లిగారే పెద్దాపురం సంస్థానమువారివద్ద కొన్నారు. ఈ బుచ్చితమ్మయ్యగారి తల్లిదండ్రులకు తాత్కాలికంగా కలిగిన మనఃకలహంవల్లనే కాట్రావులపల్లె, జగ్గంపేట యెస్టేటులు గూడా యేర్పాటు అయినాయి. ఇంతకన్న ఈ విషయమునకు ఇక్కడ చోటు చాలదు[14]. కావున ప్రస్తుత ముపక్రమిస్తాను. ఈ బుచ్చిసీతయ్యమ్మగారు మహాధర్మాత్మురాలు. ధర్మవరములో పాఠశాల, అన్నవరంలో ధర్మసత్రము లోనైన ధర్మకార్యాలు పెక్కులు ఈమె చేసినారు. అట్టి ధర్మాత్మురాలిని సేవించే దాసికి మాత్రం మంచిబుద్ధి యేల కలుగదు? కలగడం న్యాయమే. భాగవతములో శ్రీ పోతరాజుగా రేమన్నారు?

---

**13.** సంస్థానాల, జమీందారీల ప్రధాన గ్రామాలను చెప్పేటప్పుడు మనుషులకు లాగానే 'శ్రీ'ని ముందు చేర్చడం ఒక ఫ్యూడల్ ఆచారం. శ్రీ పితాపురం, శ్రీ బొబ్బిలి, శ్రీ విజయనగరం ఇలాగ. ప్రత్యేకంగా పేరు చెప్పక్కరలేకుండా శ్రీ పితాపురంవారు అంటే పితాపురం జమీందారు అని అర్థం.

**14.** పితాపురాన్ని పాలించిన రావు నీలాద్రిరాయణికి (1778–1828), అతని ప్రథమ భార్య వేంకటరమణయ్యమ్మకు సంతానం లేదు. దగ్గరి బంధువుల కుమారుణ్ణి దత్తు తెచ్చుకొన్నారు. ఆ పిల్లవాడు అకాలమరణం చెందగా, అతని తమ్ముడు బుచ్చితమ్మయ్యను దత్తు చేసుకొన్నారు. ఈ రెండవదత్తు విషయంలోనూ, రాజుగారి స్వైరవిహారం వల్లనూ రాజు, రాణీల మధ్య సఖ్యత పొసగలేదు. ఆత్మాభిమానం కలిగిన రాణి దత్తుకుమారుణ్ణి, స్త్రీధనాన్ని తీసుకొని బయటకు వచ్చేసింది. 1847లో పెద్దాపురంవారికి చెందిన కిర్లంపూడి ఎస్టేటును కుంపిణీవారు వేలం వేస్తుండగా కొన్నారు. బుచ్చితమ్మయ్యగారికి మగపిల్లలు లేరు. అందువలన కూతురుకి కలిగిన మగబిడ్డలిద్దరికీ సంస్థానం దఖలు పడింది.

"అధముడైనవాని కాలగుకంటె నత్యధికునింట దాసి యగుట మేలు" అని కదా! అదియటులుండె. గురువుగారు అమ్మగారితో మనవి చేయమంటే మనవి చేయుటకు వెడుతూ, ఈ వివాహము అమ్మగారి సెలవుమీద తానే జరిగించవలెనని ఆ పరిచారిక వూహించుకొని, సంతోషముతో అమ్మగారితో శాస్త్రులవారు చెప్పిన మాటలు మనవి చేసి, తన కోరికను గూడా వినయంగా మనవి చేసికొన్నది. అమ్మగారున్నూ తన దాసిబుద్ధికి మిక్కిలి సంతసించి అట్లే కానిమ్మన్నారు. దాసి సంతోషించి శాస్త్రులవారితో మనవి చేసుకొన్నది. అంగీకరించారు. సలక్షణంగా అయిదురోజులున్నూ కామాక్షి ద్రవ్యంతో వివాహం జరిగింది.

## తేజోమూర్తుల అన్నపూర్ణమ్మగారు

ఇక నొకటి ఇక్కడ వ్రాయక తీరదు. మా గురువుగారు కాశీలో నున్న కాలంలో ఈ కిర్లంపూడినుండి తేజోమూర్తుల అన్నపూర్ణమ్మ అనే ఆవిడ తీర్థయాత్రకు వెళ్లింది. కాశీకాక ఇంకా ఉత్తరదేశ యాత్రలు చేయునప్పుడు మా గురువుగారు కూడా కాకతాళీయంగా ఆమె వెళ్లునప్పుడే యాత్రార్థం దయచేసినారు. ఆ పరిచయంవల్ల, దేశానికి వచ్చిన పిమ్మట, ఈ కిర్లంపూడి వచ్చినపుడు జమీందారుల ద్రవ్యముతో దినబత్తెం జరుపవలసియున్ననూ, అన్నపూర్ణమ్మగారి ద్రవ్యమునే గురువుగారు సవిద్యార్థికంగా వుపయోగించేవారు. జమీందార్లు కూడా యిందుకు సమ్మతించేవారు. ఆ అన్నపూర్ణమ్మగారు శాస్త్రులవా రెన్నినాళ్లున్నను బహు భక్తిశ్రద్ధలతో స్వయంగా వండి మాకందఱకీ షడ్రసోపేతంగా నిత్యసంతర్పణ జరిగించేది. నా వివాహము వీరి యింటనే నిశ్చయమయింది. నిశ్చయించేటప్పుడే ఈమె, 'స్నాతకము[15] మాత్రము మా యింటనే నా ఖర్చుమీదనే జరుగవలెను' అని కోరినది. "అట్లే" అని గురువుగారంగీకరించారు. స్నాతకం చేసికొని అన్నపూర్ణమ్మగారి గృహమునుండియే పెండ్లికి తరలివెడితిమి. స్నాతక సమయానకు మాత్రము మా తలిదండ్రులు రాలేదు. కారణం, అపుడు వర్షాధిక్యముచే ఏలేళ్లు పొంగి మార్గాలు అరికట్టినాయి[16]. చుట్టుమార్గం ద్వారా వచ్చేటప్పటికి ఇక్కడ

---

**15.** వివాహానికి ముందు బ్రహ్మచారి చేయు వ్రతం అని వావిళ్లవారి సంస్కృతాంధ్ర నిఘంటువు. బ్రహ్మచర్య దీక్షలో ఏవేని లోపాలు జరిగి ఉండవచ్చు కనుక ప్రాయశ్చిత్త హోమాలు జరిపిస్తారు. గృహస్థాశ్రమదీక్ష స్వీకరణకు ప్రారంభంగా వైశ్వదేవయజ్ఞం చేయిస్తారు. ఒంటిపోగు యజ్ఞోపవీతం బదులుగా రెండుపోగుల యజ్ఞోపవీతం వేస్తారు. గృహస్థాశ్రమ ధర్మాలను నేర్పుతారు. ఇవి స్థూలంగా స్నాతక విశేషాలు.

**16.** తూర్పుగోదావరి జిల్లాలో మన్యప్రాంతంలో దొమ్మకొండనుండి ఏలేరు పుడుతుంది.

స్నాతకము వేఱొక పుణ్యదంపతులు కూర్చుని జరిగించినారు. ఆ దంపతులు అన్నపూర్ణమ్మ శాఖవారే, కాసలేయులు[17]. ఆయన పేరు బుల్లినారాయణ సోమయాజులు. స్నాతకపు పీటలమీద నుండి లేచేవేళకు మా తలిదండ్రులు వచ్చి కలిసికొన్నారు. వారికప్పుడు, ఏకపుత్ర విషయంలో మనకిది ప్రాప్తిలేకపోయిందికదా అని కొంత విచారమున్నూ, తలవనితలంపుగా బీదలమగు మన కుఱ్ఱవాడికి పెండ్లి జరుగుచున్నదిగదాయని కొంత సంతోషమున్నూ కలిగింది. ఆయా సందర్భములను నానారాజ సందర్శనములో[18] – సీ॥ పరదేశములు దివ్యతర దేశములు గాఁగ॥[19] అను సీసములో సూచించియున్నాను.

## ప్రయాణ ముహూర్తమే పెండ్లి ముహూర్తం

ఇక నొకసంగతి జ్యోతిషశాస్త్రజ్ఞులు ఇచట గమనింప వలసియున్నది. నేను త్రికరణశుద్ధిగా కాశీకి వెళ్లవలెనని ముహూర్తము పెట్టుకొంటిని. ఆ ముహూర్తము పెండ్లిముహూర్తముగా మాఱుటచే, నా యుద్దేశమునకు వ్యతిరేకమే

---

ఇది ఎఱ్ఱవరం అనే గ్రామంవద్ద చిన్న చిన్న పాయలుగా చీలిపోతుంది. వీటిని అన్నింటిని కలిపి ఏలేరు అనే పేరుతోనే పిలుస్తారు. ఏలూరు దగ్గరనుండి పిఠాపురం వరకు ఉన్న ఏడు ఏలేళ్లలో రెండే మిగిలాయి. మిగిలినవి పంటకాలవలుగా మారిపోయాయి.

**17.** నివసించే నాడులను (ప్రాంతాలు) బట్టి బ్రాహ్మణులలో శాఖాభేదాలు ఏర్పడ్డాయి. వెలనాడులోనివారు వెలనాట్లు, వేంగినాడులోనివారు వేగినాట్లు, తెలంగాణాలోనివారు తెలగాణ్యులు. ఇప్పుడు అదే ప్రదేశాలలో నివసించకపోయినా ఆ పేర్లు స్థిరపడ్డాయి.అలాగే కాసలనాట్లు లేదా కాసలేయులు. కాసలనాడు అంటే నేటి హైదరాబాదు, వరంగల్ జిల్లాల ఉత్తర ప్రాంతాలు, మెదక్, కరీంనగర్ జిల్లాలలో కొంతభాగం.

**18.** తిరుపతివేంకటకవులు అవధాన ప్రక్రియ ప్రచారార్థం, తమ పాండిత్య ప్రదర్శన నిమిత్తం, ఆర్జనకోసం దేశసంచారం చేస్తున్నప్పుడు వివిధప్రాంతాల సంస్థానాధీశులను, జమీందారులను సందర్శించినప్పుడు చెప్పిన పద్యాలను గుదిగుచ్చిన గ్రంథమే నానారాజ సందర్శనం. ఈ సంపాదకుడు సంప్రదించిన ప్రతి ముద్రణ 1951లో.

**19.** సీ. పరదేశములు దివ్యతరదేశములు గాఁగఁ బరులగ్రామములు కాపురముగాఁగఁ
బరగేహములు సౌఖ్యకరగేహములు గాఁగఁ బరుల యన్నము బుష్టికరముగాఁగఁ
బరసజ్జనావళుల్ పరమబంధులు గాఁగఁ బరుల సంపదలు తనసంపదలుగాఁగఁ
బరులు కష్టసుఖమ్ము లరయువారలు గాఁగఁ బరులెల్ల గార్యతత్పరులు గాఁగఁ

తే. జేసి పుట్టించినట్టి జేజేల పెద్ద,
పండితప్రీతి నొప్పు మీ వంటి నృపతి
మణులు గొందఱ సృజియింప మఱచిపోయె,
నేమనందుము? ముద్దుకృష్ణేంద్ర! విధిని.

యైననూ స్నాతకములో కాశీయాత్ర అనుపేర నేవో కొన్ని యడుగులు నడచుట కొంత ఆచారమై యుండుటచే, అనుకొన్న వుద్దేశముకూడ నెఱవేఱినట్లు సంతసింప వచ్చును. మఱియూ నీవివాహసందర్భములో అప్పుడు జమీందార్లుగానున్న శ్రీ బుచ్చితమ్మయ్య, చిన్నరావుగార్లమీద నాచే కొన్ని పద్యములు చెప్పి వినిపింపబడ్డవి. అందొకటి మాత్రమిచ్చుట ఉదాహరిస్తాను.

ఉ. అంచితులౌ భవజ్జనకు లాదర మొప్పగఁ గాశిలోన జె
ప్పించిన సర్వశాస్త్రములఁ బెంపుగనధ్యయనం బొనర్చి రా
ణించెడు చర్లవంశవరనీరధిశారదచంద్రు సార్థతో
దంచిత బ్రహ్మయాభిధబుధాగ్రణిశిష్యుఁడ వేంకటాఖ్యుడన్

## ఆఱణాల మూడుడబ్బులతో ప్రయాణం

వివాహం జరిగిన తర్వాత, పదహారు రోజుల పండుగ ముగియకుండగానే, మరల గురువుగారి సాన్నిధ్యమునకు వెళ్లి చదువుతూ వుండగా, గురువుగారితో జల్లిసీమ[20] ప్రయాణం తగిలింది. ఆ ప్రయాణంలో తిరుపతిశాస్త్రిగారి గ్రామం యెండగండి మకాంలో గురువుగారు వుండగా గురువుగారి తల్లి శతవృద్ధురాలు స్వర్గస్థురాలైనది. ఆ కారణంచే గురువుగారు స్వగ్రామం దయచేసినారు. వెళ్లునప్పుడు శిష్యులతో, అంతకుముందు పాఠశాల నిమిత్తం ఆ చుట్టుపట్ల గ్రామస్థులు చందాగా నిచ్చిన ధాన్యమును ఏకత్రకు చేర్చి కడియెద్దకు చేర్చే యేర్పాటు చేయవలసినదిగా చెప్పినారు. ఆ వసూలు చేయుటలో నాకున్నూ ఒకవూరు వంతు వచ్చింది. ఆ వూరిపేరు ఉందుఱ్ఱు. నేనున్నూ, నాకు కొలదిదినముల క్రిందటనే సహాధ్యాయిగా

---

వెంకటగిరి (నెల్లూరు జిల్లా) జమీందారు సర్వజ్ఞ కుమార యాచేంద్ర (1831– 1892) ఏడుగురు కుమారులలో ఐదవవారు ముద్దుకృష్ణ యాచేంద్ర. వీరి అన్నగారు రాజగోపాలకృష్ణ యాచేంద్ర జమీందారు. ముద్దుకృష్ణ, తాను స్వయంగా జమీందారు కాకపోయి నప్పటికీ కవి పండిత పోషణ చేశారు. ఒక ప్రెస్‌ను స్థాపించి ఎన్నో గ్రంథాలు తెలుగు, సంస్కృత భాషల్లో ప్రచురించారు. తిరుపతి వేంకటకవులు తమ అవధానం ఏర్పాటు చేయమని అడుగుతూ చెప్పిన పద్యాలలో ఇది ఒకటి.

**20.** కొల్లేటి సరస్సుకు చుట్టూ వ్యాపించి ఉన్న భూఖండమే జల్లిసీమ. ఒకప్పుడు ఇక్కడ తరచూ అగ్ని ప్రమాదాలు సంభవించేవట. అందుకని ముస్లింల పరిపాలనా కాలంలో ఈ ప్రాంతాన్ని 'జలీ' అని వ్యవహరించేవారట. జలీసీమ క్రమంగా జల్లిసీమ అయ్యిందట. ఇది మరలా రెండు భాగాలు. కొల్లేటి చుట్టూ ఉన్న భాగానికి భీతర్‌జలీ అనీ, భీతర్‌జలీ చుట్టూ ఉండే ప్రాంతానికి బహిర్‌జలీ అని పేర్లు. శిస్తుల వసూలు సులభంగా ఉండటానికి ఇలా విభజించారు.

నేర్పడిన కందుకూరి కృష్ణశాస్త్రి గారున్నూ ఉందుఱ్ఱు వెళ్లవలసివచ్చింది. "నీకు తిరుపతిశాస్త్రి సహాధ్యాయి గదా! కృష్ణశాస్త్రిగా రెవ"రని చదువరు లడుగవచ్చును. వినండి, నేను గురువుగారి దగ్గఱ ప్రవేశించునప్పటికే తిరుపతిశాస్త్రి ప్రవేశించి చదువుచూ వున్నాడు. అందుచే ఒకటి రెండు మాసముల గ్రంథం అతనికి కౌముదిలో ఎక్కువ అయింది. ఆ కారణంచే ఇప్పటికింకను తిరుపతివేంకటేశ్వరులకు సతీర్థ్య[21] భావమే కాని, సహాధ్యాయిత్వము లేదని తెలియగోరెదను. కృష్ణశాస్త్రిగారున్నూ నేనున్నూ ఉందుఱ్ఱు వెళ్ళకపూర్వమే స్నానానికి వెళ్లి కాలువ వొడ్డున ఇట్లు ఆలోచించు కొన్నాము. ఏమని యంటే : "శాస్త్రులుగారు కొన్నాళ్లవఱకున్నూ మనకు పాఠములు చెప్పవీలుకాదు. ఈ సందర్భములో మనకు విద్యావిఘ్నమెట్లున్నూ తప్పదు. కాబట్టి కాశీకి వెళ్లుదుమా" అని యొకరితో నొకరము యోజించుకొనుచున్నాము. యోజించుకోవడమే తడవుగా, "శుభస్యశీఘ్రం" కనుక, తప్పక నేడే వెడదామని కూడా నిశ్చయించుకొన్నాము. త్రోవఖర్చులకు 'నీవద్ద నేమున్నదంటే నీవద్దనేమున్న' దని ప్రశ్నించుకోవడములో, నా వద్ద మూడు డబ్బులున్నూ, ఆయనవద్ద ఆఱు అణాలున్నూ[22] నిలువ తేలింది. బెజవాడనుండి కాశీకి మనిషి వక్కంటికి పద్దెన్మిది

---

**21.** ఒక గురువుగారి వద్ద ఒకేకాలంలో ఒకే శాస్త్రం చదువుకొనేవారు సహాధ్యాయులు అవుతారు. అలాకాక ఒకేకాలంలో వేరు వేరు శాస్త్రాలు చదువుకొన్నా, వేరు వేరు కాలాలలో చదువుకొన్నా సతీర్థ్యులు అవుతారు. ఒకే శాస్త్రం చదువుకొంటున్న సీనియర్, జూనియర్లు కూడా సతీర్థ్యులే అవుతారు.

**22.** అణా అంటే ఆరుపైసలు. రూపాయికి 16 అణాలు. డబ్బు అనేది ఒక నాణెం పేరు. మచిలీపట్టణం కేంద్రంగా డచ్ఈస్టిండియా కంపెనీవాళ్లు తమ నాణేలను ముద్రించుకొనేవాళ్లట. ఆ నాణేలలో పెద్దవిలువది డబ్. బ్రిటిష్ ప్రభుత్వకాలంలో దీని విలువను బాగా తగ్గించారు. ఈ పేరు తెలుగువారిలో డబ్బుగా వ్యాప్తిలోకి వచ్చింది. 1900 ప్రాంతాల వరకు ఈ డబ్బు పేరుతో తక్కువ విలువ నాణెం ప్రచారంలో ఉంది. తరువాత విలువ ఇంకా తగ్గించి డబ్బు నాణాన్ని విడుదల చేశారు. ఇది కూడా ఎక్కువ కాలం మనలేదు. డబ్బు రాగినాణెం. కన్యాశుల్కంలో గుంటూరుశాస్త్రి డబ్బుకు బంగారు కళాయి పూసి మొహరు (బంగారునాణెం)అని నమ్మించి యిచ్చాడని మీనాక్షి వాపోయింది. రెండవ కన్యాశుల్కం నాటికి 'డబ్బు' మాట పోయింది కానీ బంగారు మొహరు మాత్రం ఉంది. రద్దు అయ్యే నాటికి డబ్బుకి మూడు కానీలు. డబ్బుకు కొరగాడు (దమ్మిడీకి చెల్లడు, పైసాకి చెల్లడు లాగా) అనే జాతీయం దాని అల్పవిలువను తెలియచేస్తున్నది. డబ్బు ముద్రించే తొలికాలంలో 5 కాష్‌లు ఒక పైకా, 4 పైకాలు ఒక డబ్బు. డబ్బు దానికన్నా చిన్నవిలువలైన కాష్ (కాసు), పైకా క్రమంగా తెలుగులో సొమ్ముకి పర్యాయ పదాలయ్యాయి. ఈ నాణాలపై డబ్బు, కాసు, పైకా అని ఇంగ్లిష్‌లోను, తెలుగులోను మాత్రమే ముద్రించినవాటిని ఈ సంపాదకుడు చూశాడు. డబ్బుకు కొన్నాళ్లు నాలుగు

రూపాయిలు సుమారు టిక్కెట్టుకు కావలెను గదా? 'యెట్లాగంటే యెట్లాగ' అని అనుకొని "బెజవాడ వెళ్లేలోపున సంపాదించలేకపోతామా" అని ధైర్యం తెచ్చుకొన్నాము.

## కవిత్వపు గడబిడ

స్నానమైంది. ఎట్లో తొందరగా భోజనమున్నూ చేశాము. ఎండగండినుండి బయలుదేరి ఉందుఱ్ఱు గ్రామము వెళ్లి ధాన్యం వసూలు చేసి ఆ బస్తాలు తిరుపతిశాస్త్రి గారింటికి చేర్చే ఉపాయం చేసి, ఆ మఱునాడు కాశీప్రయాణపు సన్నాహంతో ఆ సమీపమున నున్న గణపవరం వెళ్లినాము. కాశీప్రయాణానికని చెప్పలేదు గాని యేదో కొంత యాచన కారంభించినాము. ఏమిన్నీ పలికినట్లు జ్ఞాపకంలేదు. ఆ వూళ్లో ఒక సాహిత్యపండితుడు వుండగా, ఆ రోజున వారింట్లో భోజనం చేశాము. ఆయనే కాకుండా, ఆయన ధర్మపత్ని కూడా సాహిత్యపరురాలు. ఈ విషయము కడు మృగ్యమగుటచే, ఆ పుణ్యదంపతుల దర్శనము మాకొక విధమైన సంతోషమును కలిగించి, భవిష్యత్సందర్భమునకు మంగళసూచకముగ కన్పట్టింది. ఆ మఱునాడు నిడమఱ్ఱు అనేవూరు వెళ్లాము. ఆ గ్రామము శ్రీ శనివారప్పేట[23] సంస్థానములోనిది. బారజల్లీ అనే సీమలో[24] ప్రధానగ్రామాల్లో వకటి. అక్కడ జమీందారుల ఠాణా ఆఫీసు వున్నది. ఆ సమయానికి ఆ యెస్టేటు మేనేజరు శ్రీ దుగ్గిరాల రామదాసుగారు అక్కడనే వున్నారు. మేము ముందుగా ఠాణా కచ్చేరీలోకి వెళ్లి కొంత గడబిడ కవిత్వంతో చేయమొదలుపెట్టినాము. ఎవరేనా ఏదేనా అడిగితే, కవిత్వంతోటే మాట్లాడటం మొదలుపెట్టేటప్పటికి, ఆ వుద్యోగస్థులన్నారుకదా, "అయ్యా, మీరెవరో చాలా గొప్పవారుగా ఉన్నారు. మిమ్మల్ని మా యజమానిగారు చూస్తే వదిలిపెట్టరు. కానీ వారిప్పుడు వక కార్యంలో చిక్కుకొని యున్నారు. రాత్రిగాని వారికి లేశమున్నూ

---

పైసలు, కొన్నాళ్లు మూడు పైసలు విలువ ఉండేది. నెమ్మదిగా 'డబ్' స్థానంలో పైస వాడుకలోకి వచ్చింది. పైస అనే పదం పోర్చుగీసు పదం 'పెసట్టో' నుండి వచ్చిందే.

**23.** పశ్చిమ గోదావరి జిల్లా కేంద్రం ఏలూరు సమీపంలోని గ్రామం. ఇప్పుడు దాదాపు ఏలూరులో కలిసిపోయింది. నూజవీడు జమీందారీలలో ఇది ఒకటి. ఇక్కడ ప్రాచీనమైన చూడచక్కని చెన్నకేశవాలయం ఉంది. సాధారణంగా ఊరి పేరు చివర 'పేట' ఉంటే అది బహిరంగ మార్కెట్–సంత జరిగే ప్రదేశమై ఉంటుంది. ఏ వారం సంత జరిగితే ఆ వారం పేరుతో ఆ ప్రాంతాన్ని పిలిచేవారు. బేస్తవారపేట, సోమవారపుపేట ఇలాగ.

**24**. పాదసూచిక – 20 చూడండి. బహిర్‌జలీ జనవాడుకలో బహిర్జల్లీ – బారజల్లీ – బార్జల్లీ అయ్యింది.

తీరిక కాదు. ఈవేళ చాలా వయస్సు గతించిన వారి యప్పగారి ద్వాదశాహస్సు. ఇది అంత విచారకరమైనది కాకున్ననూ, మీకు దర్శనం మాత్రం ఇవ్వడానికి అవకాశముండదు. మీరు వకటి రెండు రోజులు వుంటే తప్పక వారు మిమ్మల్ని చూచి ఆదరిస్తా"రని చెప్పగా, మేము ఎట్లో ఈ రాత్రే సభ జరిగే వుపాయం చేయవలసినదని పద్యాలతో ఆ ఠాణా ఆఫీసర్లను కోరితిమి. అట్లు కోరుటకు కారణమేమంటే, ఆ రోజున ఆయా గ్రామములనుండి పెక్కుమంది బ్రాహ్మణులు సంభావనకు వచ్చి యుంటారు. వారిలో నూటికి పదిమందియైనా పండితులు ఉంటారు. వారి సమక్షంలో మనము కవిత్వం చెప్పడం మొదలెడితే అది ఆయనకు బాగా నచ్చుతుంది. అలా నచ్చినట్లయితే కాశీకి వెళ్లడానికి యావత్తు ఖర్చున్నూ ఆయనే యివ్వవచ్చును. ఈవేళ తప్పితే ఈ పండితవర్గము ఇక్కడ తటస్థింపదు అని, మాకు వూహ కలిగింది. మా వూహకు అనుగుణంగా ఆ ఠాణా వుద్యోగస్థులు ఆ రామదాసుగారితో చెప్పి అనుసంధానం చేస్తామన్నారు.

## మొదటి అష్టావధానం

ఇది అంతా అయేటప్పటికి సుమారు జామున్నర ప్రొద్దు ఎక్కింది. ఆ వేళ వూళ్లో అందఱూ అక్కడికే భోజనానికి వెడతారు. కాబట్టి ఎక్కడా వంటలు లేవు. ఏనాలుగు గంటలకో అయిదు గంటలకో మేముకూడా ఆ సంతర్పణలోనే భోజనం చేయాలి. ఈలోగా చేసే పనేమిటి? సభలో చేసే కార్యానికి తగు కట్టుబాట్లు చేసికోవాలి. కాబట్టి ఇద్దరమున్నూ గ్రామానికి సమీపంలో వుండే ఒక పొలంలో నీరు తోడుకొనే యేతం గుంటలో స్నానం చేసికొన్నాము. నేను చిత్తైకాగ్రతకోసం గాయత్రీ జపానికి మొదలు పెట్టాను. ఆ సభలో వట్టి కవిత్వంకాక అష్టావధానం చేదామని నాకుతూహలం. అయితే యింతవఱకెవరేనా చేస్తూ వుండగా దానిని చూడనూలేదు, నేను చేయనూ లేదు. వారు చేశారు, వీరు చేశారని వినడం మాత్రం కలదు[25]. దానివల్ల నేమి తెలుస్తుంది? ఇప్పుడు క్రొత్తగా మొదలు పెట్టాలి.

---

**25.** తిరుపతివేంకటకవుల కంటే ముందు అవధానప్రక్రియ కదాచిత్తుగా వ్యాప్తిలో వుండేది. శ్రీనాథుడు, చరిగొండ ధర్మన్న, భట్టుమూర్తి అవధానం చేశారట. 64 కళలలోని కావ్యసమస్యాపూరణం అవధానానికి ప్రాచీన రూపం. 64 కళలలోనివే అయిన "పుస్తక వాచనము, ప్రహేళిక, ప్రతిమాల"లో కూడా అవధానాంశాల ఛాయలు లీలగా గోచరిస్తాయి. తిరుపతివేంకటకవులకి ముందు మాడభూషి వేంకటాచార్యులుగారు, పిఠాపురాస్థానకవులు దేవులపల్లిసోదరులు, విజయనగరంలోని మానవరూపగంధర్వుడు ఆదిభట్ల నారాయణదాసుగారు అష్టావధానాలు చేశారు. అయితే వీరి అష్టావధానం

దాని విధానంకూడా తెలియదు. కవిత్వం మట్టుకు అప్పుడప్పుడు పాఠశాలల్లో చదువుకొనే విద్యార్థులను కూర్చోపెట్టి వారివారి కోరిక ననుసరించి చెప్పుట కలదు. ఇట్టిస్థితిలో పెద్దసభలో అవధానం చేయడమంటే మాటలా? పోనీ, యెవరు చేయమన్నారు, ఏదో చేతనైనంతలో నాలుగు పద్యాలు చెప్పి వూరుకోరాదా, అంటే, అంతమాత్రానికి కాశీప్రయాణానికి సరిపడ్డ ద్రవ్యం వూడిపడుతుందా? పడదు. అందుకోసం జపం ప్రారంభించాను. కూడా వున్న కృష్ణశాస్త్రిగారికీ కవిత్వప్రవేశం లేదు. లేకపోయినా, నాకంటే ఆయన సభకు తగిన లక్షణాలు తేజస్సు వగయిరా కలవాడు. వ్యాకరణం చదువుచున్నాడు. స్మితపూర్వాభిభాషి. జాతకభాగంలో చక్కనిప్రవేశం కలదు. అంతకుముందే నా జాతకం చూచి "నీది సభలలో పేరుపొందే జాతకమయ్యా" అని చెప్పేవాడు. నాడు కూడా ఆ మాటలే చెపుతూ నాకు ప్రోత్సాహం కలిగించాడు కాని, పిఱికిమందు మాత్రం పోయలేదు.

నేను అదే దీక్షగా గాయత్రీజపం సాగించి అందఱున్నూ మళ్లు గట్టుకొని భోజనాలకు వెళ్లేవేళకు సుమారు మూడుగంటలు దాటేవేళకు ముగించాను. ఇరువురము ఆ అలవేళ *(సాయంకాల సమయం)* ఆ సంతర్పణలో భోజనం చేశాము. భోజనానంతరం ఆయన బ్రాహ్మణాశీర్వచనం పుచ్చుకొనే సమయంలో మా ప్రస్తావన వచ్చింది. అప్పుడు ఆ రామదాసుగారు సభాస్తారులైన పండితులను, "అయ్యా! ఈరాత్రి వీరెవ్వరో కవీశ్వరులు సభ చేస్తారు కాబట్టి, మీరందఱున్నూ ఆగి రేపట దయచేయవలసిం"దని కోరారు. 'ఇంతకన్నా వుందా,' అని ఆయా పండితులు ఆమోదించారు. పెద్ద కుంకుమబొట్టుతో నేను సభలో కూర్చుని అవధానమునకు మొదలుపెట్టి "అయ్యా? మీలో నెవరేనా శాస్త్రార్థానకు[26] వకరు దయచేయవలసిం"దని వినయంగానే కోరితినిగాని, నా కుంకుమబొట్టుకు

---

ఏదో క్రీడగానే ఉండేది. ఉద్యమస్థాయి తెచ్చింది మాత్రం తిరుపతివేంకటకవులే. అవధానం ఇలా ఉండాలి, ఈ అంశాలు ఉండాలి అని స్పష్టమైన రూపురేకలు తీర్చిదిద్దింది ఈ మహానుభావులే. మాడభూషివారు తమకు కొంతమేరకు ఆదర్శప్రాయులని వేంకట శాస్త్రిగారు ప్రస్తావించకపోలేదు. శ్రీనాథుడు అవధానం ఇలా చేసి ఉండొచ్చని నోరి నరసింహశాస్త్రిగారు "కవిసార్వభౌముడు" నవలలో చక్కని కల్పనా సన్నివేశాన్ని చిత్రించారు. కాళిదాస సాహిత్యవ్యాఖ్యాత కొలచల మల్లినాథసూరి తాత మల్లినాథుడు (13వ శతాబ్దం) శతావధానం చేసి కాకతీయ ప్రతాపరుద్రునిచే కనకాభిషేక సత్కారం పొందాడట.

**26.** పూర్వపక్ష సిద్ధాంతాలు జరపడం శాస్త్రార్థం. దీనికోసం పండిత సభ ఏర్పడాలి కనుక శాస్త్రార్థమంటే సభలు అని రూఢి అయ్యింది.

జంకియో, యేమోగాని, నాకన్న ననేకరెట్లు గొప్పవారా సభలో నుండిన్నీ, నాయెదుటికివచ్చి వకరేనా కూర్చోలేదు. అపుడు కూడావున్న కృష్ణశాస్త్రిగారే శాస్త్రార్థం చేశారు. తక్కిన పద్యాలు వగయిరాలు అన్నీ యథోచితంగా చెప్పితినిగాని, అందొక లోటు చేశాను. ఎనమండుగురినీ కూర్చోపెట్టి పద్యాలు చెప్పుటకు బదులు, ఒక్కరినే కూర్చోపెట్టి ఒకటి అయిన తరువాత వేఱొకటిగా ఎనిమిది పద్యాలు మాత్రం చెప్పి ముగించాను. ఇందులో ధారణ కష్టం లేదు. సభ్యులు ఈ రహస్యం కనిపెట్టినట్లు లేదు. ఈ సభనాటికి ఈ యవధానములను గూర్చి లోకులంతగా యెఱుగరు. కాబట్టి, మేము ఆడినదాట పాడినదిపాటగా సాగింది. గుర్వనుగ్రహమున సమస్తమున్నూ సమకూరుతుంది. సభ్యులు సంతసించారు. రామదాసుగారు సంతసించారు. మా కాశీ ప్రయాణమును గూడ రామదాసుగారికి దెల్పితిమి. ఇరువురికిన్నీ యెంత ఖర్చగునో రమారమిగా అంతయు రామదాసుగారు మాకు బహుమానంగా యిచ్చారు.

## కాశీ ప్రవేశం

అటనుండి గుండుగొలను గ్రామం వెళ్లితిమి. అక్కడ కూడ చిన్నసభ జరిగినట్లు జ్ఞాపకము. అటనుండి ఏలూరుద్వారా బెజవాడకు వెళ్లి అట రైలెక్కినాము. బోనగల్లు స్టేషనులో దిగి వత్సవాయి గ్రామంద్వారా జగ్గయ్యపేటకు వెళ్లితిమి. వత్సవాయిలో నొకరోజు ఆగితిమి. అక్కడ జొన్నన్నమును భుజింపవలసి వచ్చెను. ఆ కారణముచే, వకపూటే గాని రెండోపూట భోజనముతో పనే లేకపోయింది. జగ్గయ్యపేటలో కోమట్లు చాలా ధర్మపరులు కలరని మా గురువుగారు అప్పుడప్పుడు ప్రస్తావించుచుండగా వినివుండడం చేత ఆ వూరికి వెళ్లడం తటస్థించింది. తదనుగుణంగా, ఆ వూళ్లో శ్రీరామ రాజన్న అనే వైశ్యవృద్ధుడు మాచే పురాణం చెప్పించి వక వారంరోజులాపి తగుమాత్రంగా మమ్మును సన్మానించాడు. అటనుండి మళ్లీ రైలుస్టేషనుకు బోనగల్లు వెళ్లునపుడు త్రోవలో మక్కపేటలో నీలకంఠయ్యగారు అనే ఒక రాజయోగిని సందర్శించితిమి. ఆయన బ్రాహ్మణుడే కాడని కొందఱు, బ్రాహ్మణుడేయని కొందరు ఇటీవల తగవులాటలు పెట్టుకొని ఒకరి నొకరు వెలివేసి కొన్నట్లు పిమ్మట వింటిమి కాని, ఆయన జాతికి యెవరైననూ సిద్ధపురుషుడనుటలో సందేహం మాత్రం లేదు. ఆయనకూడా మమ్మల్ని సమ్మానించాడు. పిమ్మట సికింద్రాబాదులో దిగినాము. రాత్రి తొమ్మిదిగంటలవేళ దిగినప్పటికి, స్వగృహమునకు వెళ్లినప్పటికంటే అనేకరెట్లు అధికముగా వేడినీళ్లు స్నానము లోనైన ఉపచారాలతో పుచ్చా లక్ష్మయ్యగారు ఆతిథ్యమిచ్చారు. ఆ

నిరతాన్నదాత గృహమునందే మఱి వారం రోజులు ఆ పట్టణం చూస్తూ ఆగినాము. వెళ్లేటప్పుడు ఆ గృహస్థు నాకు వారింట్లో యెప్పటినుంచో నిలవవున్న సిద్ధాంత కౌముదిని కూడా యిచ్చినాడు. అక్కడ రైలెక్కి వాడీస్టేషనులోనున్నూ, మళ్లా ధోండు, జబ్బలపూరు స్టేషనులోనున్నూ దిగి, మహారాష్ట్రుల హోటలులో భోంచేసి, అటు పిమ్మట ప్రయాగలో దిగి, త్రివేణీసంగమస్నానం చేసికొని, ఆనాడే రాత్రి సుమారు పన్నెండుగంటలవేళ కాశీలో దిగినాము. ఎవరో రైలులో కలిగిన పరిచయంవల్ల ఏదో ఒక మేడమీదకు తీసుకువెళ్లినారు. అక్కడనే మిగిలిన రాత్రిని గడిపితిమి.

## రోగనివృత్తికై కవిత్వం

నాకు అప్పటికప్పుడే తలతిప్పు వ్యాధి కొంచెం వుండేది. అది యెకాయెకీని రైలుప్రయాణం చేయడంచేత కొంత విస్తరించి నిద్ర పట్టనేలేదు. అదిన్నీ కాక, అంతకుపూర్వం మా గురువుగారు చెపుతూ వుండే మాటలు కొన్ని జ్ఞప్తికి వచ్చాయి. కాశీగంగ క్రొత్తగా వచ్చినవాళ్లని పరీక్ష చేస్తుందనిన్నీ, ఆ పరీక్ష కాగినవాళ్లనే అక్కడ వుండనిస్తుందనిన్నీ, ఆగనివాళ్లని కొద్దిరోజుల్లోనే వెళ్లగొడుతుందనిన్నీ చెపుతూ వుండేవారు. ముఖ్యంగా ఆ పరీక్ష గ్రహణివ్యాధి *(అంటువ్యాధి అయిన అతిసార)* రూపంగా కనుపడుతుందని కూడా వారే చెప్పేవారు. అప్పుడామాట జ్ఞప్తికివచ్చి, చేతనైన పనిగనుక గంగాదేవిమీద కవిత్వం చెప్పడానికి మొదలుపెట్టాను. నాకు చిన్నప్పటినుండిన్నీ రోగనివృత్తికై కవిత్వం చెప్పడం అభ్యాసం అని పలువు రెఱిగినదే కావున విస్తరింపనవసరం లేదు. ఆ కవిత్వం కాళికాది స్తోత్రమాలలో అచ్చుపడే వున్నది. కాని అప్పటి శైలిని తెలుపుట కిక్కడ నొకదాన్ని మాత్రముదాహరిస్తాను.

శ్లో ॥ అంగోద్భవాహితజటాపటలప్రసంగే
రంగత్తరంగ కనదుత్తమ హంస సంఘే
తుంగాఘసంఘ శమనప్రకటాంగసంగే
గంగే కృపాం మయి విధేహి కృపాంతరంగే[27]

---

**27.** 'శరీరము నుండి ఉద్భవించి విరివిగా రెట్టింపు చేసుకోబడిన జటాజూటము కలిగిన ఈశ్వరునితో సంబంధము కలదానా! ఎగసి ఎగసి ప్రవహించుచున్న తరంగములపై ప్రకాశమానములైన ఉత్తమహంసల యొక్క సంఘమును కలదానా! మహాఘోరపాప సమూహములను శమింపచేయుటయందు ప్రసిద్ధములైన అవయవములు (మణికర్ణిక, దశాశ్వమేధ, పంచగంగ, హరిశ్చంద్రాది ఘట్టములు) కలదానా! కృపాతరంగితవైన ఓ గంగామాతా! నాపై కృప చూపుము' అని శ్లోకార్థం. వేంశా పద్యశైలి మొదట ఆడంబరంగా ఉండి సరళమైనట్లే వచనం కూడా గ్రాంథికం నుండి సరళ వ్యావహారికంలోకి మారిపోయింది.

## రాత్రి భోజన సదుపాయం

తెల్లవారిన తరువాత తెలుగుదేశపు విద్యార్థులు తఱచుగా నివసించే నారద ఘట్టానికి[28] వారివారి సహాయంమీద వెళ్లగలిగితిమి. ఆ ఘట్టానికి వెళ్లేవరకే మాకు అయోమయంగా వున్నదిగాని, వెళ్లింది మొదలు అందఱూ స్వదేశీయులే కనుక స్వదేశములో వున్నట్లే వున్నది. వెళ్లిన మఱునాడే నాకు రాత్రిభోజనం కూడా కుదిరింది.




*కాశీలో 'నారద ఘాట్' (2012)*

**28.** కాశీలో వరుణ, అసి నదుల మధ్య గంగానది ఒడ్డున 64 స్నానఘట్టాలున్నాయి. ఈ ఘట్టాలకి ఒడ్డున అన్నీ నివాసగృహాలు. సాధారణంగా ఒక్కొక్క ఘట్టం ఒడ్డున ఒక్కొక్క రాష్ట్రంవారు స్థిరనివాసం ఏర్పరచుకొని ఉన్నారు. నారదఘట్టం తెలుగువారు కాశీలో ఉనికిని ఏర్పరచుకున్న ఘట్టం. నూరు, నూటయాభై ఏళ్లక్రితం కాశీవెళ్లిన తెలుగువారి కుటుంబాలు ఇప్పుడుకూడా నారదఘట్టములో, కేదారఘట్టములోనే నివాసముంటున్నాయి.

కాశీలో పూర్వం చదువుకొన్న మహాపండితులందఱున్నూ వంటిపూట తిని చదువుకొన్నవారే. అనేక సత్రాలు వున్నాయిగాని, ఆయా సత్రాల్లో వకపూట మాత్రమే పగలు పెడతారు. రాత్రి శుద్ధశూన్యమే. అయితే గోధుమరొట్టెలు వేయడం ఆచారం గనుక, ఆ రొట్టెలు అలవాటయి పడడం మొదలుపెడితే రాత్రికి ఆకలే వెయ్యదనిన్నీ, అందుచేతనే వత్సరాలకొలది పూర్వం పండితులు యేకభుక్తంతోవుండి చదువుకో గల్గినారనిన్నీ చెప్పగా విన్నాను. దానికి తథ్యంగా ఇంకొక్కటికూడా మా గురువుగారు చెప్పేవారు. మంథెన్న ఘనాపాఠీలు[29] ముఖ్యంగా యాచనే జీవనంగా కలవారు ఆ కారణంచే తఱచు పరవాసం చేస్తూవుంటారు. పరవాసానికి బయలుదేరింది మొదలు మళ్లా యింటికి వెళ్లేవరకున్ను ఏకభుక్తమే చేస్తారు. ఆ కారణం చేతనే పరవాసంలో వారి ఆరోగ్యం చెడకుండా వుంటుంది. అని గురువుగారు చెప్పగా వింటిని. ఇది నిజమే కావచ్చును. కాని నాకు మాత్రం వెళ్లిన మఱునాడే రాత్రి భోజనం కుదిరింది గాని, లేనిచే నేనచ్చట వుండనే లేకపోదును. ఈ రాత్రిభోజన సదుపాయం ఇటీవల తెలుగు విద్యార్థులకు మాత్రమే కాకినాడ కాపురస్థుడు శ్రీ పైడా వెంకన్నగారు[30] ప్రతి దినమున్నూ ముప్పదిమందికి ఏర్పాటు చేసినాడు. ఈయన సత్రం సాగించడం[31] మొదలు పెట్టిన తరువాత కొందఱు నలుగురికీ

---

**29.** కరీంనగరం జిల్లాలోని మంథెన గ్రామం వేదవిద్యలకు ప్రసిద్ధి చెందిన గ్రామం. చదువుకోసం కాశీకి వేళ్లేవారిలో మంథెనవారిది కూడా పెద్దపద్దు.

**30.** తూర్పుగోదావరి జిల్లాలోని అన్నదేవరపేట – ప్రక్కిలంక ఎస్టేట్‌ను పిఠాపురం వారి వద్ద కొని పైడా సర్వయ్య జమీందారయ్యారు. వైశ్యులు. ఈయన మనుమడే కాశీలో సత్రం వేయించిన వెంకన్న. వీరికాలంలో చిన్న చిన్న గ్రామాలను కొనుగోలు చేసి ఎస్టేటును విస్తరించారు. కందుకూరి వీరేశలింగం సంఘసంస్కరణోద్యమాలకు అనేక విధాల అండదండలు అందించిన పైడా రామకృష్ణయ్య వెంకన్న మనుమడు. వెంకన్న సంస్కృతం చదువుకునే విద్యార్థుల కోసమే కాశీసత్రం ఏర్పరిచారు. ఇది కేదార్‌ఘాట్ సమీపంలో చింతామణి గణపతి మందిరమున్న 'చల్లా కృష్ణశాస్త్రి మార్గ్' లోనే ఈ సత్రం ఇప్పటికీ ఉంది. 1930లో పాతసత్రాన్ని పడగొట్టి కొత్త సత్రం కట్టారు. దానినీ పడగొట్టి మరలా 2002లో ఫోటోలో చూస్తున్న సత్రం కట్టారు. 1930 నాటి శంకుస్థాపన ఫలకాన్ని పారేయకుండా కొత్తదాని గోడలో బిగించడం వలన ఈ విషయం తెలుస్తున్నది. దీనిని కనుగొనడం అసాధ్యమే అని భావించాను. కాశీవాసులైన శ్రీ చల్లా అన్నపూర్ణ ప్రసాద్ సహాయంతో చూడగలిగాను.

**31.** సత్రం అంటే భోజనం పెట్టడం అని అసలు అర్థం. కాశీలో సత్రం వేయించడం అంటే ప్రత్యేకంగా భవనం వంటివి కట్టించకపోయినా అద్దెకు తీసుకొని అయినా నియమితంగా కొంతమందికి భోజనం పెట్టేవారు. కాశీలో చదువుకొనడానికి వచ్చిన

అయిదుగురికీ పెట్టడానికి ఏర్పరచారు గాని, ఏమైనా అవిచ్ఛిన్నంగా ఈ వెంకన్నగారి సత్రమే జరిగేది. అంతత్వరలో నాకు రాత్రిభోజన సదుపాయం కుదరడానికి కారణం కవిత్వమే. ఆ నారదఘట్టములో పలువురు తెలుగుదేశపు విద్యార్థులు వున్నా, ఒక్కరున్నూ కవిత్వం చెప్పేవారు లేరు. శాస్త్రంలో కొంతమంది ప్రవేశం



*నివాసగృహంగా మారిపోయిన పైడా వెంకన్న సత్రం (2012)*

విద్యార్థులకు, దర్శనానికి వచ్చే యాత్రీకులకు భోజన సౌకర్యం ఏర్పరచడం పరలోక సాధకమనే నమ్మకం దీనికి కారణం. జమీందారులు, విజయనగరం, ఇండోర్, తంజావూరు, గ్వాలియర్ సంస్థానాలవారు యాత్రికులు ఉండటానికి పెద్దపెద్ద విశ్రాంతి శాలలు కట్టించేవారు. అందులో నిత్యాన్నదానం జరిపేవారు. ఈ భవనాలలో కూడా కొంతమంది వెసులుబాటు ఏర్పరచుకొని కొద్దిమొత్తంలో తమ సత్రాన్ని కూడా సాగించుకొనేవారు. జమీందారులు ఏర్పరచిన నిత్యాన్నదాన పథకాలు తెల్లయేనుగులై భరించలేక కొద్ది సంవత్సరాలలోనే అంతరించిపోగా వెంకన్న ఏర్పరచిన సత్రం మాత్రం స్థలాలు మారుతూ సుమారు 70 యేళ్లపాటు అవిచ్ఛిన్నంగా కొనసాగిందిట.

కలవారున్నా, సంస్కృతంలోనైనా మంచి సాహిత్యం కలవారు లేరు. తెలుగులో ప్రవేశం కలవారు లేరని చెప్పనే అక్కఱలేదు. ఇట్టి స్థితిలో నన్ను చూచేటప్పటికి మన దేశస్థులందఱికీ ఎక్కడలేని ప్రేమా కలిగింది. వీళ్లందఱున్నూ నన్ను వెంటబెట్టుకొని వెళ్లి 'అంతవాడు, ఇంతవాడు, పైగా అష్టావధాన శతావధానాలు చేస్తాడు' అని వున్నవి కొన్నీ, లేనివి కొన్నీ చెప్పేటప్పటికి, ఆ సత్రాధికారికి నామీద ప్రేమ పుట్టి వెంటనే నాకు రాత్రి భోజనం ఏర్పాటు చేశాడు.

ఇక నాతో వచ్చిన కృష్ణశాస్త్రికి రాత్రిభోజనం కుదరాలి. ఏదోవక వారంపది రోజులలో కుదురుస్తామని విద్యార్థులు చెపుతూ వున్నారు. మధ్యమధ్య ఆ పోస్టులు కూడా కాళీ అవుచుండడం తటస్థిస్తూ వుంటుంది. ఆ కాళీలో క్రొత్తవారిని ప్రవేశ పెడుతూ వుండడం జరుగుతూ వుంటుంది. అందుకోసం నిరీక్షిస్తూ వుండగా కృష్ణశాస్త్రిగారికి గంగచేసే పరీక్ష ప్రత్యక్షమయింది. ఆ కారణంచేత, ఆయనకు రాత్రిభోజనం మాటట్టే వుండగా, పగటిభోజనంతో కూడా పనే లేకపోయింది. ఆ అనారోగ్యంతో సుమారు ఇరవై రోజులు శ్రమపడి, తుదకు ఆయన స్వదేశగమనానికి సిద్ధమయి, త్రోవఖర్చులకు సొమ్ము పంపమని అన్నగారి పేర వ్రాసుకొన్నాడు. నావలెనే ఆయనకూడా బీదకుటుంబములోవాడే అగుటచేత, కొంత ఆలస్యంగా ఆయన అన్నగారు సొమ్ము పంపినారు. సొమ్ము వచ్చేటప్పటికి దైవకృపవల్ల కృష్ణశాస్త్రి గారికి ఆరోగ్యం కుదుటబడ్డది. ఆ కారణంచేత, 'వెడదామా, మానదామా?' అని తటపటాయిస్తూ ఆయన తుదకు స్వదేశానికి వెళ్లక కాశీలోనే వుండి భాష్యాంతం చదివికొని పిమ్మట కొన్ని సంవత్సరాలకు స్వదేశానికి వెళ్లినారు.

## విద్యావ్యాసంగం

ఇక నేనో, గంగని ప్రార్థించడం వల్లనో, నాయందా కాశీవిశ్వేశ్వరునికి దయే కలిగిందో చెప్పలేనుగాని, స్వదేశంలోకన్న మంచి ఆరోగ్యముతో వుండడం తటస్థించింది. జిఱ్ఱున చీదని స్థితిలో వుండి కావ్యపాఠం చదివికొనే యిద్దఱు విద్యార్థులకు గురుత్వం చేస్తూ, శ్రీ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రులవారి వద్ద వ్యాకరణం తరువాయి చదవడానికి మొదలు పెట్టాను. నాకు అప్పటికి దేశంలో కౌముది పూర్వార్థం సమాస ప్రకరణం కొంతవఱకున్నూ, ఉత్తరార్థం తిఙంతం కొంతవఱకున్నూ అయినది. అంతేకాకుండా, ఎవరేది చదువుతూంటే అది విని అంతో యింతో గ్రహించే శక్తి వుండడంవల్ల, తత్త్వబోధినిలో నేమి, మనోరమలోనేమి,

శేఖరం[32] లోనేమి, కొన్ని కొన్ని సంగతులు కూడా శ్రీ బ్రహ్మయశాస్త్రులుగారి కృపవల్లనే తెలిసికోగలిగాను. ఈ కారణంచేత, కాశీలో శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రులవారి వద్ద పరిభాషేందుశేఖరంలో అదివఱకు విన్న తరువాయి నుంచి, అనగా యదాగమపరిభాష వద్దనుంచి మొదలుపెట్టి కౌముదితోపాటు దానిని కూడా చదువుతూవుండేవాడను. చదువు దేశంలోకన్న విశేషంగా జరగడం లేదుగాని, కాశీమహాపట్టణములో నివాసము, అనేక చిత్రములు, అనేక ఉత్సవములు, అనేక సభలు, క్రొత్తదేశము, క్రొత్త ఆచారములు, ఇవన్నీ మనస్సును ఆకర్షించి, అక్కడవున్న కాలమంతా బహుచక్కగా, ఉల్లాసంగా జరిగింది. చదువుమాత్రం స్వదేశంలో జరిగినట్టు కాశీలో జరుగదు. అనధ్యయనాల చిక్కు కాశీలో చాలా ఉంది. మాట్లాడితే ఏదో వంక పెట్టి అనధ్యయనం[33]. పండితులేనా, పూర్వకాలంలో ఎప్పుడోగాని నేను కాశీ వెళ్లేటప్పటికి మనదేశంలో, కాశీలో చదివి అక్కడనే పేరు ప్రతిష్ఠలు పొంది వచ్చినవారు చాలామంది వున్నారు. ఒకటి మాత్రం ఉంది. ఒక్క ప్రదేశంలో అంతమంది, అన్నిశాస్త్రాలలోనూ కావాలంటే మాత్రం దొరకరు. ఏమైనా, మా విద్యార్థిదశనాటికి కాశీనుంచి వచ్చిన పండితుడంటే వక పెద్దపర్వతం

---

**32.** సిద్ధాంతకౌముదికి 16వ శతాబ్దంలో జ్ఞానేంద్ర సరస్వతి రచించిన వ్యాఖ్యానమే తత్త్వబోధిని. ఇది చాలావరకు ప్రౌఢమనోరమకు అనుకరణ రూపమట. భట్టోజీదీక్షితులు తాను రచించిన సిద్ధాంతకౌముదికి తానే ప్రౌఢమనోరమ అనే వ్యాఖ్యానాన్ని రచించాడు. దీనిలో పాణిని, పతంజలి, కాత్యాయనుని (మునిత్రయం) వ్యాకరణాలను తప్ప మరివేటినీ ప్రమాణంగా అంగీకరించలేదట. దీనిని ఖండిస్తూ జగన్నాథపండితరాయలు ప్రౌఢమనోరమాకుచమర్దనమనే ఖండనగ్రంథాన్ని రచించాడు. వాసుదేవదీక్షితులు సిద్ధాంతకౌముదికి బాలమనోరమ పేరుతో వ్యాఖ్యానాన్ని రాశారు. 18వ శతాబ్దివాడైన ప్రసిద్ధవైయాకరణి నాగేశభట్టు పరిభాషేందుశేఖరాన్ని రచించాడు. శేఖరం సంక్షిప్తనామం.

**33.** అనధ్యయనం అంటే చదవకూడని రోజులు. అమావాస్య, పౌర్ణమి, రెండు పాడ్యములు, రెండు అష్టములు, రెండు చతుర్దశులు – మొత్తం ఈ 8 రోజులలో చదివితే ఒంటపట్టదని ఒక నమ్మకం ఉంది. అశోకవనంలో చిక్కిపోయి, శోకభరాలసయైన సీత ప్రతిపత్తు నాడు చదివిన చదువులా ఉందని వాల్మీకి ఉపమించాడు. ప్రతిపత్ అంటే పాడ్యమి. ఆరోజు కొత్త పాఠాలు ప్రారంభించకూడదు కాని పాత చదువుని మననం చేసుకోవచ్చునట. అష్టాధ్యాయితో భారతదేశానికి ఖ్యాతి తెచ్చిన పాణిని త్రయోదశినాడు కైలాసవాసి అయ్యాడు. ఏ త్రయోదశో తెలియదు. అందుకని ఆయన గౌరవార్థం వ్యాకరణం చదివేవారికి అష్టమి బదులు రెండు త్రయోదశులూ సెలవు. ఇవి కాకుండా పెద్దలు, పండితులు వచ్చినరోజు వారితో సంభాషించి సందేహాలు తీర్చుకోవడానికి, శాస్త్రాల్లోని సూక్ష్మాలు అర్థం చేసుకోవడానికి ఇచ్చే సెలవును శిష్టానధ్యయనం అంటారు. ఇలా తరచూ రకరకాల కారణాలతో సెలవులు వస్తుండేవి.

లాగు మా మనస్సుకు తట్టేవాడు. ఈ దేశంలో చదివినవాడంటే వారికన్న యెంత గొప్పవాడైనా మా మనస్సుకు ఎంతో తక్కువగా కనుపడేవాడు. తెలివితేటలు వుండాలి, తగిన గురుశుశ్రూష వుండాలి, వ్యాసంగం వుండాలి అంతే కాని దేశంలో చదివినా వకటే కాశీలో చదివినా వకటే. అయితే మాత్రం ఇంత విచారణ చేసేదెవరు? కాశీలో అన్నియేళ్లున్నారంటే, యిన్నియేళ్లున్నారంటే చెప్పుకొనే మాటలమీద గౌరవించేవారే కాని. పాండిత్యమెట్టిదనే మాట జనసామాన్యానికి అక్కఱ లేదు గదా ! ఎవరో వకరు ప్రాజ్ఞతను బట్టి విచారించేవారున్నూ పూర్వకాలమందున్నట్టు ఈ శ్లోకపాదం వల్ల మనము తెలిసికోవచ్చు "కాశీ గమనమాత్రేణ నాన్నంభట్టాయతే ద్విజాః". ఏమైనా, వ్యాకరణానికి కాశీ, తర్కానికి నవద్వీపము[34], మీమాంసకు దక్షిణదేశము, వేదానికి కృష్ణాగోదావరీతీరాలు అనాదిగా ప్రసిద్ధి. ఈలా వున్నను, వేదశ్రౌతాలు[35] తప్ప తక్కినవన్నీ కాశీలో మనదేశముకన్న నెక్కువగానున్న వనుటలో నతిశయోక్తిమాత్రం లేదు.

## తాంబూలం - భోజనం

నేనప్పుడు చదివికోదలచినది వ్యాకరణం మాత్రమే. దానికి స్వదేశంలోనే బోలెడు గురువులు కలరు. కాశీకి వెళ్లనే అక్కఱలేదు. కాని నేను అనుకున్న తాంబూలపుచిక్కు దేశంలో వదలడం, అందులో మా గురువుగారి వూళ్లో వదలడం యెట్లు? అది కాశీలో వదలింది. రోజు వకటి రెండు మూడు సార్లే కాకుండా, ఎన్నిసార్లో తాంబూలం, సురితీ (సున్నము కలిపి నలిపిన పొగాకు) సహితంగా అందఱున్నూ వేస్తారు. ఎవరింటికి వెళ్లినా ముందుగా తాంబూలపు సామాను యెదుటబెట్టిగాని, రెండోమాట మాట్లాడరు[36]. అది ఆ దేశపు ఆచారం.

---

**34.** పశ్చిమబెంగాల్‌లోని ఒక చిన్నగ్రామం నవద్వీపం. ఇప్పటి పేరు నదియా. కాశీలోను, నవద్వీపంలోను అన్ని శాస్త్రాలు బోధించే ఉద్దండపండితులు ఉండేవారు. కానీ అనాదిగా కాశీ వ్యాకరణానికీ, నవద్వీపం తర్కానికీ ప్రసిద్ధి. చైతన్యమహాప్రభు జన్మస్థలం.

**35.** శ్రౌతం అంటే యజ్ఞయాగాదులు చేయించే విధానం, ఆ సమయములో నడపవలసిన కార్యకలాపం. ఇంట్లో అగ్నిహోత్రం ఆరిపోకుండా చూస్తూ నిరంతరాయంగా పూజించే ఒక పద్ధతి నిత్యాగ్నిహోత్రం. దీనికి సంబంధించిన విధానం కూడా శ్రౌతం చెబుతుంది. ఇది మూడు కాండలు.

**36.** 20-11-2012 నాడు బొమ్మిడాల శ్రీకృష్ణమూర్తిగారు, ఈ సంపాదకుడు కాశీలోని బేల్‌పుర ప్రాంతంలోని విజయనగరం కోఠీలో సర్ విజ్జీ (విజయనగరం పివిజి రాజు గారి చిన్నాన్న) చిన్న కుమారుడు కువర్ వెంకటేశం సింగ్ అలక్ నారాయణ గజపతి గారిని కలిసినప్పుడు ముందు చేయబోయిన మర్యాద 'పాన్ తీసుకోండి' అని. ఈ

తాంబూలం సంగతి యిట్టిది కదా! ఇక భోజనమో? ఉదయం ఎనిమిదిగంటలు మొదలు రెండుగంటల వఱకున్నూ నిరభ్యంతరంగా సత్రాలున్నాయి ఎనిమిదింటికి రామరాజు (అనంతపురం) సత్రం[37], పదింటికి తంజావూరు రాణీ సత్రం, పన్నెండింటికి తంజావూరురాజా సత్రం, పన్నెండున్నరకు అన్నపూర్ణ సత్రం, (దీనినే శ్రీమంతుడు[38] పెట్టించినట్లు చెపుతారు. ఇది మేము నివసించే నారదఘట్టానకు మిక్కిలి దగ్గఱ. ఇందులో చాలామంది సన్యాసులకు భిక్ష జరుగుతుంది.) రెండు గంటల ప్రాంతంలో సింధ్యాసత్రం[39]. ప్రతి సత్రంలోనున్నూ కానో అర్ధణో దక్షిణ, భార్యాసహితంగా చదివికొనే విద్యార్థులకు కూడా ఆయా సత్రాల్లో అన్నం పెడతారు. ఒకటి మాత్రమున్నది. మగవాడు ప్రత్యేకించి వెడితే అన్నం పెడతారుగాని, ఆడది అట్లా వెడితే పెట్టరు. మగవానితో కూడ వెడితే ప్రశ్నించరు. భార్యాభర్తలనే అనుకుంటారన్నమాట, తండ్రీకూతుళ్లు, అన్నాచెల్లెళ్లు, వెడితే అన్నం పెడతారో

---

మర్యాద గురించి సరిగా తెలియక నిరాకరించగా కనీసం యాలుకకాయ అయినా తప్పక తీసుకోవాలని వాటిని ఇచ్చారు.

**37.** ఈ అనంతపురం ఆంధ్రప్రదేశ్ లోనిది కాదు. కేరళలోని తిరువనంతపురం. తిరు సాధారణంగా వాడే గౌరవ వాచకం కనుక తిరు లేకుండా అనంతపురం అని అన్నారు వేంకటశాస్త్రి. తిరువనంతపుర పాలకులలో చాలామంది రామరాజులున్నారు. ఎవరు కాశీలో సత్రం సాగించడం మొదలు పెట్టారో తెలియదు కానీ 1850 నుండి 1900 వరకు (సుమారుగా) జరిగినట్లు దాఖలాలున్నాయి. విశేషమేమిటో కాని కాశీలో జమీందారులు, సంస్థానాధీశులు నడిపే సత్రాలు 1900 నుండి క్షీణిస్తూ వచ్చాయి.

**38.** మహారాష్ట్ర రాజుల వద్ద మంత్రి పదవి పేరు పీష్వా. కాలక్రమంలో వారు కొంత రాజ్యాన్ని ఆక్రమించారు. పీష్వాకే నామాంతరం శ్రీమంత్. పూనా వారి ప్రధాన రాజకీయ కేంద్రం. తమకున్న ప్రసిద్ధ బిరుదు శ్రీమంత్‌ను ధనం నజరానాగా తీసుకొని జమీందారులకు కూడా ప్రదానం చేయడం కనబడుతుంది. చల్లపల్లి జమీందారులకు శ్రీమంత్ బిరుదు పీష్వా ఇచ్చిందే. వారికిచ్చిన తరువాత కాశీ ప్రయాణంలో అమరావతి జమీందారు వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు కూడా లక్షరూపాయలు పీష్వాకి కానుక ఇచ్చి శ్రీమంత్ బిరుదు సంపాదించాడు. ఉత్తరాది సంస్థానాధీశ్వరులలో గ్వాలియర్ వారు కూడా శ్రీమంత్ బిరుదాంకితులే.

**39.** మధ్యప్రదేశ్‌లోని గ్వాలియర్ సంస్థానాధీశుల కులక్రమాగత బిరుదు సింధియా. మన నూజివీటివారికి అప్పారావు, బొబ్బిలివారికి రంగారావు లాగా. కాశీలో ఎక్కువ కాలం సాగిన సత్రాలు (పైడా వెంకన్నది కాకుండా) ప్రధానంగా మూడే. విజయనగరంవారిది, సింధియా వారిది, ఇండోర్‌రాణి అహల్యాబాయి హోల్కార్‌గారిది. విజయనగరం, సింధియా వారి సత్రాలలో విద్యార్థులకు, హోల్కార్ సత్రంలో యాత్రికులకు ప్రాధాన్యత.

లేదో నాకు అప్పటికి తెలియదు. కాని, ఆలోచిస్తే, వాళ్లకు కూడా ఆక్షేపణ వుండదనే తోస్తుంది. వితంతువులకు మాత్రము పెట్టరని యెఱుగుదును. ఇంకొకటి లింగధారి బ్రాహ్మణులకు బొత్తిగా సత్రాల్లో అన్నం పెట్టరు. కారణం, ఉర్లాం జమీందారు బసవరాజుగారు[40] కాశీ వెళ్లినపుడేదో పండితులను సమ్మానించడంలో అనుచితం జరిగిందనిన్నీ, దానిమీద పండితులు ఆ జమీందారుగారి సమ్మానమును నిషేధించి, వారితోనే కాదు, ఆ జాతివారితో భోజన ప్రతిభోజనాలు వర్జితం చేసి, సత్రాల్లో తగిన కట్టుదిట్టం చేశారనిన్నీ మా గురువుగారి వల్లనే మన దేశంలోనే విన్నాను. అందుకు తథ్యంగా, నాతో వచ్చిన కృష్ణశాస్త్రిగారి యింటిపేరు కందుకూరు అనే కారణం వల్ల కొంతచిక్కుకూడా వచ్చింది. కాని అది తుట్టతుదకు బ్రహ్మిష్ఠోబ్రహ్మం మీద అనేక పెద్దలసాక్ష్యంమీద వారించుకోడం తటస్థించింది, ఈ చిక్కు తెచ్చిపెట్టినవారు శ్రీ దండిభొట్ల విశ్వనాథశాస్త్రులుగారు[41]. వీరు మన దేశమువారే అయినను, కాశీలో చదివి మహావిద్వాంసులై అక్కడి పండితులతోపాటు పేరు ప్రతిష్ఠలు కలిగి, అక్కడనే సకుటుంబంగా నివసించేవారు.ఆయన పైకి పిచ్చివారుగా కనపడేవారుగాని, పూర్తిగా పిచ్చివారు మాత్రం కాదు. ఒక రోజున క్రొత్తవిద్యార్థులను విచారించేటప్పుడు కృష్ణశాస్త్రిగారింటి పేరు కందుకూరి వారు అని తెలిసేటప్పటికి–

---

**40.** శ్రీకాకుళం జిల్లాలోని ఉర్లాం సంస్థానం వేదవిద్యకు ఎనలేని ప్రోత్సాహం ఇచ్చింది. ఉర్లాం పండితుడంటే పెద్దపేరు. ఈ సంస్థానం పాలకులలో ప్రసిద్ధుడు కందుకూరి బసవరాజు (మరణం 1878). ప్రసిద్ధ క్షేత్రాలకు ధనికులు వెళ్లినప్పుడు ఒక సభ చేసి అక్కడి పండితులను సత్కరించడం ఒక ఆచారం. బసవరాజు కాశీకి వెళ్లినపుడు ఏర్పాటు చేసిన సభలో శాస్త్రవిషయంలో అక్కడి పండితులకు, బసవరాజు వెంట వెళ్లిన మన పండితులకు తేడా వచ్చింది. ఆంధ్రపండితులదే వివాదంలో పైచేయి అయ్యింది. ఉర్లాం సంస్థానంలో ఎవరన్నా పండితుడు సంస్థానపండితుల పరీక్షకు ఆగకపోయినా, కొద్దిలోటు కనబడినా యివ్వవలసిన బహుమానంలో కొంత తగ్గించి, మరుసటి సంవత్సరం ఆ లోటు సవరించుకొన్న తరువాత పోయిన ఏడాది బకాయితో పాటు పూర్తి సన్మానం జరపడం ఒక నియమంగా ఉండేది. ఆ అలవాటు చొప్పున స్వతహాగానే శాస్త్రజ్ఞానం కలిగిన కందుకూరి బసవరాజు కాశీపండితులకు తాంబూలంలో ఉంచ వలసిన దక్షిణ కొంతమొత్తం తగ్గించారు. దీనిని అవమానంగా భావించిన కాశీపండితులు ఆ సన్మానాన్ని, అసలు ఆంధ్ర లింగధారి బ్రాహ్మణులతో పొత్తును నిషేధించారు. ఈ కలహప్రకరణంలోని కాశీ పండితులతో కాశీలో స్థిరపడిన తెలుగుపండితులు కూడా ఉండి, ఈ వెలికట్టును సమర్థించడం ఒక విశేషం.

**41.** దండిభట్ల విశ్వనాథశాస్త్రులవారు వ్యాకరణ మహావీరులని ప్రతీతి. బాల్యంలోనే కాశీవెళ్లి సాంగోపాంగంగా వ్యాకరణాధ్యయనం చేసారు. యుక్తవయస్సులో తిరిగి వచ్చి తూర్పుగోదావరి జిల్లా నేదునూరు గ్రామంలో వివాహం చేసుకొని భార్యాసహితంగా

కందుకూరివారు వెల్నాటి బ్రాహ్మణులని ఆయన యెఱిగి యుండవలసినదే అయిననూ – "వీడు పాషండుడురోయి"[42] అని మొదలు పెట్టినారు. తరువాత యెట్లో ఆయనను నమ్మించి ఆ చిక్కు వదల్చుకొన్నాము.

## కాశీని తిట్టడానికి తగిన కాలం

నేను కాశీవెళ్లి యిప్పటికి సుమారు 44 సంవత్సరములు[43] దాటవచ్చింది. ఇటీవల కాశీలో అయీ అన్నసత్రములలో కొన్ని కూడ లేవనియు, విద్యార్థులకు ఏవిధమైన ఆనుకూల్యము లేదనిన్నీ విని ఎంతో విచారము పొందితిని. బహుశః ఆయా సత్రములన్నియు ఆయా పుణ్యపురుషులచేత యేర్పరచబడడానికి కారణము, కాశీఖండంలో వ్యాసులవారు కాశీలో ఒకనాడు భిక్ష దొరకక కాశీని పట్టుకొని తిట్టిన ఘట్టమే అని నేననుకొంటాను. ఇప్పుడు మళ్లా ఆ వ్యాసులవారివంటి వారెవరేనా కాశీని తిట్టవలసి వచ్చేయెడల, తగినకాలం వచ్చినట్లు తోస్తుంది. కాని ఆ వ్యాసులవారి వంటివారేరీ? ఆ కాలంలో వున్నంతమంది మహా పండితులు కూడా యిప్పుడు కాశీలో వున్నట్లు వినము. అబ్బో! అప్పుడు గంగాధరశాస్త్రులుగారు, శివకుమార పండిట్జీవారు, కర్ణాట సీతారామశాస్త్రులుగారు, దామోదరశాస్త్రులు

---

కాశీ వెళ్లిపోయారు. సంతానం లేదు. భార్యాభర్తలిద్దరూ అత్యంత నిరీహతో జీవయాత్ర చేసారు. విజయనగరం మహారాజు ఆనందగజపతిని పేరుపెట్టి పిలిచే స్నేహం ఉండేది. శాస్త్రిగారు సుమారు 60 ఏళ్ల వయసులో హఠాత్తుగా అదృశ్యమైపోయారు. సన్యసించి హిమాలయాలకు వెళ్లారని, హఠయోగం ద్వారా దేహత్యాగం చేశారని, జర్మనీవారి ప్రార్థన మేరకు సబ్‌మెరీన్‌లో రహస్యంగా జర్మనీ వెళ్లి వేదమర్మాలు తెలియజేశారని రకరకాల కథలు ప్రచారంలో వున్నాయి. ఇంతకుమించి వారిగురించి వివరాలు తెలియదు. మరికొంత సమాచారానికి దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి స్వీయ చరిత్ర 119 – 125 పుటలు చూడండి. (రచయితల సహకార సంఘము గుంటూరు వారి ప్రచురణ – 1976)

**42.** వెలనాటిబ్రాహ్మణులలోనూ, లింగాన్ని ప్రత్యేకంగా సూత్రం ద్వారా లేదా యజ్ఞోపవీతం ద్వారా ధరించే లింగధారి బ్రాహ్మణులలోనూ 'కందుకూరి' ఇంటిపేరున్న వారున్నారు. లింగధారి బ్రాహ్మణుడైన ఉర్లాం జమీందారు కందుకూరి బసవరాజు గారితో వచ్చిన వివాదాన్ని బట్టి కందుకూరి కృష్ణమూర్తిని గూడా లింగధారి బ్రాహ్మణుల ఖాతాలో జమవేసి వేదప్రామాణ్యాన్ని అంగీకరించనివాడు (పాషండుడు–వైదికుల దృష్టిలో పెద్దతిట్టు) అని దండిభొట్లవారు ప్రచారం మొదలెట్టారు.

**43.** వేంకటశాస్త్రికి 1890 డిసెంబర్‌లో వివాహం జరిగింది. ఆ తరువాత కొద్ది రోజులకే అంటే 1891 జనవరి, ఫిబ్రవరి ప్రాంతాలలో కాశీప్రయాణం మొదలు పెట్టారు. ఇప్పటికి 44 సంవత్సరాలు అంటే క్రీ.శ. 1935.




*దర్భంగా ఘాట్ (2012) ఈ భవనాన్నే ద్రావిడ సుబ్రహ్మణ్యశాస్త్రులుగారికి నివాసంగా ఇచ్చినది*

గారు, యింకా యెందఱో వున్నారు. ద్రావిడ సుబ్రహ్మణ్యశాస్త్రులుగారికి శ్రీ దర్భాంగ మహారాజా లక్షల కొలది పెట్టి కట్టించిన దశాశ్వమేధఘట్టంలోని మహాసౌధమును నివాసముగా ఇచ్చి, నెలకు నూఱు రూపాయిలు జీవనార్థం పంపిస్తూ, అప్పుడప్పుడు వచ్చి తామే దర్శనం చేస్తూ సమ్మానించే కాలమది[44]. ఈకాలమునకు ఆకాలమున కును గల భేదమును చదువరులు గుర్తింతురు గాక.

**44.** దర్భాంగ బీహార్ రాష్ట్రంలో అదేపేరుతో ఉన్న జిల్లాకు ముఖ్యపట్టణం. ప్రాచీన మిథిలారాజ్యంలో ఒకభాగం. వంగదేశానికి ముఖద్వారం అనే అర్థంలో 'ద్వారవంగ' అనే పేరు హిందీఉచ్చారణలో 'దర్భాంగ'గా మారింది. దర్భాంగ గొప్ప బ్రాహ్మణ జమీందారీ సంస్థానం. వీరు బ్రిటిష్ వారికి చాలా నమ్మకంగా వ్యవహరిస్తూ అదే సమయంలో నేషనల్ కాంగ్రెస్‌కు ఆర్థిక సహాయం చేస్తూ వచ్చారు. ఆంధ్రప్రదేశ్‌లో ఉర్లాంలాగా వైదిక విద్యలకు గొప్ప ప్రోత్సాహమిచ్చారు. మహారాజా లక్ష్మీశ్వరసింగ్

## సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు

సుబ్రహ్మణ్యశాస్త్రులవారు వేదాంతశాస్త్రములో బంగాళాదేశ పండితులనెల్ల జయించినవారు, దక్షిణ దేశీయులు. వీరు మా గురువుగారు బ్రహ్మయ్య శాస్త్రులవారికి వేదాంతశాస్త్రగురువులు. అడివి శంకరరావుగారు నన్ను గూర్చి వ్రాసిన చరిత్రలో, నేను కాశీలో వీరి వద్ద వ్యాకరణం చదివినట్లు వ్రాసినది పొరపాటు. వీరు నాకు గురుగురువులు. వీరు వ్యాకరణ పండితులు కారు, వేదాంత పండితులు. నేను కాశీలో నున్న రోజులలో ఈ శాస్త్రులవారి కొమార్తకు వివాహం జరిగినది. అప్పుడు శుభలేఖలో నున్న శ్లోకము మాత్రము నేను రచించినది. ఆ శ్లోక ముదాహరించినచో నేను కాశీలో విద్యార్థిగానున్న కాలము స్పష్టమగును గాన, దాని నిట లిఖించుచున్నాను.



*సుబ్రహ్మణ్యశాస్త్రిని గౌరవించిన దర్భాంగ సంస్థానాధిపతి మహారాజా లక్ష్మీశ్వర సింగ్ (1886లో)*

---

(1858–98) చాలా చిన్నవయస్సులో మరణించారు. గొప్పదాత. ప్రజాసౌకర్యాలపట్ల శ్రద్ధ వహించారు. ఇంగ్లిష్ చదువుల వలన సంఘసంస్కరణ భావజాలం ఏర్పడింది. అయినా సంప్రదాయవిద్యలపట్ల ఆదరణ కోల్పోలేదు. కాశీలో రామమందిరాన్ని, కాశీయాత్రా సమయంలో నివాసం కొరకు ఒక రాజభవనాన్ని కట్టించారు. అదే దర్భంగా ఘాట్‌లోని దర్భంగాభవన్. ఒకసారి కాశీ వచ్చినప్పుడు తాము ఏర్పాటు చేసిన శాస్త్ర సభలో ద్రావిడ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అపారవైదుష్యాన్ని గమనించి, లక్ష్మీశ్వరసింగ్ గంగ ఒడ్డున కట్టించిన భవనాన్ని వారికి విడిదిగా, విద్యాలయంగా ఇచ్చేశారు. మహల్‌ని ప్రస్తుతం హోటల్‌గా మారుస్తున్నారు. అక్కడి నిర్వాహకులను సుబ్రహ్మణ్యశాస్త్రిగారి పటం ఉంటుందేమోనని "ఏమైనా చిత్రపటాలున్నాయా?" అని వాకబు చేయగా చాలా ఉన్నాయని, ప్రస్తుతం వాటిని వేరేచోట భద్రపరిచామనీ, హోటల్‌గా మార్చిన తరువాత మళ్లా ఇక్కడికి చేరుస్తారని చెప్పారు.

శ్లో॥ మున్యబ్ద్యంకేందువర్షే గుణగణమహితే రాధమాసే వళక్షే
పక్షేఽ నంగస్య తిథ్యా మసురగురుదినే మత్సుతాయా వివాహః
ప్రాతర్భావీ బుధేంద్రామహఇహభవతాం యాచతే సన్నిధానం
శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రీ ద్రవిడకులభవ స్స్వాహితాగ్ని ర్వినీతః

శాస్త్రజ్ఞులలో నెక్కడో కాని కర్మఠులుండరు. వీరు అహితాగ్నులు[45]. ఇంతకూ వీరికి నేను ప్రశిష్యుడ నగుదునుగాని, శిష్యుడను గానునది ప్రకృతాంశము.

## కూనిరాగపు గాలిసంగీతం[46]

అడవి శంకరరావుగారు, నేను ప్రత్యేకించి విజయనగరము సంగీతము నభ్యసించుటకు వెల్లినట్లు వ్రాసియున్నారు. అదికూడా పొరపాటే. చాలవఅకు దేశాటనం చేసి అవధానాదులొనర్చిన తరువాత, శ్రీ విజయనగరం మహారాజా వారి సందర్శనానికి వెళ్లినప్పట్లో, శ్రీవారి దర్శనమునకు కొన్ని విఘ్నములు[47] రావడంచేత, సుమారు రెండుమాసములకంటె యెక్కువరోజులు విజయనగరంలో వుండవలసి వచ్చింది. అప్పుడు వృథాగా కూర్చోవడ మెందుకని సాలగ్రామ గోపాలంగారి వద్ద ఫిడేలు మీద సరళిస్వరాలు మట్టుకు కృషిచేశాను. ఇంతకున్నూ

**45.** అగ్నిచయనం అనే యజ్ఞం చేసిన తరువాత ఇంటిలో నిత్యం అగ్నిహోత్రానికి హవిస్సులు అర్పిస్తూ ఉండాలి. అగ్ని ఆరిపోకూడదు. ఇలా నిరంతరం అగ్నిహోత్రాన్ని ఆరాధిస్తూ ఉండేవారు అహితాగ్నులు. అగ్నిచయనం చేయకపోయినాకూడా వేదాధ్యయన సంపన్నులు కొంతమంది అహితాగ్నులుగా ఉండేవారు. ఈ సంప్రదాయం ఆచరించేవారు ఇల్లు కదలరు.

**46.** కూనరాగం అసలుమాట. నూటొక్క గ్రామదేవతల ఏకైక తమ్ముడు పోతురాజు భార్య కూనలమ్మ. ఈవిడ గురించిన పాటలు జాతరలో పాడాలి. అవే కూనరాగాలు. ఈ పాటలు మగవాళ్లే పాడాలట. అందుకే కుడుములు వండని ఆడది, కూనిరాగాలు తియ్యని మగవారు ఉండరు అని సామెత. సంతానం కోరేవారు పోతురాజుకు, కూనలమ్మకు జాతర చేసి ఆవిడకు పెట్టిన చీరను భార్య కట్టుకోవాలి. ఇప్పుడు జాతర్లలో పోతురాజు ప్రసక్తి వినబడుతుంది కాని కూనలమ్మని మరిచిపోయినట్లే. పోతురాజుకి అక్కలు పెళ్లి చేయకపోవడం వలన అవివాహితుడిగానే ఉన్నట్లు ఒక వాడుక.

**47.** విజయనగరం రాజు ఆనందగజపతి చుట్టూ ఉండే పండిత, సంగీత విద్వాంసుల కోటరీ సుఖసుఖలా ఇంకొకడిని సంస్థానాలలోకి అడుగుబెట్టనిచ్చేవారు కారు. లోకమంతా ఉగ్రూతలూగించి వచ్చిన తరువాత గాని ఆదిభట్ల నారాయణదాసు అంతటి వారికి కోటలో ప్రవేశం కలగలేదు. ఈ పండిత మాత్సర్యాన్ని అవహేళన చేస్తూ ఆదిభట్ల వారు దంభపుర ప్రహసనం రాశారు.

చదువరులు తెలిసికోదగ్గది నేను సంగీతము నేర్చుకొన్నవాడను కాననే విషయము. కొంచెము పద్యము రాగధోరణిమీద చదివిననూ, అంతమాత్రంచేత నేను సంగీతపాటకుడను గాను. ఆ చదవడమేనా, నేను పదకొండు పండ్రెండు సంవత్సరముల వయస్సులో నున్నప్పుడు, తోలుబొమ్మలాటలో పాల శంకరుని మేళంలో[48] ఒకానొకడు పాడే మోస్తరును అనుకరించి నేర్చుకొన్న పాటగాని నాది స్వరాదులకు సంబంధించినది కాదు. నేను తఱచుగా రేగుప్తి, లేక మోహన, ఈ రాగాలమీద పద్యములను చదువుతానని పలువురు శ్రోతలనగా వినియున్నాను, కాని నా చదివేచదువు రేగుప్తిన్నీ కాదు, మోహన రాగమున్నూ కాదు, ఇంకేమిటంటే, ఈ రెండు రాగములేకాక, శ్రీ, సారంగ, మధ్యమావతి, నాటకురంజి, కాంభోజి. ఇంకా ఆయా రాగములతో అంతో యింతో చుట్టరికం గల రాగములన్నీ నా చదువులో చేరుతాయి. అందుచేత 'అనమ్మరాగేణ గీయతే' అన్నట్టుంటుంది. సంగీతపాటకులు కూడా నా చదువును అభిమానించడం కలదుకాని, నా రాగ ధోరణి శాస్త్రీయమని మాత్రం వారు వొప్పుకోరు. నాకు స్వతస్సిద్ధమైన లయజ్ఞానము కలదు. అదిన్నీ పండితులొప్పదగిన విశేషములతో సంబంధించింది కాదు. గురు శుశ్రూష చేసి చెప్పికొంటే నేనొక పాటకుడ నగుదునని గాయకులు నన్ను అభిమానించే వారనడం కలదుగాని నాకు అట్టి నమ్మకం లేదు. నా బుద్ధిబలము నాకు తెలుసును. వినేటప్పటికెంత వస్తుందో అంతేకాని, యత్నంమీద రాదగ్గది నా కేదిన్నీ రాదు. ఇది అనుభవంమీద వ్రాసినమాట. నేను ఇంగ్లీషులో ప్రవేశించలేదుగాని, అందు లెక్కలలో నాకు సైఫరు తప్పదు. విజయనగరం మహారాజావారి దర్శనానికి వెళ్లివచ్చిన పిమ్మట, అనగా ఇరువదియైదు వత్సరముల ప్రాయములో (1895), ఇంకా నాకు సంసారభారం తలమీద పడనప్పుడు, మైసూరు వెళ్లి సంగీత మభ్యసిద్దామని బుద్ధిపుట్టి ప్రయాణసన్నాహం చేసాను. కాని తిరుపతి శాస్త్రి కొంచెం వెనుదీయడంచేత అది సాగిందికాదు. అంతో యింతో మా తండ్రిగారు గాలిపాట పాడేవారు. యానాములో వుండే కాలంలో, దేవుడు గుళ్లోసేవ లయేటప్పుడు, మా తండ్రిగారితో గుళ్లోకి వెళ్లి, అక్కడ పాడే సేవమోళాపాటలు వినడం వకటిన్నీ, తోలుబొమ్మలు దీక్షగా చిన్నప్పుడు చూడడం వకటిన్నీ, నా

---

**48.** పశ్చిమగోదావరి జిల్లా గూటాల జమీందారులు వైశ్యులు. వీరు యానాంలో నివాసముండేవారు. వీరిలో మన్యం మహాలక్ష్మమ్మ (1856–1925) కవి పండితులను ఆదరించడంలో ప్రసిద్ధి. వైదికవిద్యలను, శాస్త్రీయ, జానపద కళలను ఆదరించారు. ఏ జమీందారు పోషించని విధంగా ఆమె తోలుబొమ్మలాట ఆడే కళాకారుల కుటుంబాల్ని పోషించింది. అదే పాల శంకరుని మేళం.

బాల్యంలో తఱచుగా యానాములో శ్రీ మన్యం మహాలక్ష్మమ్మ జమిందారు[49]గారి మేడయెదుట జరిగే వీధి నాటకాలు, రామనాటకం, ప్రహ్లాద నాటకం, తదేకదృష్టితో చూడడం వకటిన్నీ, నేను శ్రీ కానుకుర్తి భుజంగరావుపంతులువారి[50]వద్ద రఘువంశం చదువుకొనేటప్పుడు శ్రీ తోట్లవల్లూరి సంస్థానము నుండి వచ్చిన వక వైష్ణవుడు నృసింహాచార్యులు[51] అనే గాలి సంగీతపాటకుడు నాకు సహాధ్యాయిగా తటస్థించుట వకటిన్నీ, నే నంతోయింతో కూనిరాగం తీయగల్గుటకు హేతువులు. అంతేకాని నేను సంగీత శాస్త్రజ్ఞుడను కాను అన్నది యిట సారాంశము.

## వేషధారణ ప్రయత్నం

ఆ వైష్ణవుని సహవాసమువల్లనే నాకు ఈ కూనిరాగపు సంగీతంతోపాటు ముక్కు పొడుము పీల్చుట కూడా అభ్యాసం అయినది. ఇంకా వ్రాస్తే ఆ వయస్సులో

---

**49.** ఆంధ్రప్రదేశ్‌లోని వైశ్యసంస్థానాలలో పెద్దది పశ్చిమగోదావరి జిల్లాలోని గూటాల. ఈ సంస్థాన సంపాదకులు మన్యం సత్యలింగం. స్థిరనివాసం మాత్రం ఫ్రెంచివారి ఏలుబడిలోని యానాంలో. ఫ్రెంచివారితో స్నేహం ఎక్కువ. వారికి అప్పులిచ్చే స్థాయిలో గూటాల సంస్థానం ఉండేది. కాలక్రమంలో సత్యలింగం తమ్ముడు వెంకటరత్నం మనుమడు చిన్నకనకయ్య జమీందారు అయ్యారు. ఆయన భార్య మహాలక్ష్మమ్మ. భర్త మరణంతో 1873 నుండి సంస్థానపాలన చేపట్టారు. ఈ సద్గుణశీలిచే సన్మానింపబడని పండితుడు కానీ, కళాకారుడు కానీ లేరంటే అతిశయోక్తి కాదు. వేంకటశాస్త్రి ఈ దానశీలిపై చెప్పిన పద్యము.

గోచీ పెట్టిన దాది నిన్నెఱుగుదున్, గోమట్లనే కాదు నీ
యాచారమ్మును దాతృతాగరిమ సత్యాసక్తి నిర్గర్వతా
ప్రాచుర్యమ్మును దీనపోషణము నెప్పట్లన్ గనంబోలదే
లా చెప్పన్‌వలె నిన్ను జెప్పియు మహాలక్ష్మ్యంబ వేఱొక్కరిన్ !

(నానారాజ సందర్శనం)

**50.** కానుకుర్తి భుజంగరావుపంతులు యానాంకు రెండుమైళ్ల దూరంలోని కాపుల పాలెం గ్రామవాసి. తెలుగు సంస్కృతాలలో పండితులు. సమర్థులయ్యి కూడా గ్రంథరచన, అవధానం వంటివి చేపట్టలేదు. కారణం పదిమంది శిష్యులకు తిండిపెట్టి చదువు చెప్పగల ధనికులు కావడం.

**51.** కృష్ణాజిల్లా వుయ్యూరు సమీపంలోని వల్లూరు ఒక జమీందారీ ముఖ్యగ్రామం. తోటలు విశేషంగా ఉండే ప్రాంతం కాబట్టి తోటల వల్లూరు – తోట్లవల్లూరు అయ్యింది. 1803లో సంస్థానసంపాదకుడు బొమ్మదేవర నాగన్న. జమీందారు లందరూ తాలీమ్‌ఖానాలను స్థాపించి యువకులకు వ్యాయామశిక్షణ యిప్పించేవారు. నృసింహాచార్యుల ఇంటిపేరు పురాణంవారు. ఈయన సహవాసం వలన వేంశా కొంతకాలం శివద్వేషి కూడా అయ్యారు.

వ్రాయవలసినవి చాలా కలవు. వకటి రెండు టూకీగా వ్రాసి మళ్లా కాశీలోకి వస్తాను. ఆ ఆచార్యులు మంచి సౌందర్యవంతుడు. స్త్రీ వేషమునకు బాగా వుంటాడు. అందుచేత ఆయన చిత్రాంగి, నేను సారంగధరుడను, నీలపల్లె స్కూలులో నేను బడిచదువు చదువుకొనేటప్పుడు నా క్లాసులోనే చదివిన యొక వేశ్యబాలిక రత్నాంగి, ఈ రీతిగా పాత్రలు ఏర్పాటుచేసి యొక చాత్తానివైష్ణవుడు నాటకం అంతా తయారు చేశాడు. అప్పటికి నేనింకా రఘువంశం మొదలుపెట్టలేదు. ఆ కాలంలో వీధినాటకాలకే లోకంలో యెక్కువ ప్రచారం వున్నది. కంపెనీలింకా రాలేదు. నీలపల్లె సీతారామస్వామివారి గుడియెదుట మా నాటకం మొట్టమొదట ప్రదర్శనం జరగడానికి సర్వసంసిద్ధం అయింది కాని, మా తండ్రిగారి భయంచేత తుదకు నేను అంతా వర్లించిన్నీ వెనుదీయడంచేత యావత్తు ఆగిపోయింది. ఏవి యెట్లయినా, ఆయీ సందర్భాలు నన్ను అంతో యింతో కూనిరాగం తీసేవాణ్ణిగా చేయగలిగాయని నేననుకొంటాను. కంపెనీ నాటకాలు వచ్చిన తరువాత, వీరేశలింగంగారి శాకుంతలం ప్రదర్శించడానికి యానాంలో కొందరు ప్రముఖులు చాలా ప్రయత్నించి దీనిలో వేంకటాచలం కూడా వుంటే బాగుంటుందని అనుకొని నాకు కబురు చేశారు. అప్పటికి నేను సామర్లకోటలో మాధుకరం యెత్తుకుంటూ లఘుకౌముదిన్నీ భారవిన్నీ[52] చదువుచున్నాను. అప్పటికి నాపేరు వేంకటాచలమే. ఇంకా నేను బ్రహ్మయ్యశాస్త్రులవారి సన్నిధికి చేరలేదు. చేరిన పిమ్మటనే నాకు శ్రీ శాస్త్రులవారు వేంకటశాస్త్రి అని శాస్త్రి బిరుదమును దయచేశారు. వారుమాత్రం అప్పుడప్పుడు వేంకటాచలం అని కూడా పిల్చుచుండుట కలదు. కాని యేమైనా వారి నామకరణం చేసింది మొదలు వేంకటాచలం పేరు వెనుకబడి శాస్త్రి పేరే వాడుకలోకి వచ్చింది. ఆ శాకుంతల నాటకంలో నేను కణ్వుడను. యావత్తున్నూ సిద్ధమయినది, పెద్దపాక వేశారు. ఆ యానాము ఫ్రెంచి గ్రామమగుటచే రిపబ్లికు ఆచారమును బట్టి మాలమాదిగలకు కూడ పబ్లికు సందర్భములలో అవకాశమియ్యక తీరదు. అట్లిచ్చుటకు ఆ కాలములో ప్రజలప్పుకోరుగదా. ఆ కారణముచే అందులోకూడా నేను వేషం వేసి నటించే దుర్యోగమో సుయోగమో నాకు తప్పిపోయింది. కానీ యివి అన్నీ యేదో కొంచెం సంగీతాన్ని, తెలుగులో కొంత భాషాజ్ఞానాన్ని కలిగించాయని మాత్రం చదువరులు తెలియగోరుతారు. నాకు తెలుగునకు ఇంతకన్న గురుశుశ్రూష లేశమున్నూ లేదు. నేను గురుశుశ్రూష చేసి అభ్యసించినది సంస్కృతము మాత్రమే. అందులో వ్యాకరణం మాత్రమే

**52.** భారవి రచించిన కిరాతార్జునీయం. సంస్కృత పంచకావ్యాలలో కాళిదాసు రచించినవి కాక మిగతా రెండింటిని కవిపేరుతో భారవి అని, మాఘం (శిశుపాలవధ) అని పిలుస్తారు.

కొంత కష్టపడి శ్రద్ధచేసి చదివితిని. ఆ చదువుటయైనా శ్రీ చర్ల బ్రహ్మయ్య శాస్త్రులవారి యొద్దనే, దేశంలోనే. కాశీలో వూరకే మొదలుపెట్టి యే కొంచెమో చదివినా, అది లెక్కలోది కాదు. మళ్లా దేశానికి వచ్చి దేశంలో మొదటి గురువుగారి వద్దనే తక్కిన గ్రంథాలు తిరుపతిశాస్త్రిని సహాధ్యాయిగా చేసికొని చదువుకొన్నాను.

## బ్రాహ్మణార్థపు ధనసంపాదన

కాశీనుంచి దేశానికి వచ్చే సందర్భం యిక వ్రాస్తాను. మా తల్లిదండ్రులకు నా కాశీగమన వృత్తాంతం తెలిసింది. వారు మా గురువు గారి వద్దకు వెళ్లి యెట్లో రప్పించకపోతే తాము కూడా కాశీకి వెడతామని గట్టిగా పట్టుపట్టారు. దానిమీద గురువుగారు నాపేర వుత్తరం వ్రాశారు. వినయంగా తమ సెలవు ప్రకారం బయలుదేరి వస్తున్నానని జవాబు వ్రాశాను. కాని కాశీనుండి బయలుదేరడముకు కాళ్లు రావు. రేపూ, ఎల్లుండీ, ఇట్లా అనుకుంటూ కాలం జరుపుతూ, అక్కడి వుత్సవాలు బుడ్వామంగళ్ లోనైనవి చూస్తూ కాలయాపన చేస్తూ వున్నాను. బుడ్వామంగళ్ అనగా పడవల మీదనే మేళతాళాలతో జనులు



*ఒక బ్రిటిష్ చిత్రకారుడు **1895**లో చిత్రించిన బుడ్వామంగళ్ ఉత్సవం*

వక వారంరోజులు వుండి గంగలో జరిపే వక వుత్సవం. అది యేటా వేసవిలో జరుగుతుంది. బహురమ్యంగా వుంటుంది. ఆయీ సంతోషములతో కాలం జరుపుతూ వుండగా మావాళ్లు త్రోవఖర్చులకు ముప్పది రూపాయలు పంపినారు. ఇంకా కొంత కాశిలో దొరకిన బాపతు నావద్ద నిల్వయున్నది. కాశీలో మహామహావాళ్లకే దిక్కులేదుగదా? అట్టిస్థితిలో విద్యార్థిగా వెళ్లిన నీకు ధన సంపాదన మెట్లు జరిగిందని శంక కలుగవచ్చును. నిజమే, కాశీలో సత్రాలలో భోజనం దొరకుటే లేనిచో, ముష్టి యెత్తుకుంటే ముష్టి కూడా దొరకదు. మాధుకర మంతకుముందే లేదు. పండితులకు యాత్రార్థమై వచ్చిన గృహస్థులు సభలు చేసి యేమైనా సమ్మానించడం కలదు. కానీ అదిన్నీ చాలా అరుదే, యెట్లో యాత్ర చేసికొని స్వదేశానికి వెళ్లేవారేకాని పండితులకు సభలు చేసి సమ్మానం చేయదగు గృహస్థులు యెందఱో వుండరుగదా? ఈ సభలు పెద్ద పండితులకు, బాగా పేరు మోగినవారికేగాని ఒక మోస్తరుగా వుండే పండితులకే తటస్థింపవు. అట్టి స్థితిలో విద్యార్థులకెక్కడ తటస్థించుతవి? ఇక విద్యార్థులకు తీర్థవిధి బ్రాహ్మణార్థాలు తప్ప అంతో యింతో ధనార్జన కాదగ్గ వుపాయం లేదు. నాకు ఆ బ్రాహ్మణార్థాలు ఇతర విద్యార్థులకంటె కొంచము ఎక్కువగా తగిలేవి. కారణమేమంటే, నేనక్కడ వున్న రోజుల్లోనే గోదావరి డిస్ట్రిక్టు రామచంద్రపురం తాలూకా దంగేరు గ్రామ కాపురస్థులు వేదశాస్త్ర పండితులు వుప్పులూరి భీమన్నశాస్త్రులుగారి కుమాళ్లల్లో వకరు శంభుసోమయాజులుగారు కాశీలో వున్నారు. ఆయనకు అప్పటికి ఘనాంతం స్వాధ్యాయం[53] అయింది. పైగా ఆబ్దికమంత్రం వగయిరా చిల్లరలుకూడా వచ్చును. ఆయన తీర్థవిధికి భోక్తగా కుదిరితే పితృదేవతలు మఱీత్వరలో తరిస్తారని ప్రతివారున్నూ వచ్చి ఆయనను ప్రార్థించేవారు. ఆయనకున్నూ, నాకున్నూ మైత్రి యెక్కువ. కాబట్టి నేను రెండోబ్రాహ్మణుడను కావడం తటస్థించేది. భంగుఖర్చూ, యజ్ఞోపవీతపుఖర్చూ కాక అర్ధా, పావులా దక్షిణ కూడా దొరకేది. ఈ బాపతు ఖర్చు కాగా మిగిలింది కొంత నావద్ద నిల్వయున్నది. మావాళ్లు పంపినదీ, ఇదీ కలిపి నలభై రూపాయలు తేలినవి.

**53.** వేదాన్ని గురుముఖతాః నేర్చుకొనడానికి పద, క్రమ, జటా, ఘనా పద్ధతులున్నాయి. ఇది ఒకదానికంటే ఒకటి క్లిష్టమైనవి. A, B, C అనేవి వేదమంత్రంలోని పదాలు అనుకొందాము. AB, BA, ABC, CBA, ABC; BC, CB..... ఈ పద్ధతిలో వేదమంత్రాలను కంఠస్థం చేయడం ఘనాపద్ధతి. ఈ పద్ధతిలో నేర్చుకొన్నవాడు ఘనాపాఠి. ఇంత క్లిష్టమైన విధానంలో నేర్చుకోవడం వలన ఘనాపాఠి అంటే ఉద్దండ పండితుడు అనే అర్థం వాడుకలోనికి వచ్చింది.

## భంగుపానయోగం

ఈ సొమ్ములో కొంత గంగ పట్టడానికిన్నీ[54] కాశీకావిడికిన్నీ కాలార్థకం చేసుకోవడానికిన్నీ ఖర్చయినాయి. కాలార్థకమంటే, కాలభైరవప్రీతికి చేసే సంతర్పణ. ఆ సంతర్పణనాడు భంగుకూడా చేయక తప్పదు. భంగంటే – గంజాయిన్నీ, ఏలక్కాయల పైనుండే తొక్కలున్నూ, ఎండిన గులాబీపువ్వుల రేకులున్నూ, సోపున్నూ కలిపి నూరి ముద్దచేసి నీళ్లలో కలిపి తాగే మత్తుపదార్థము. కాశీదేశంలో ఈ భంగును ఈ రీతిగా సేవిస్తే లేశమున్నూ తప్పు లేదు. గంజాయి పొగరూపంగా పీలిస్తే చాలా తప్పు. ఒక్కొక్క దేశములో ఒక్కొక్క ఆచారము. మన దేశాన్నుంచి వెళ్లిన ప్రతివిద్యార్థిన్నీ దీనిని అభ్యాసం చేస్తాడు. ఎవడో నాబోటి పైత్యప్రకృతిగలవాడు అభ్యాసం చేయకపోతే వాడికికూడా బలవంతముగా ఎట్లో అంతో యింతో పోస్తారుగాని, వూరుకోరు. నేను కాలార్థకం చేసిన రోజున నాకు ఒక ఔన్సు రమారమీ ఈ భంగును బలవంతంగా తాగించినారు. దానిమీద నాకు మత్తు అపారంగా యెక్కినది. ప్రాణాపాయం కలుగుతుందేమో అన్నంతదాకా వచ్చి తుదకు కొన్ని విరుగుళ్లు ఇవ్వడంవల్ల కొన్ని గంటలకు తిక్క దిగింది కాని, ఈ విరుగుళ్ల వల్ల శీతలించి గ్రహణిలోనికి దింపింది. నాకు ఇది పడదని ఆయా విద్యార్థు లెఱుంగరేమో అంటే, పూర్తిగా యెఱుగుదురు. సుమారింతకు నెలరోజులనాడు కాశీలో వక 'యజ్ఞోపవీతం' జరిగింది. యజ్ఞోపవీతమంటే జందెము వున్న పంచద్రావిడులు[55] యావన్మందికిన్నీ కాశీలో నున్నవారికి నాకు ఒక రూపాయి

---

**54.** కాశీ వెళ్లినవారు గంగాజలం తీసుకువచ్చి చుట్టపక్కాలకు, ఇరుగుపొరుగులకు ఇవ్వడం ఆచారం. శక్తికలవారు సంతర్పణ చేసి తీర్థం లాగా గంగాజలం ఇస్తారు. ఇందుకోసం రాగిబిందెలలో గంగనీటిని పట్టి జాగ్రత్తగా సీలు చేయాలి. ఇది ఆ రోజులలో ఖరీదైనపని. అలా సీలు వేస్తే చాలా ఏళ్లపాటు నీళ్లు చెడిపోకుండా ఉండేవి. ఇప్పుడు కూడా కాశీయాత్ర చేసినవారు చిన్న చిన్న రాగిచెంబులతో గంగాజలం తెస్తున్నారు. గంగాజలాన్ని కాశీలో పట్టకూడదు. ఎందుకంటే కాశీ గంగలో యమునానది నీరుకూడా కలుస్తుంది. అందుకని పాతరోజుల్లో ప్రయాగ వెళ్లి త్రివేణీ సంగమం నుండి గంగానదిలో కొంతదూరం ఎగువకు పడవమీద వెళ్లి యమున కలవని గంగనీరు పట్టుకొచ్చేవారు. వేంశా కాశీవాసపురోజులనాటికి కాశీలోనే గంగాజలం పడుతున్నట్లు తెలుస్తున్నది. ఏనుగుల వీరాస్వామయ్య కాశీయాత్ర నాటికి యమున కలవని గంగనీటినే పట్టుకొచ్చారు.

**55.** యావద్భారతంలోని బ్రాహ్మణులను 10 తెగలుగా చెప్పారు. పంచద్రావిడులు, పంచగౌడలు. ఆంధ్ర, ద్రవిడ (తమిళులు, మలయాళీలు), కర్ణాట, మరాఠా, ఘూర్జరులు (గుజరాతీలు) పంచద్రావిళ్లు. సారస్వత (మధ్యప్రదేశ్), కాన్యకుబ్జ (ఉత్తరప్రదేశ్) గౌడ (బెంగాల్, అస్సాం), ఉత్కళ (ఒరిస్సా), మైథిలి (బీహార్) బ్రాహ్మణులు పంచ గౌడలు. మరలా వీరిలో శాఖలు, ఉపశాఖలు వందలాదిగా ఉన్నాయి.

దక్షిణతో పంచపక్వాన్నములతో సంతర్పణ చేయడము. దశవిధ బ్రాహ్మణులలో పంచద్రావిడులు, పంచగౌడలు అని రెండు తెగలు. ఇందులో పంచద్రావిడులలో ఘూర్జరులు తప్ప తక్కిన నాల్గు తెగలకు, అనగా, ఆంధ్ర ద్రవిడ కర్ణాట మరాటులకు, సర్వసామాన్యంగా పంక్తిభోజనం కలదు. గౌడలకో "ఎవరికివారే యమునాతీరే". అంతేకాని, పంక్తిభోజనాచారము వారిలో వారికే లేదు. పైగా వారు మత్స్యభుక్కులు కూడాను. అందులో వారీ యజ్ఞోపవీతంలో చేరరు. సత్రభోజనమేనా పై జెప్పిన తెగలవారికేగాని గౌడలకు లేదు[56]. స్వయంపాకము చేసికొంటూ చదువుకోవడమే గాని గౌడలు, వేఱొక సదుపాయం వారికెప్పుడున్నూ లేదు. ఆ యజ్ఞోపవీతంనాడు మా ఘట్టంలో విద్యార్థులు వారివారి తాహతు ననుసరించి సేరు సేరున్నరా రెండుసేర్లు ఈ రీతిని భంగు పట్టించి భోజనానికి బయలుదేరారు. పడదని యెంత చెప్పినా వినక ఏకొంచెమో నాకుకూడా పోశారు. మేము రెండోపాళీవేళకు వెళ్లితిమి గాని, జనమెక్కువగా వుండటంచేత కొందర్ని మూడోపాళీదాకా దిగద్రొక్కినారు.

ఆ కారణంచేత అధమం గంట గంటన్నర ఆలస్యమయింది. ఇంతలో నాకు నోరెండుకుపోవుట మొదలైన అవలక్షణాలు బయలుదేరాయి. "సభలో అంతా గొల్లలే", అన్నట్లు యెవరితో చెప్పికొన్నా లాభములేదు. అంతా భంగుమత్తు మీదున్నవారే. నా మొర వినేదెవరు? ప్రతిక్రియ చేసేదెవరు? వారు ఆ మత్తును ఆపుకోగలవారు, నేను ఆపుకోలేనివాడను. ఇంతే భేదము గాని, ప్రకృతిలోనున్నవారు ఆ జట్టులో నొక్కరున్నూ లేరు. పైగా నేనొకవేళ ప్రాణం పోతోందని మొరపెట్టు కొన్ననూ లాభము లేదు. చూచారు కాదూ, భారతంలో దేవయాని శుక్రాచార్యునితో కచుణ్ణి గూర్చి రాక్షసులు చంపేశారేమో అని యేడువసాగినప్పుడు, "సుగతికి జనుగాక యేల శోకింపగన్" అని జవాబు చెప్పినాడు! అది దేని మాహాత్మ్యం? మద్యపు మాహాత్మ్యమే కదా! మద్యపానము దుఃఖమును తెలియనీయదనే కారణం చేతనే వైష్ణవ మతస్థులలో వామాచారులు[57] బంధుమరణములలో తుట్టతుద రోజున

---

**56.** భారతీయ బ్రాహ్మణులందరు శాకాహారులు కారు. ఉత్తరభారతదేశ బ్రాహ్మణులలో మాంసాహారులు ప్రధానంగా మత్స్యభుక్కులు ఉన్నారు. దక్షిణభారతంలో కూడా లేక పోలేదు కానీ ఉత్తరభారతమంత విశేషంగాలేరు. శ్రీకాకుళం జిల్లాలోని మందసా సంస్థాన గ్రామం వెళ్లిన ఒక గోదావరి జిల్లాల బ్రాహ్మణపండితుడు అక్కడ ఓఢ్ర బ్రాహ్మణ వీధిలోకి చేపలమ్మేవారు అరుచుకుంటూ రావడం చూసి ఎంతో విచిత్రపడ్డాడు. వీరిలో గౌరవం విషయం వచ్చేటప్పటికి శాకాహారులకి ఉన్న గౌరవం మాంసాహారులకు లేదు. అందుకే కాశీసత్రాలలో శాకాహారులైన పంచద్రావిడులకే ప్రవేశం కానీ పంచగౌడలకు లేదు.

**57.** ఆచారము అంటే ఇష్టదేవతను ఉపాసించే పద్ధతి. కులార్ణవ తంత్రం ప్రకారం

'తొళ్లక్క'మనే పేరుతో పూర్తిగా త్రాగుతారు[58]. వైద్యశాస్త్రగ్రంథమగు రోలంబ రాజీయములో దుఃఖము పోవుట కౌషధమేమని ప్రశ్నించినప్పుడు సురాపానమని జవాబు చెప్పినాడు[59]. సురకన్నను భంగు ప్రమాదకరమైన వస్తువు కాని, ఆ దేశములో ఇది పరమ పవిత్రము. పితృకార్యాలలో కూడా భోక్తలకు ముందుగా వీనినిచ్చియే భోజనం పెడతారు. అది యటులుండె. ఆవేళకూడా చాలా శ్రమపడినానన్న సందర్భము వారెరిగిన్నీ నాకు మళ్లా ఈ వస్తువును పట్టించారన్న విషయము ప్రస్తుతము. ఒకటి మాత్రం వున్నది. నేను దాని మత్తును లేశము కూడా భరింపలేకపోయినా, ఆ మత్తు పూర్తిగా దిగిన తరువాత, అనగా భంగు పుచ్చుకొన్న ఇరవై నాలుగు గంటల పిమ్మట, ఏపురాణం చదవడానికో మొదలు పెడితే బాగా వుంటుందని, ఆ ఘట్టంలో విద్యార్థులే కాకుండా, పండితులైన శ్రీ శోభనాద్రిశాస్త్రులుగారు కూడా అనేవారు. ఈ శోభనాద్రిశాస్త్రులుగారు మన దేశస్థులు. కాకరపర్తి దగ్గర అజ్జరం గ్రామం వీరి కాపురస్థలము. వీరి సోదరు లందఱూ కాశీలోనే తర్కం చదివి పండితులై పేరు ప్రతిష్ఠలు సంపాదించారు. ఈయన మహారాష్ట్ర కన్యకనే వివాహం చేసికొని కాశీలోనే కాపురమున్నారు. ఈయనకు నేనంటే చాలా అభిమానం. బలవంతపెట్టి నాకు సిద్ధాన్తచంద్రోదయం అను వ్యాఖ్యానముతో తర్క సంగ్రహమును[60] ఈ మహానుభావుడే వుపదేశించిన పుణ్యాత్ముడు. నాకు కొంచెం ధర్మధర్మి భావం తెలియదానికేమి, ఎక్కడేనా

---

వేదాచారం, వైష్ణవాచారం, శైవాచారం, దక్షిణాచారం, వామాచారం, సిద్ధాంతాచారం, కౌలాచారం అని ఆచారం సప్తవిధం. మద్య, మాంస, మత్స్య, ముద్ర, మైధునమనే పంచమకారాలతో చేసే సాధన వామాచారం. ఇవి భౌతికమైనవి కావని, ఆధ్యాత్మికార్థం వేరే వున్నదని ఒక సిద్ధాంతం. పరశురామ కల్పసూత్రం వామాచారానికి ప్రామాణిక గ్రంథం. (తంత్రశాస్త్రము–వామాచారము, ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ ఉగాదిసంచిక, 1964)

**58.** ఈ తొళ్లక్కం ఆచారం ఇప్పటికీ ఉన్నదని కొందరు వైష్ణవమిత్రుల ద్వారా విన్నాను.

**59.** ప్రముఖ ప్రాచీన వైద్యగ్రంథం చరకసంహిత కూడా "మద్యం సౌమనస్య జననాం" అని చెప్పింది. అనగా విచారాదులను తొలగించి సంతోషముగా ఉంచునది అని అర్థం.

**60.** దర్శనాలు ఆరింటిలో న్యాయవైశేషికాలు రెండింటికీ చాలా దగ్గర సంబంధం ఉందట. కాలాంతరములో ఈ రెండూ ఒకే శాస్త్రంగా కలిసిపోయాయట. ఇలా ఈ రెండింటినీ ఒకటిగా పరిగణించి రచించిన వివరణ గ్రంథాలలో తర్కసంగ్రహం ఒకటి. న్యాయదర్శనానికే తర్కం, అన్వీక్షకి అని పేరు. తర్కశాస్త్రజ్ఞానం కోరేవారు తప్పక పఠించవలసిన గ్రంథమిది. రచయిత అన్నంభట్టు. దీనికి ఒక వ్యాఖ్యానగ్రంథాన్ని కూడా 'తర్కసంగ్రహ దీపిక' పేరుతో అన్నంభట్టే రచించాడు. సంస్కృత భాషలోని ఏ శాస్త్రమైనా కొద్దో గొప్పో తర్కశాస్త్ర ప్రవేశం లేనిదే కొరుకుడు పడదట. అందుకే వ్యాకరణం నేర్చుకోవడానికి కాశీ వెళ్లిన వేంశాకి తర్కసంగ్రహం కూడా ఉపయోగపడింది.

వ్యాకరణంలో ఆర్థికం వస్తే ఇటీవల అది సులభంగా బోధపడడానికేమి, నాకు ఈయన చెప్పిన ముక్కలే కారణం.

## మత్సద్మనిస్థీయతాం

కాలార్థకంనాడు భంగు ప్రసంగంలోనుంచి ఇంతదాకా వచ్చాము. కాలార్థకం చేసికోవడముకు పూర్వమే కాళికాష్టకములోనైనవి ఆయా దేవతలను దర్శించునపుడు రచించాను. పైకి ఆ కవిత్వం డాబుగా వున్నప్పటికీ, అందులో అర్థగాంభీర్యం మిక్కిలి తక్కువయని విమర్శకులు గ్రహిస్తారు గాని, సామాన్యులో – "నాళీకజాద్యదితిజాళీ" అనే శ్లోకాలు చదివి మిక్కిలిగా మెచ్చుకొంటారు. ఎంత అర్థప్రధానంగా తేలికగా కవిత్వం చెప్పేవాళ్లేనా, మొట్టమొదట కొంత కఠినంగానే కవిత్వాని కుపక్రమిస్తారేమో అని నేననుకొంటాను. దానికి నా మొదటి కవిత్వానికీ యిటీవలి కవిత్వానికీగల భేదమే నాకు ప్రమాణం. కాశీనుండి వచ్చేముందు ఏదో కొంత సొమ్ము కట్టేయెడల, శ్రీ అన్నపూర్ణా మహాదేవిని స్వయంగా పూజ చేయనిస్తారని విని, ఒకరోజున ఆ విశాలాక్షిని సొమ్ముకట్టి స్వయంగా పూజ చేసినాను. అప్పుడే ఆయంబికపై నొక యష్టకమును రచించినాను, అందొకచో 'మత్సద్మనిస్థీయతామ్' అని ప్రయోగించితిని. ఆ వాక్యమున కర్థము, 'అమ్మా! ఓ యన్నపూర్ణ మహాదేవి! నిన్ను నే నేకోరికనూ విశేషించి కోరేది లేదు గాని, నీవు మా యింట నివసించవలసినది. ఇదే నా ముఖ్యకోరిక' అని.



వజ్రభైషిగతో అన్నపూర్ణాదేవి

అది మొదలు ఇప్పటి వఱకు అనగా సుమారు నలుబదియైదు వత్సరముల నుండియు నా యింట దినదినాభివృద్ధిగా అన్నపూర్ణ తాండవించు చున్నట్లే నేను తలంచుచున్నాను. అట్లు తాండవించుటకు కారణము, నేను నాడు శ్లోకముద్వారా అట్లు వరమడుగుటయే యని నా విశ్వాసము. నేను అది

మొదలు ఇంతవఱకు నవరాత్రములలో పూజించు విగ్రహము, అపుడు కాశీనుండి కొని తెచ్చిన చిన్న అన్నపూర్ణ ప్రతిమయే. ఆ ప్రతిమ హస్తమందు ఒక గరిటె యుండును[61]. భవిష్యత్కాలమందు కూడా తరతరముల వఱకూ శ్రీమదన్నపూర్ణా విశాలాక్షి మాయింట యిదివఱలో వలెనే నాట్యము సల్పుగాక యని ప్రార్థించుచూ మరల ప్రకృతముపక్రమించుచున్నాను.

## నిర్జలైకాదశి

కాశీనుండి బయలుదేరుటకు త్రోవఖర్చులకు సొమ్ము వచ్చినప్పటికీ, యింకా బయలుదేరినట్లు వ్రాయ మొదలిడనేలేదు. మాటలా, కాశీ నుండి బయలుదేరడం! ఆ మహాక్షేత్రం వదిలిపెట్టడానికి యెంత మూర్ఖుడికీ సుఖసుఖాల మనస్సు వొప్పదు. వెడదామనుకొంటూ వుండగా, అనగా యింకా కాలార్థకం చేసుకోవడానికి పూర్వం, "నిర్జలైకాదశి" వచ్చింది. జ్యేష్ఠ బహుళ యేకాదశిని కాశీలో నిర్జలైకాదశి[62] అంటారు. ఆ రోజున గంగ యిటునుండి అటూ, అటునుండి యిటూ, ఈదడం ఒక ఆచారం, నేనూ, కృష్ణశాస్త్రిగారూ, తర్కసంగ్రహపుగురువు శోభనాద్రిశాస్త్రుల వారి తమ్ముడు శేషశాస్త్రిగారూ, ఈ ముగ్గురమూ సామాన్యమైన మట్టికుండల నాధారము చేసికొని గంగలో నీదుచూ ఆవలికి వెళ్లి తిరిగీ అదే ప్రకారం ఇవతలికి ఈదుకొంటూ వస్తున్నాము. మాతోపాటు మావలెనే ఘటహస్తుడై పల్నాటిసీమనుండి కొలదికాలము క్రిందటనే వచ్చిన వేఱొక విద్యార్థి కూడా వచ్చినాడు. వెళ్లేటప్పుడు బాగానే చేరినాడు. తిరిగి వచ్చేటప్పుడు నడిమికి వచ్చేటప్పటికి ఆతడాధారంగా నేర్పరచుకొన్న కుండ నీరు పోసుకున్నది. ఆ కారణంచే అతడు 'కెక్కు కెక్కు' మని మునగడానికి సిద్ధమైనాడు, నేను సామాన్యంగా ఈదేవాడనేగాని, అలాంటి సమయంలో వేఱొకని ప్రాణం రక్షించడానికి తగ్గంత గజీతగాణ్ణి కాను. నాతోవున్న

---

**61.** అన్నపూర్ణా విశాలక్షి అమ్మవారి చేతిలోని గరిటెని వజ్రభైషిగ లేదా వజ్రబైసుకి అంటారు. ఈ విగ్రహం ఆహారసమృద్ధికి చిహ్నం. ఈ వజ్రభైషిగ ప్రాచీనకాలంలో కన్నడదేశంలోని అయ్యావళి వర్తకసంఘానికి చిహ్నం.

**62.** వేంశా పొరబడినట్లున్నారు. జ్యేష్ఠ శుక్లఏకాదశి నిర్జలైకాదశి. బహుళఏకాదశి కాదు. దీనికి ఒక చిన్నకథ వుంది. ఏకాదశినాడు ఉపవాసం చేస్తే బహుపుణ్యప్రదం అని నమ్మకం. భీముడు ప్రతి ఏకాదశినాడూ ఉపవాసం ఉండాలని అనుకొనేవాడట, కానీ జిహ్వాచాపల్యం ఆ కోరికను తీరనివ్వటం లేదు. కృష్ణుడికి మొరపెట్టుకోగా, ఆయన ఒక తరుణోపాయం చెప్పాడు. జ్యేష్ఠ శుక్లఏకాదశినాడు ఒక్క చుక్క అయినా నీరు తాగకుండా ఉపవాసం చేస్తే అన్నీ ఏకాదశుల్లోనూ ఉపవాసం చేసినంత ఫలితం వస్తుందని ఉపదేశించాడు. అందుకని నిర్జలైకాదశి అని పేరు వచ్చింది. దీనికి త్రివిక్రమ ఏకాదశి అని కూడా పేరు.

కృష్ణశాస్త్రి, శేషశాస్త్రిగార్లిద్దరూ మంచి గజీతగాళ్లు. తమ రెండు కుండల్లో వక కుండ అతనికిచ్చి అతని కుండను తామిరువురున్నూ చెఱో చేతితో పట్టుకొని ఆ నీళ్లను పారబోసి అతని ప్రాణం రక్షించడమే కాకుండా తాము కూడా అనాయాసంగా వడ్డును చేరగలిగారు. ఆ కష్టసమయంలో ఆ విద్యార్థి నూఱు కొబ్బరికాయలు విశ్వేశ్వరుని యెదుట కొట్టడానికి మొక్కుకొన్నాడు. వడ్డుకు వచ్చిన తర్వాత, "ఏమయ్యా? బొత్తిగా ఈతరానివాడవు, గంగనీదడానికి యేలా బయలుదేరావు" అంటే, "నాకేం తెలుసును, మీరు కుండ పట్టుకు బయలుదేరితే నే కూడా కుండ పట్టుకు బయలుదేరా"నని జవాబు చెప్పినాడు. ఏమాత్రమూ లోకజ్ఞానం లేని యిట్టివాళ్లు పలువు రా క్షేత్రమునకు విద్యాభ్యాసానికి వచ్చి కొందఱు పూర్వపుణ్యవశం చేత చిరకాలానికి మహాపండితులై దేశానికి వచ్చి అనేకులను శిష్యులను పండితులను జేయుటా కలదు. కొందఱు అక్కడనే సత్రాల్లో పొట్టపోసుకొంటూ యావత్కాలమున్నూ గడుపుటా కలదు. అందుచేతనే, ఆ కాలంలో నేమి, అంతకు పూర్వకాలంలో నేమి, రైలుసాయం లేకుండినా యెట్లో కష్టపడి పలువురు కాశీకి చదువుకని వెళ్లిన వారిలో ప్రజ్ఞావంతులై వచ్చినవారి పేళ్లు పరిమితంగానే మనకు వినబడతాయి. భాగవతుల హరిశాస్త్రులవారు, పుల్లెల దక్షిణామూర్తిశాస్త్రులవారు, మార్కొండపాటి చతుష్టయంలో యిద్దఱు, దండిభట్ల విశ్వనాథశాస్త్రులుగారు, మా గురువుగారు, మంత్రవాది లక్ష్మీనారాయణశాస్త్రులుగారు, కొవ్వూరు గోపాల శాస్త్రులుగారు, శ్రీపాద రామశాస్త్రులుగారు, ఇంద్రగంటి గోపాలశాస్త్రులుగారు లోనైనవారి పేరులే అందఱూ యెఱుగుదురు. ఇందులో కొందఱు నలుబది యేండ్లు, ముప్పదియేండ్లు కూడా కాశీలో నివసించినవారు. ఒక శాస్త్రమే కాక, చతుశ్శాస్త్రములున్నూ వచ్చినవారు. ఒక శాస్త్రమే చిరకాలం ఒకసారి చదివి, తెలియక, మళ్లా తిరుగదోడి అంతా చదివి గొప్పవారైనవారు కొందఱు. కొందఱు చిరకాలం చదివి పండితులై దేశానికి వస్తూ ఏ సంస్థానంలోనో వాదంలో వోడిపోయి మళ్లా కాశీకి వెళ్లినవారు[63]. వీరిని గూర్చి ప్రత్యేకించి వ్రాయవలసినదేకాని, యిక్కడ

63. పుల్లెల దక్షిణామూర్తిశాస్త్రి కాశీలో యాగేశపండితునివద్ద చిరకాలం వ్యాకరణం అభ్యసించి తిరిగి స్వగ్రామానికి వస్తూ మధ్యలోని సంస్థానాల పండితులతో వాదం చేస్తూ జయిస్తూ వస్తున్నారు. విశాఖ జిల్లాలోని మాడుగుల అనే కొండ జమీందారీ సంస్థానంలో ఇంద్రగంటి గోపాలశాస్త్రిగారితో వాదించేటప్పుడు ఓడిపోతానేమో అనే సందేహం కలిగిందట. ఓడినట్లు ఒప్పుకొని తిరిగి కాశీవెళ్లి విద్యను మరింత గట్టి చేసుకొని తిరిగి మాడుగుల వచ్చారు. అప్పటికి ఆ పండితుడు గతించినట్లు తెలుసుకొని ఎంతో పరితపించారట.

వ్రాయడముకు స్థలం చాలదు, ఇందులో శ్రీ హరిశాస్త్రులవారిని శ్రీ విజయనగరం మహారాజులుంగారు[64] స్వయంగా ప్రార్థించి కాశీనుండి తీసుకువచ్చి తమ సంస్థాన పండితులుగా నేర్పఱచుకొన్నట్లు వింటాను. శ్రీ కొవ్వూరి గోపాలశాస్త్రిగారనేవారు షడ్దర్శనీపారగులగుటేకాక, మంత్రశాస్త్రంలో కూడా ప్రత్యక్షం చేయడానికి తగ్గంత నిష్ఠాపరులు, కాశీలో దుర్గను గూర్చి వీరు ప్రత్యేకించి పంద్రెండేళ్లు తపస్సు చేసి ప్రత్యక్షం చేసికొన్నట్లు చెప్పుకుంటారు. వీరిని కూడా శ్రీ విజయనగరం మహారాజులుంగారు ప్రార్థనపూర్వకంగా తమ సంస్థానమునకు రప్పించి నిల్పుకొనడమే కాకుండా, శ్రీ హరిశాస్త్రులుగారి కెట్టి గౌరవము లేర్పరచినారో అట్టి గౌరవములనే ఈ శాస్త్రులుగారికి కూడా ఏర్పరచినట్లు వినికిడి. ఈ గౌరవ ప్రపత్తులకు అంతకు పూర్వం సంస్థానములో వుండే పండితులు సహింపక వక యుక్తి చేసి, గోపాలశాస్త్రిగారు మంత్రశాస్త్రంలో మహాగొప్పవారని చెప్పగా చెప్పగా, మహారాజావారు వారి శక్తి మనకేలా తెలుస్తుందని అన్నారనిన్నీ, దానిమీద పండితులు, "మహాప్రభో! దేవరవారు కోరితే శాస్త్రులవారు ప్రత్యక్షంగా వారి శక్తిని చూపిస్తా"రని జవాబు చెప్పినారనిన్నీ, పిమ్మట నెప్పుడో మహారాజావారు, 'గురోజీ, మంత్రశాస్త్రంలో మీ ప్రజ్ఞ మాకొకమారు చూపించాలని కోరినా'రనిన్నీ, 'చిత్తం' అని చెప్పి శాస్త్రులవారు, 'నేను ఈ రోజు జపం చేసికొని వస్తాను, అప్పటికి బాగా నిమ్మకాయంత బంగారపు ముద్దను సిద్ధంచేసి వుంచవలసినది'గా చెప్పినారనిన్నీ, శ్రీమహారాజావారు అట్లే సిద్ధంచేయగా శాస్త్రులవారు ఆ బంగారం మీద మంత్రోదకం ప్రోక్షించేటప్పటికి ఆ ముద్ద రెండు ముక్కలుగా పగిలిందనిన్నీ, ఆ పిమ్మట మహారాజావారికి లోపల భయం కలిగి, 'ఎప్పుడైన ఈయనకు మనమీద కోపం కలిగితే ఇదే మోస్తరుగా మంత్రోదకం ప్రోక్షించడం తటస్థింపవచ్చును, అప్పుడు మనపని కూడా దీనితోపాటే కావచ్చును', అని వుపాయంగా వారిని సంస్థానంలో నుండి తప్పించి గోదావరీతీరంలో కొవ్వూరులో వుండేటట్లు ఏర్పరచి, వారికి నెల నెలకూ ఇచ్చే భృతకం కొవ్వూరుకే పంపేవారనిన్నీ, గురువుగారి వల్ల విన్నాను. విజయనగర సంస్థానంలో ఇప్పటికి వెనుకటి ప్రభువులందఱున్నూ తమ సంస్థానంలో వున్న యెవరిని గాని తొలగింపవలసి వచ్చినప్పుడు, తొలగించిన వారికిచ్చే జీతం పంపించడమే ఆచారము. ఇక మళ్లా దర్శనం మాత్రం

**64.** ఈ రాజు విజయరామ గజపతి (1826–1879). బాల్యమంతా కాశీలోనే గడవడం వలన కాశీ పండితులంటే ఎనలేని గౌరవం. తెలుగు, సంస్కృతం, ఫారసీ, హిందీ భాషలలో మంచి ప్రవేశం ఉండేది. పండిత సాన్నిధ్యంతో అనేక శాస్త్రాలలో అవగాహన ఏర్పడింది. కవిపండిత గాయకులను కోరి రప్పించి ఆస్థానంలో నిలుపుకొనేవారు.

తొలగించినవారికివ్వక పోవడమే కాదు, వారి వంశస్థులు కూడా, వీరికే కాదు, వీరి వంశస్థులక్కూడా యివ్వరు. శ్రీ హరిశాస్త్రులవారి విషయంలో ఈ సందర్భం అంతా యెఱిగినదే కావున విస్తరింప బనిలేదు.

## కలకత్తా ఆతిథ్యం

ప్రసక్తానుప్రసక్తంగా కథ యెక్కడికో పోతూవున్నది. ఈలాంటి మహాపండితులందఱూ కాశీలో తయారై వచ్చి మనదేశాన్ని అలంకరించేవారన్నది ప్రధానాంశము. అట్టి కాశీ యిపుడు ఏదో మాదిరి స్థితిలో నున్నట్టు వింటాము, ఆ కాశీనుండి నేను దేశానికి రాబోవుచూ, సహాయం కోసము చూస్తూవుండగా మన దేశస్థుడే రెడ్డిసీమలోని లక్కవరము నుండి వచ్చిన వందనపు నర్సయ్య అనే కోమటిబిడ్డ నావలెనే సహాయం కోసము వెతుక్కుంటూ నాకు దొరికినాడు. నేనతనికి దొరికాను, ఇరువురము తల్లిదండ్రులు కలవాళ్లమే కావున మాకు గయకు వెళ్లవలసిన ప్రసక్తి లేశమున్నూ లేకపోయినప్పటికీ, పోనీ రాకరాక వస్తిమిగదా, విష్ణు పాద సందర్శనం చేసికొని పోదామని గయకు కూడా వెళ్లాము. అక్కడ విష్ణుపాదమును పూజించుకొని కలకత్తాకు టిక్కట్టు పుచ్చుకొన్నాము. '144వ నెంబరుగల గృహములో మన తెలుగుదేశీయు లున్నారు. అక్కడికి తీసుకువెళ్లమంటే జట్కావాడే తీసుకువెడతాడు', అని కాశీలో విద్యార్థులు చెప్పినారు. అది జ్ఞాపకం పెట్టుకొన్నాముగాని, ఆ జట్కావాడు మమ్మలిని మోసం జేసి యెక్కడో వాడికి తోచినచోట దింపి బాడుగ తేతెమ్మన్నాడు. వాడితో పోట్లాడలేక వాడిది వాడికిచ్చి ఆ సమీపంలో వున్న ధర్మశాలలో దిగినాము. అది సకల అల్లరిచిల్లరి జనంతో ఎంతో సంకులంగా వున్నది. అయితే యేం చేయము? ఆ మహాపట్టణములో మమ్మల్ని చూచేదెవరు? అది ఆషాఢమాసము, తొలకరివానల కారంభమయింది. విరుద్ధమైనగాలి, వంటకు మొదలుపెడితే, పొయ్యి మీద పాత్ర వుంటే మంట యెక్కడో వుండడం. అట్టి స్థితిలో చేతగాని నేను వంటేమి చేయగలను? సహాయుడు కోమటిగదా? వంట మట్టుకు నేను చేస్తే తక్కిన యావత్తు పనులను అతడు సవరణ చేయగలడు. ఎట్లాగయితేనేమి, బజారు వెళ్లి రొట్టెలు కొనుక్కొని తెచ్చుకొని తింటూ వారం రోజులు కాలక్షేపం చేశాము ఆ కలకత్తాలో వారం రోజులున్నా మాకేమి నిల్వనీడ దొరకనేలేదు.

## బంగాలీవాని మోసం

ధర్మశాలలో జనంవల్ల అక్కడినుండి జగన్నాథానికి వెళ్లడానికి త్రోవ మాత్రం తెలిసింది. ఆ త్రోవ కొంత సముద్రం మీద, కొంత కాలువలమీద, కొంత మెట్టను,

ఈలాగునవున్నది. ఎట్లో బయలుదేరి పోతే తప్ప ఆ కలకత్తాలో బజారు రొట్టెలతో ఎన్నాళ్లుపవాసాలు చేయడం? కాలాష్ఠకంనాడు భంగు పుచ్చుకొన్న దోషంవల్ల కల్గిన గ్రహణి మఱింత హెచ్చ మొదలుపెట్టింది. అందుచే ఆ కలకత్తానుండి బయలుదేరుటకయి ష్టీమరుకు టిక్కెట్టు తేవడానికి కోయిల్‌ఘాటుకు బయలుదేరాను. కోమటి బసలో కాశీకావిళ్ల వద్దనే వున్నాడు. అతడు వీధిలోకి వెళ్లినప్పుడల్లా త్రోవతప్పి పావలా అర్ధా లంచం ఇచ్చి అతికష్టంమీద బసకు చేరుతూ వుండేవాడు, నేనుమాత్రం వెళ్లిన త్రోవ జ్ఞాపకం పెట్టుకొని, అవధానం చేసినంత పని చేసి బసకు చేరుతూ వుండేవాడను. అందుచే టిక్కట్టుకోసము పదహారు రూపాయలు పుచ్చుకొని నేను బయలుదేరాను. ఒక ఫర్లాంగు వెళ్లాను. కోయిల్‌ఘాటు కనబడుతూవుంది. అంతలో ఒక బంగాలీవాడు నావాలకం కనిపెట్టాడు. వీడెవడో తెలుగువాడురా అనుకొన్నాడు. ప్రీతిపూర్వకంగా వాడిభాషతో 'ఎక్కడకు వెడతావు భజ్జీ' అని ప్రశ్నించాడు. 'కోయిల్ ఘాటుకు' అని వచ్చీరాని హిందీతో జవాబు చెప్పాను. దానిమీద వాడికి మఱీ లోకువ చిక్కింది. 'ఒకమాట చెప్తాను, వింటావా' అన్నాడు. చెప్పమన్నాను. 'కోయిల్ ఘాటులో కన్న తక్కువ సొమ్ముకు టిక్కెట్టు ఒక బంగాళీబాబు ఇస్తున్నాడు. నేను కూడా జగన్నాథం వచ్చేవాడనే. నేనక్కడనే పుచ్చుకొంటాను. నాతోకూడావస్తే నీక్కూడా తేలికగా టిక్కెటు యిప్పిస్తాను ర'మ్మన్నాడు. వాడిమాటలవల్లనే యెంత తెలివితక్కువవాడికైనా మోసగాడని తెలుస్తోంది కదా. అట్టి స్థితిలో అంతో ఇంతో లోకజ్ఞానంకల నాకు తెలియదనడాని కవకాశం లేదుగాని, తెలిసినా, వాణ్ణి నేనెల్లా తప్పించుకోగలను? ఎట్లో నావద్ద నున్న సొమ్ము కాజేయడానికి వాడు సంకల్పించాడు. ఆ సొమ్ముతో నన్ను వదిలితే అదే చాలునని నేననుకొన్నాను, వానితో కూడా తోడేలుతో వెళ్లే మేకలాగు రాజవీధిలో పోతూవున్నాను. కొంతదూరం వెళ్లిన మీదట ఒక పెద్ద మేడ గుమ్మడికాయవాటంగా ఉన్నది కనుపడ్డది. దాని మెట్లత్రోవ ఒక చిన్న వీధంత వెడల్పుగా వుంది. ఆ త్రోవని మేడమీదికి త్రోవ తీశాడు. ఇక అయిదాఱు మెట్లల్లో పైకి వెడతామన్నప్పుడు నన్ను జూచి, 'సొమ్ము నాచేతికియ్యి, నువ్విక్కడేకూర్చో, నిన్ను చూస్తే బాబు ఎక్కువ తెమ్మంటాడు' అని నావద్దనున్న పదహారురూపాయిలున్నూ పుచ్చుకొని పైకి వెళ్లాడు.

## తెలివితక్కువవాడెవడు ?

'బ్రతుకుజీవుడా' అని కొంత సంతోషంతో అయిదు నిమిషములకన్న తక్కువ కాలమే నేనక్కడ కూర్చున్నాను. పూర్తిగా సంతోషమేల కలుగలేదని చదువరులు శంకింతురేమో! వాడు నన్ను చంపే వుద్దేశ్యంలో లేడని స్పష్టపడుటచే కొంత

సంతోషమున కవకాశం కనపడుతూనే వుందికదా. ఇక కొంత విచారమెందుకంటే తిరిగివచ్చి తీసుకుపోయి దేవీ నవరాత్రులదాకా వాళ్ల టోళాలలో దాచి, అమ్మవారికి బలి వేస్తాడేమో అని కొంతవిచారం. ఏం వ్రాయను? అప్పుడు నా మనస్సులో నెన్ని రసాలకేనా అవకాశం కలిగింది. అంతా ఎంతసేపు, అయిదు నిమిషాలలోపు మళ్లా నాకు ఏం తోచిందో, తరువాయి మెట్లు ఎక్కి మేడమీదికి వెళ్లాను. నాలుగు దిక్కులు చూచాను. బాబూ లేదు, గీబూ లేదు. ఏమోగాని, వక్క నవుకరు కూడా లేదు. మేడమీద కూడా ఒక వీధిలాగున్నది. కొంతవఱకు వెళ్లాను. మళ్లా ఇదివఱలో మేమెక్కిన మోస్తరువే మెట్లూ, త్రోవా, వకటి కనుపించింది. అక్కడికి వెళ్లేటప్పటికి ఆ మెట్లు ఏమాత్రమో తరువాయిలో ఆ మోసగాడు కనిపించాడు. పోనీ పోతున్నాడు, అనుకొన్నాను, మళ్లా వెనక్కి చూశాడు నేను కనుపడ్డాను. "బాబు లేదు, ఎక్కడికో వెళ్లాడు, నీ సొమ్ము ఇదిగో తీసికో" అని వెనక్కి వచ్చి నాచేతికిచ్చేశాడు. ఏమిటో ఈ చిత్రము! సొమ్మెందు కియ్యాలి! ఇయ్యకపోతే నేనేం చేస్తాను? తాను మోసగాడు కాడని నే ననుకోవడాని కనుకొందునా? ఇట్లు నన్ను నమ్మించడం వల్ల వానికి కలిగే లాభమేమిటి? నా దగ్గఱ నున్న సొమ్మింతేకదా! అది యిది వఱకే ఇచ్చితినే! ఏమో నాకప్పుడే కాదు, ఇప్పటికిన్నీ వాని ఆంతర్యం తెలిసిందేకాదు. నన్ను వాడేమో తెలివితక్కువవాణ్ణిగా వూహించాడుగాని, వాడి చేష్టలను బట్టి నేనే వాణ్ణి తెల్వితక్కువవాడని ఢంకామీద దెబ్బకొట్టి చెప్తాను. కారణం చదువరులే విచారించుకొందురుగాక, నే నీ కథాభాగములో వ్రాసిన సంగతులలో చదువరులకు నమ్మతగని దీ కథాభాగమే. దీన్ని గుఱించి యిప్పటికిన్నీ నాకు నమ్మకం లేదు, ఇతరులను గూర్చివ్రాయడ మెందుకు? ఇది కల మాత్రం కాదు. నిజంగా జరిగింది.

సొమ్మిచ్చి మళ్లా నన్ను వెంటబెట్టుకొని కొంతదూరం త్రిప్పినాడు. ఆ తోడేలు వెంట ఈ మేక యథాప్రకారమే నడుస్తూ వుంది. మళ్లా అటు తిప్పి, ఇటు తిప్పి, ఆ మేడవద్దకే, ఆ మెట్ల వద్దకే తీసుకు వెళ్లాడనుకొన్నాను. లేదా అలాటి మేడ మఱొక్కటుందేమో? మళ్లా ఎక్కడం మొదలు పెట్టాడు. వెనకాల నేనున్నూ త్రాటితో దబ్బనంగా ఎక్కుతున్నాను. సరిగా ఇంక ఐదుమెట్లే తరువాయి. అక్కడ ఆగి, సొమ్ము పుచ్చుకొని, వానిచేతులో వున్న పదహారుబెత్తాల గుడ్డగొడుగు సరిక్రొత్తది నాచేతికిచ్చి, 'పైకి రావద్దు నేవచ్చేదాకా, ఇక్కడే కూర్చో' అని మర్యాదగా చెప్పి పైకి వెళ్లాడు. నేను అయిదాఱు నిమిషాలు కూర్చుని పైకి వెనుకటిలాగే వెళ్లి నాలుగు దిక్కులూ చూచి రెండోత్రోవను దిగి తల తడుముకుంటూ బసలోకి వచ్చాను, జరిగిన సంగతి స్నేహితుడు కోమటితో చెప్పితిని. అతడు నేను బ్రతికి వచ్చి తనకు కనుపడ్డందుకు మిక్కిలిగా సంతోషించి నన్ను యెంతో మెచ్చుకొన్నాడు.

పదహారు రూపాయిలకు పదహారుబెత్తాల గొడుగు వచ్చిందన్నాడు. నేను శ్రీ విజయనగరం మహారాజావారి దర్శనానికి వెళ్లినప్పుడు ఇటీవల రచించిన పద్యాల్లో వక సీసపద్యంలో "పడవలె పడరాని పాటులెల్ల" అని వ్రాశాను. ఆపాట్లు, ఆయీ పాట్లే అని చదువరులు తెలిసికొందురుగాక. లాక్షణికులు "అహో భారోగురుః కవేః" అని వూరకే వ్రాయలేదు. దేశాటనం వల్ల ఎన్ని కష్టసుఖాలు వంటబడతాయో చదువరులు గుఱితింతురుగాక.

## క్షుధాతురాణాం నరుచిర్నపక్వం

పిమ్మట మఱునాడు జాగ్రత్తగా కోయిల్‌ఘాటుకే వెళ్లి టిక్కట్టు తెచ్చుకొని ష్టీమరెక్కేము. ఆ ష్టీమరు మఱునాడు ఉదయం 9 గంటలకు చాందినివాలా అనే వోఢ్ర గ్రామము వెళ్లవలసినదైనా సముద్రంలో త్రోవదప్పి రాత్రి 9 గంటలకుగాని గమ్యస్థానానికి చేరింది కాదు. చేరటంతోటే, ఏదోనది వొడ్డున దిగడం గనుక, క్రొత్తగా వచ్చిన ఆ బురదనీళ్లలో స్నానంచేసి వూళ్లోకి చేరి అందరమూ వక సావిట్లో మకాం చేశాము. అది వక దుకాణదారుని యింటిసావిడి. దానినిండా రెండేసి గజాలకు వొక్కొక్కటి చొప్పున చాలా వండుకొనే పొయిలున్నాయి. పొయి వక్కంటికి అర్ధణా వంతున బాడుగ యివ్వడం యేర్పాటు. తురకా, దూదేకులు, కోమటి, బ్రాహ్మడూ, అందఱూ అక్కడే వండుకోవడం. బియ్యం పప్పూ, వగైరాలు ఆ దుకాణంలోనే కొనుక్కోవడం. ఉప్పుడుబియ్యం తప్ప దొరకవు. చింతపండు ఆ దేశస్థులు వాడరు. దానికి బదులు లేతమామిడికాయల తాలూకు యెండబెట్టిన చీలికలు (ఆమ్‌చూర్ అంటారు) దొరుకుతాయి. ఎట్లాగయితేనేమి రాత్రి సుమారు పన్నెండులోపున అన్నం వండాను. పెసరపప్పు వండాను. అరటిపళ్లు కొనుక్కున్నాము. మజ్జిగ మాత్రం మంచిదే దొరికింది. 'కాలే కడుపునకు మండే బూడిదె' అన్నట్లు పొట్ట నిండించుకొన్నాము. గయ వదలి నాటికి సుమారు పదిరోజులు దాటింది. ఈలోపున మాకు ఏ రొట్టో తప్ప అన్నం లేదు. ఆ హేతువుచేత ఆ వుప్పుడు బియ్యం అన్నం అమృతోపమానంగా వుంది. 'క్షుధాతురాణాం న రుచి ర్న పక్వం,'[65] అక్కడే అంతా పరున్నాం.

---

**65.** అర్థాతురాణాం న గురు ర్న బంధుః, కామాతురాణం న భయం న లజ్జా
విద్యాతురాణాం న సుఖం న నిద్రా, క్షుధాతురాణాం న రుచి ర్న పక్వం
ధనలోభం కలవారికి పెద్దలనీ, బంధువులనీ విచక్షణ వుండదు. కామాసక్తుడైన వాడికి సిగ్గు, భయం ఉండదు. విద్యాసక్తులు నిద్ర, సుఖం పట్టించుకోరు, ఆకలిగొని వున్నవారికి రుచి, ఆహారం బాగా పక్వమైనదా అనే విచక్షణ వుండదు. *(విక్రమార్క చరితమ్)*

తెల్లవారింది. ముందు ప్రయాణం ఎప్పుడంటే ఎప్పుడని కనుక్కోగా, పగలు రెండు గంటలకు ష్టీమరు వెనుక కట్టిన కంకర పడవలవంటి పడవల మీద యెక్కడమున్నూ, మరునాడు వుదయానికి కటకం చేరడమున్నూ అని వాకబుమీద తెలిసింది. మళ్లా పెందలకడ వంట మొదలెట్టి పదిగంటలలోగా వకమాటు తిని, ప్రయాణం అయేటప్పుడు రెండోమాటుకూడా తిన్నాం. దృష్టిదోషంగాని మఱొక దోషంగాని అక్కడ భోజనంలో లేశమున్నూ లేదు. ఆ యిల్లు బహుశః ఆ దేశంలో కోమటివర్ణమునకు చెందినదై యుండునేమో. ఆ దేశాన్నే కీకటమని శాస్త్రజ్ఞులు వ్యవహరిస్తారు. "దితిజాధిప కీకటంబు దేవాపగయున్" అని దేవీభాగవతము. ఈ దేశాల్లో తీర్థయాత్రకు తప్ప ఇతర కారణంమీద ప్రయాణం చేసేయెడల ద్విజులు తిరిగీ వుపనయనం చేసికోవలసినదని ధర్మశాస్త్రములు తెల్పుతున్నవి. "తీర్థయత్రాం వినా గచ్ఛేత్పువస్సంస్కార మర్హతి". తిరిగీ వుపనయనం చేసికొంటే పవిత్రుడవుతాడని ధర్మశాస్త్రాలు యెందుకు వ్రాసేయో కాని, నా అభిప్రాయం అప్పుడుకూడా పవిత్రత్వం కలగదనే. పడవ యెక్కేము. కంకర రాళ్లువలెనే మనుష్యులున్నూ దానిమీద వున్నారు. అంతే కాని యెండకు గాని వానకుగాని ఏమీ ఆచ్ఛాదనం లేదు. అయినా క్రొత్త దేశం, క్రొత్తప్రకృతిచిత్రాలు చూడడం మొదలైన కారణాలచేత కొంత ఆనందంగానే వుంది ఎండ కాస్తున్నప్పటికీ దగ్గర గుడ్డగొడుగు కొంత ఆ బాధ లేకుండా చేసింది. అంతలో యెండ బాధ దానంతట అదే తగ్గింది.

## ఈతకు సార్థక్యం

ఇంతలో కొన్ని చిక్కులు. నేను గ్రహణివ్యాధితో కాశీనుండి బయలుదేరినా నని యిదివఱకే వ్రాసియున్నాను. త్రోవలో అది తగ్గుటకు సాధన మేమున్నది? పైగా మేము తినే ఆహారము దాన్ని హెచ్చు చేసేదేగాని తగ్గించేది కాదు. ఇక దాన్ని తట్టుకోవడానికి ఆధారము పదుచుతనం తప్ప వేఱులేదు. కొంచెం నల్లమందు వేసికొందామంటే, అదిమాత్రం యెంతసేపు ఆపుతుంది? పడవ ష్టీమరు వెనుక కట్టబడ్డది. దాన్ని మనకోసం అప్పుడప్పుడు వడ్డుకు పట్టమనడానికి మనమున్నచోట నియామకులు లేరు. ఔరా దురవస్థ! ఏమి చేయాలి? విషయం రసాభాసమైననూ వ్రాయవలసి వ్రాస్తున్నాను. మఱొకలాగు తలవకండి. చిన్నప్పుడు నేర్చికొన్న యీత అప్పుడు కొంత పనికి వచ్చింది. మృచ్ఛకటికలో శర్విలకుడుగాడు యజ్ఞోపవీతానికి సార్థక్యం చెప్పినట్లు[66], నేను అప్పుడు 'ఈతకొట్ట నేర్చియుండు,' అని చదువుకొన్న

**66.** చారుదత్తుని ఇంటికి దొంగతనానికి వెళ్లిన శర్విలకుడు గోడకి కన్నం వెయ్యడానికి కొలత కోసం బ్రాహ్మణుడు కనుక – ధరించిన యజ్ఞోపవీతం తీసి ఉపయోగిస్తాడు.

బాలబోధలో వాక్యానికి సార్థక్యం వూహించుకొన్నాను. కాలువకు అక్కడక్కడ లాకులు వుంటాయి గదా? ఆ లాకుల దగ్గఱ ఎంతత్వరగా వెళ్లే స్టీమరుకైనా కొంత ఆలస్యం తప్పదు. లాకు ఇక వక అరమైలులోపుగా వుందన్నప్పుడు, నేను గభాలున కాలువలో దూకి ఈదుకొని వడ్డుకు వెళ్లి తరువాయి దీర్చికొని లాకు దగ్గర పడవను కలిసికొనే వాడను. ఇలా రెండుమూడుసార్లు చేయవలసివచ్చింది. ఈ చేయడంలో వక పర్యాయము నెత్తికి చుట్టుకొన్న బట్ట తీసివేయడం మరచినాను, దానితో మునిగి పయికి తేలడం కొంత కష్టమయింది. వ్రాయమఱచాను. చదువుకొంటూ వున్నది శాస్త్రం, పుట్టింది బ్రాహ్మణకులం, చేసిన శుశ్రూష మహాపండితులది, కాశీగంగతో సహా స్వదేశానికి వస్తూవున్నాను. ఇట్టిస్థితిలో జరిగినంతలో అనాచారంగా యెట్లు వర్తించడం? కనుక కాలువలో దూకేటప్పుడు చెంబొక్కటి ముందుగా గట్టుకు విసిరేసి తరువాత దాన్ని పుచ్చుకొనేవాణ్ణి. ఈలా చేయడంవల్ల “అపాత్రత్వం” వుండదని నావూహ. కాని ఒకసారి ఆ చెంబు దొర్లి నేను వడ్డుకు చేరడానికి పూర్వమే కాలువలో పడి మునిగిపోయింది. నాకు సంభవింపవలసిన గండం చెంబుని కొట్టుకుపోయిందని నా మిత్రుడు కోమటి సంతోషించాడు.

## త్రివిక్రమావతార సాదృశ్యం

ఏలాగో యీలాటి గండాలతో కటకం చేరినాము. అక్కడ మన తెలుగు దేశస్థులు, నిరతాన్నదాతలు, ఇంటి పేరు మరచాను – వేంకటాచలం పంతులు గారింట్లో ప్రవేశించాము, బహు ఆదరంగా వారు మన దేశస్థులకు అన్నోదకాలిచ్చి ఆదరిస్తారు. వారం రోజులు బాబాకరంగా వారింటిలోనుండి కాశీ వదలింది మొదలు అన్నంలేని లోపాన్ని పోగొట్టుకొన్నాము. నాతో ఉండడంచేత కోమటికి కూడా వారు ఆతిథ్యం ఇచ్చారు.తరువాత త్రోవలోకి ఇంత గోంగూరపచ్చడి వగయిరాలు కూడా ఇచ్చాయి. నా అనారోగ్యం కూడా కొంత తగ్గింది. పిమ్మట కటకాన్నుంచి యెడ్లబండి చేసికొని బయలుదేరాము. కాకులు కూసేటప్పటికి వూరి వెలుపలికి వస్తిమి. అక్కడ ఒక ఇసుకమయమైన నది వున్నది. సుమారు మూడు ఫర్లాంగులమేర బండ్లేమి, మనుష్యులేమి దానిలో నడచి వెళ్లవలసిందే. వందల కొలదిగా బళ్లు వెళుతూవున్నాయి. ఏచంటిపిల్లలోతప్ప, బండిలోని మనుష్యులు దిగి నడుస్తూ వున్నారు. ఈలాటి సందర్భంలో కొంచెము నీరు నురుగలతో ప్రవహించడాని కారంభమయింది. మధ్యత్రోవలో వున్న బళ్లు యెట్లో ఆవలివొడ్డుకు చేరాయి, అంతకన్న వెనుకవున్నవి తిరిగీ వెనక్కి వచ్చేశాయి. వక పావుగంటలో మోకాలిలోతు నీరు ప్రవహించడం మొదలుపెట్టింది. అరగంటయ్యేటప్పటికి ఇంక

చెప్పేదేమిటి? త్రివిక్రమావతారంలాగు "ఇంతింతై వటుడింతయై" అన్నట్లు పొంగి మిన్ను ముట్టుచూ పాము మీసం తెగగొట్టుచూ తన్నే చూడమని ఆ నది పరాక్రమించింది. మాబండీ మేమూ వడ్డునే వున్నాము, సూర్యోదయం అయింది. దంతధావనాది కాలకృత్యాలు నెఱవేర్చుకున్నాము. అంతలో ఎక్కడ నుండివచ్చాయో రెండు పెద్ద బల్లకట్లు వచ్చాయి. ఆవలిబండ్లను ఈవలికి, ఈవలిబండ్లను ఆవలికి దాటించడానికి మొదలుపెట్టాయి. ఎక్కడ తెములుతుంది, వకటా? రెండా? వందలకొలది బండ్లున్నాయి. కీకటానికి తూర్పుప్రక్కను మహానది వున్నది. అది జీవనది. గోదావరి, కృష్ణ వీట్లవంటిదే. వెడల్పులో ఇది ఆ మహానదికి తీసిపోదుగాని, జీవనది మాత్రం కాదు. పడమటిదిక్కున ఇది వున్నది. ఈలాటివి, ఇంతింత కాకున్నను ఇంతకంటె చాలాచిన్నవి అయిన సెలయేళ్లు త్రోవలో ఎన్నో తగులుతవి. బొత్తిగా చిన్నవియైతే రోడ్డుబాటకు అడ్డం తగులకుండా ఏదో తూము కట్టివున్నారు. కాని ఈ బాపతులు అప్పటికింకా కట్టబడివుండలేదు. ఇవి అప్పుడప్పుడు చాలా ప్రయాణీకులకు మోసం కల్పించడమున్నూ కలదు. ఆ రోజున ప్రమాదం మాత్రమేమీ జరుగలేదు కాని, మాబండీ మేమూ ఆవలికి దాటేటప్పటికి రాత్రి యెనిమిది గంటలు దాటింది అప్పుడు మాకు బసయెక్కడ, బండలెక్కడ?

"ఊరు నాకు క్రొత్త, ఊరికినే క్రొత్త." ఒక వోఢ్రపండితుడు ఆవలి వొడ్డునకు దిగిన సమయంలో తటస్థించాడు. ఆయనకు సంస్కృతం వచ్చును. పాపమాయనే మమ్ము "శాస్త్రిణః! కుత ఆగచ్ఛంతి? కుతోవాగచ్ఛంతి?" అంటూ ప్రశ్నించాడు. తత్కాలోచితమైన జవాబును చెప్పి, 'నేటి రాత్రి మా గతి యేమి' అని అడిగితిని. ఆయన తనతో తీస్కునివెళ్లి వంట వగయిరాలకు సదుపాయం కల్పించి ఆదరించాడు. తెల్లవారుజామున మళ్లా బయలుదేరి వకటిరెండు మకాములు వెళ్లేటప్పటికి బండియెద్దొకటి పడుకోవడం మొదలు పెట్టింది. అప్పుడు మఱొక బండెక్కడ దొరుకుతుంది? ఆ యెద్దుకు బదులు బండివాడు కాడి బుజాన్ని బెట్టుకు నడవడం, ఎద్దు వెనుక రావడం, వీలునుబట్టి మేముకూడా నడవడం, ఈలాగు రెండు మూడు మకాములు ప్రయాణం జరిగింది. ఎట్లాగయితేనేమి, శ్రీజగన్నాథ క్షేత్రమునకు వచ్చి చేరుకొన్నాము. స్వామివారిమీద చేతనైనది వక అష్టకం "జగన్నాథం నాథం సరిదిన సుతాయా భజమనః" అనే మకుటంతో రచించినాను. సముద్రస్నానం వగయిరా సందర్భా లనుభవిస్తూ అక్కడ వారంరోజులవఱకూ వున్నామని జ్ఞాపకం.

## గంజాం - బర్హాంపురం

అక్కడ నుండి మళ్లా బండి చేసుకొని గంజాముకు బయలుదేరినాము. చిలకసముద్రం త్రోవనైతే పడవలమీద ప్రయాణం చేయాలి, మధ్యమధ్య తిప్పలమీద వండుకోవాలి, కొంచెం చుట్టుగాని మెట్టమార్గం అంతకంటె వీలని కొందఱు చెప్పారు. ఆమాటమీద చుట్టయినా మెట్టమార్గం మేలన్నారని మెట్టమార్గానే బయలుదేరాము. కాని త్రోవలో పోలీసుజవానుల సాయముతో బయలుదేరిన తహస్సీల్దారుగారినే రాళ్లు రువ్వి దొంగలు చీకాకు పఱచినట్లొక మకాములో తెలిసింది. ఇక అప్పుడేం చేయము? కొన్ని బళ్ల సహాయముతో యెట్లెట్లో చిన్న చిన్న ప్రయాణాలతో గంజాం చేరాము. కలకత్తా బయలుదేరినది మొదలు కటకంలో తప్ప గంజాం వఱకున్నూ స్వహస్తపాకమే. ఒకప్పుడు బండిక్రింద వంట చేసుకోవలసి వచ్చేది. ఎందుచేతనంటే: అడిచినుకూ పొడిచినుకూ వాన పడేటప్పుడు, ఏ చెట్టు క్రిందో మకాం పెట్టినప్పుడు అంతకన్న గతియేమి? ఎట్లో వుడికీవుడకని మెతుకులు దిని గాలికి చాటుగా బండి సర్దించుకొని దానిమీద నిద్రించడం, బండివాడు బండిక్రింద పరుండడం ఇట్లా ప్రయాణం సాగిస్తూ గంజాం చేరాము. అక్కడి నుండి సత్రాలలో భోజనం దొరకడం మొదలు వంటబాధ తప్పింది. గంజాం రాత్రిపూట ప్రవేశించాము. సత్రంలో తిని పరున్న తరువాత నాకు అపారంగా చెవిపోటు మొదలుపెట్టింది. అక్కడ దిక్కెవ్వరు? దగ్గఱ తమలపాకులు సున్నము నిల్వ వున్నది. అవి రెండూ కల్పిన రసం వల్ల ఆ బాధ నివర్తించింది. తాంబూలము కాశీయాత్ర చేయించడానికే కాకుండా చెవిపోటు వైద్యానిక్కూడా పనికివచ్చిందని నాలో నేననుకొన్నాను. అటునుండి తెలుగుదేశమే అనుకోదగిన సీతారాంపురం మొదలైన గ్రామాలద్వారా దేశానికి వస్తూ బర్హాంపురంలో *(బరంపురం)* మాత్రం వారం రోజులు ఆగినాము. కారణం నాతో వచ్చిన కోమటన్నాడుకదా, ఇక నా చేతిలో సొమ్ములేదు. ఈపైన మనము కాలినడకమీదనే వెళ్లాలన్నాడు. అలాగయితే ఈ వూళ్లో నేను అవధానం చేసి సంపాదిస్తానని చెప్పి ఆగమన్నాను. ఆగేడు. అవధానమున కంతా ప్లీడర్లు సిద్ధం చేశారు. కాని అంతలో వారిలో నెవరికో ఆపత్తు వచ్చి మఱికొన్నాళ్లుండవలసి వచ్చింది. కోమటికి ఇంటికెప్పుడు వెడదామా అన్నంత తొందరగా వున్నది. అందుచేత, అతడు, 'మీరుండండి నేను వెడతా' నన్నాడు. దానిమీద, 'నీకుమాత్రం బండి ఖర్చెక్కడిది? మన యిద్దరికీ కూడా సరిపడ్డ సొమ్ము ఇక్కడ వస్తుంది వుండ'మన్నాను. తగిన ప్రత్యుత్తరం లేక ఆగినాడు

కాని, ఏమైనా వాని మనస్సిక్కడ లేదు. ఆ కారణంచేత వున్న యథార్థం చెప్పవలసి వచ్చింది. “సొమ్ము అంతో యింతో వుంది, ముందే జాగ్రత్తపడడం మంచిదని ఆలా అన్నాను, కనుక వెడదాం పదండి” అన్నాడు. సరేనని బయలుదేరాము.

## కాశీ కావడిమోత

అయితే మేమిద్దరమున్నూ కాశీకావళ్లు పూర్వులతో పాటు కట్టించుకొన్నామే గాని, యిదివఱకు వక మకామైనా మోయలేదు. ఇక్కడనుండి మోయడానికి మొదలెడదామని బుద్ధి పుట్టింది. భుజాలమీద కావిళ్లు పెట్టుకొని బయలుదేరాము. గోవిందపురం సత్రానికి రాత్రిపూటకు వెళ్లాలి. అయిదు కోసుల మకాము. రోడ్డు మార్గము. ఒకటి రెండు కోసులు నడిచేటప్పటికి నా భుజము సహించింది కాదు. కోమటి చిన్నప్పటి నుండి వ్యవసాయంలో నలిగినవాడు. అంతేకాక లావుపాటి వెదురుబొంగు అతడు కట్టించుకొన్నాడు. అదేమో బలువుగా వుంటుందనుకొని నా తాహతుకు సరిపోయే సన్నపు వెదురు నేను కట్టించుకొన్నాను. కోమటంత కాకపోయినా విద్యార్థిదశలో నేనున్నూ కొంచెం నీళ్ల కావిళ్లకు అలవాటైనవాడనే అయినప్పటికీ, ఈ సన్నము నన్ను బాధించడానికి మొదలు పెట్టింది. ఆ రహస్యము అప్పుడు కోమటి నాకు చెప్పి, నాకావిడి అతడెత్తికొని ఆతడి కావిడి నాకిచ్చాడు. ఎట్లో ఆ మకాం సూర్యాస్తమయానికి చేరుకున్నాము. కాని త్రోవలో శీతాఫలపప్పళ్లున్నూ జీడిపప్పున్నూ తిని ఒక సెలయేటిలో నీళ్లు త్రాగినాము. కాలంగాని కాలంలో ఆషాఢమాసంలో శీతాఫలం దొరకడం అత్యద్భుతంగా కనపడి ఈ చపలత్వానికి నన్ను పురికొల్పింది. రాత్రికి జ్వరం ప్రారంభించింది. ఆ సత్రంలో రెండు లంఘనాలు చేసి మూడోరోజున పథ్యం పుచ్చుకొన్నాను. ఆ సత్రం అడవిలో వుంది. గోవిందపురం అక్కడికి రెండు మైళ్లలో వుందట. ఆ సత్రం పెట్టించిన పుణ్యపురుషుడు సమయానికి అక్కడనే వుండడంచేత నా అనారోగ్యం ఆయనకు తెలిసింది. అనారోగ్యంలో నున్ననూ ఏవో కొన్ని శ్లోకాలు నావల్ల ఆయన వినడంవల్ల నాయందపారమైన భక్తికలిగి అక్కడ నున్న రోజులలో నాకు ఆయన చేయించిన సదుపాయము వర్ణనాతీతము. ఒక నెలరోజులైనా అధమం అక్కడ వుండి మంచి ఆరోగ్యమును పొందిన పిమ్మట వెళ్లవలసినదని ఆయన మిక్కిలిగా నిర్బంధించాడు. కాని కోమటికి క్షణమొక యుగంగా వుంది. క్రొత్తగా కాపురమునకు వచ్చిన భార్యను వదలి వచ్చిన వాడతడు. నేను క్రొత్తగా వివాహమైన వాడనే అయినను, బ్రహ్మచారివంటివాడనే. కోమటి నాతో పాటెట్లుండగలడు?

## ఒక్కొక్కరి హస్త విశేషం !

ప్రయాణం కావడానికి మొదలుపెట్టాడు. నాకాతని సాయం వదలడం ఇష్టం లేదు. ఎట్లో మూడోరోజున పథ్యము పుచ్చుకొని బండి కుదుర్చుకొని బయలుదేరాము. ఆ రాత్రికి – పై మకాము పేరు మఱచినాను. అక్కడ కూడా సత్రం వుంది. ఆ సత్రానికి వెళ్లాలి. చులాగ్గా వెళ్లవలసిందే కాని, బండివాడు నిద్దరోతూంటే యెడ్లు వాటికిష్టం వచ్చిన రోడ్డు మార్గం పట్టాయి. మాకేం తెలుసును? ఆ రోడ్డే సరియైన దనుకొన్నాము. అది ఒక పల్లెటూరి దగ్గిరకు తీసుకువెళ్లింది. ఆపైని రోడ్డు లేదు. అప్పుడు వాణ్ణి లేపేము. లేచి చూచాడు. 'వీటి తల్లి సిగదరగా, తోవదప్పించా'యన్నాడు. 'ఇప్పుడేం చేదా'మన్నాము. 'ఈ వూళ్లో ఆగుదా'మన్నాడు. 'ఇక్కడ అన్నం దొరుకుతుందా' అన్నాను. 'బ్రాహ్మలు లే'రన్నాడు. 'వున్నవూరు తీసుకు వెళ్ల'మన్నాను. మంచిదని యేదో పొలాలత్రోవను వొక చిన్న అగ్రహారంలోకి తీస్కు వెళ్లేడు. ఆ వూళ్లో గోడలకు బదులు ముళ్లకంచెలే విస్తారం కనపడ్డాయి. వీధులు తెలియడమే లేదు. జామురాత్రికి లోపుగా అయింది. నాకు ఆకలి అపారంగా వేస్తూ వుంది. కొన్ని యిళ్లకి వెళ్లి అడిగేను కాని, భోజనా లయిపోయినా యన్నారు. ఒక యిల్లాలు మాత్రం, "నాయనా! అన్నముందికాని, యిప్పుడే చల్ది కుండలో పడేశా"నన్నది. 'అమ్మా! అది అయితే మరీ మంచి'దన్నాను. "అలా అయితే రండి నాయనా" అని వడ్డించింది. తృప్తిగా ఇద్దరమూ భోంచేసినాము. జ్వరపడి యున్న నాకు రాత్రివేళ ఆ భోజనం విధిగా జబ్బు చేయవలసిందే కాని, ఆ చేతి మాహాత్మ్యమేమో లేశమున్నూ జబ్బు చేయనేలేదు. ఆ రాత్రి ఆ యిల్లాలు అన్నము పెట్టకపోతే నేను యేమగుదునో యిప్పుడు వ్రాయజాలను.

## యోగ్యుల వూహలు కూడా వకప్పుడు లోకాపకారకాలు

ఈరీతిగా కొన్నివూళ్లలో భుక్తలగృహాల్లోనూ (తూర్పుదేశంలో అగ్రహారీకులను భుక్తలంటారు), కొన్ని వూళ్లల్లో సత్రాలలోనూ భోంచేస్తూ కొంత నడకమీదా కొంత బండిమీదా మార్గం అతిక్రమిస్తూ, త్రోవలో కొంచెం కొంచెం రోడ్డుకు దూరంగా వున్నప్పటికీ శ్రీకూర్మం, సింహాచలం, వుప్పమాక, మొదలైన క్షేత్రాలు సేవించు కుంటూ ఎట్లాగయితేనేమి తుని చేరాము. గంజాం వచ్చినది మొదలు స్వయంగా వండుకోవడం తప్పిందని యిదివఱకే వ్రాశాను. త్రోవలో చాలవఱకు సత్రాలన్నీ శ్రీ మహారాజులుంగారివే[67]. ఆ సత్రాలు సదుపాయంగా అన్నోదకా లివ్వడానికే

67. మహారాజులుంగారివి అంటే విజయనగరం రాజులు పెట్టించినవి. విజయ నగరానికి స్వతంత్రరాజ్యం హోదా పోయి జమీందారీ ఫాయా వచ్చాక మొదటి

అసలు ద్రవ్యదాత లేర్పరచి వున్నారట. కాని యిటీవల ఆ సంస్థానానికి దివాన్‌గిరీ చేసిన శ్రీ పెనుమత్స జగన్నాథరాజుగారు వక్క సత్రం తాలూకు సొమ్ముతో రెండేసి సత్రాలు పెట్టి ఆ సదుపాయం పూర్తిగా తగ్గించారని మా గురువుగారు చెప్పగా విన్నాను. నాకు ఈ ప్రయాణంలో గురువుగారు చెప్పినమాట అనుభవంలోకి వచ్చింది[68]. దివాన్‌జీ జగన్నాథరాజుగారు కూడా మహాయోగ్యుడే కాని, వారి వుద్దేశ్యం, ఏదో ఆపూట తిని వెళ్లేవాళ్లకి సదుపాయ మెందుకు? అసలు లేకపోవడం కంటే, ఇంత చారునీళ్లు అన్నం వుంటే చాలదా, అనియట. మంచి యోగ్యులకు తోచే వూహలు కూడా వకప్పుడు లోకాపకారకా లవుతాయి అన్నందులకీ సత్రాలే వుదాహరణం. దివాన్‌జీగారు వకటి రెండుచేస్తే, దానిలో గుమాస్తాలూ, వంటబ్రాహ్మలూ మరికొంత తగ్గిస్తే, తుదకు నీళ్లలో వుప్పు మాత్రం వేసి తీసిన తోటకూర, సుద్ద కల్పిన నీళ్లవంటి మజ్జిగ – ఈ రీతిగా భోజనం ఏర్పాటవుతుందని వేఱే వ్రాయనక్కఱలేదు. ఈ భోజనం అప్పుడే చూచాను, మళ్లా ఈ మధ్య నాలుగేండ్లనాడు *(1931లో)* విజయనగరం విద్యార్థులు భోంచేసే సత్రంలో చూచాను. చూడడమంటే చూడడం కాదు, తిని చూచాను. మీరీ రోజులలో సత్రభోజనాని కెందు కెళ్లారని శంకితురేమో. బొబ్బిలి పట్టాభిషేకం కృతియిచ్చి వచ్చేటప్పుడు[69] ఇదివఱలో నావద్ద చదివిన విద్యార్థులు కొందఱి కోరిక మీద

---

జమీందారు నారాయణగజపతి (పాలనా కాలం 1802–1845). రాజ్యపాలనలో చిక్కులు, అప్పులు, ఈస్టిండియా కంపెనీ వారి దాష్టీకం – వీటిలో వేగలేక కాశీలోనే ఎక్కువ కాలం గడిపేవారు. 1845లో అక్కడే మరణించారు. అప్పటినుండి విజయ నగరం వారికి కాశీతో బాంధవ్యం పెరిగి కాశీ వెళ్లే యాత్రికులకు సదుపాయంగా మార్గమధ్యంలో ఎన్నో సత్రాలు కట్టించారు.

**68.** నారాయణగజపతి కుమారుడు విజయరామగజపతి (పాలనా కాలం 1852–1879), ఆయన కుమారుడు ఆనందగజపతి పాలనాకాలం (1879–1897) కాలంలో హెడ్‌దివాన్ పెనుమత్స జగన్నాథరాజు గొప్పపాలనాదక్షుడు. ఈ ఇద్దరు రాజులూ విద్యావినోదాలతో రాజ్యపాలనపై పూర్తిగా దృష్టిపెట్టక సాహిత్యగోష్ఠులలో మునిగి తేలుతున్నా అంతా సజావుగా జరిగిపోవడానికి కారణం దివాన్ దక్షత. సత్రాలలో జరుగుతున్న ఖర్చు నియంత్రించడానికి షడ్రసోపేతంగా పెట్టే భోజనాలలో వంటకాలను తగ్గించి పొదుపు చేద్దామని చూస్తే సత్రం ఉద్యోగుల చేతివాటంతో అసలు సత్రం భోజనమంటే జనం భయపడే స్థాయి వచ్చింది.

**69.** బొబ్బిలి జమీందారుగా రాజా సర్ శ్వేతాచలపతి రామకృష్ణ రంగారావు గారికి (1901–1978) పట్టాభిషేకం 2–2–1928 నాడు జరిగింది. అప్పుడు ఒక కృతి అంకితం ఇవ్వమని వేంకట శాస్త్రి గారిని కోరగా 'బబ్బిలి పట్టాభిషేకం' పేరుతో కృతి

విజయనగరంలో ఆగవలసి వచ్చింది. ఆ విద్యార్థులు నాకోసమేదో పెద్ద ప్రయత్నం చేయబోతే, “అబ్బాయి! మీరంతా యెక్కడ భోంచేస్తే అక్కడే భోంచేస్తాను. ఒకపూట కేమిటి, మీ విద్యార్థుల పంక్తిని భోంచేయడం నాకు పరమసంతోషం” అన్నాను. దానిమీద ఆ సత్రాధికారితో చెప్పి యేదో సదుపాయం కల్పించాలని అనుకున్నారు కాని, నేను దానికీ అంగీకరించక, ‘నాపేరు చెప్పనేవద్దు. నేను వచ్చినట్టు విజయనగరంలో యెవ్వరికిన్నీ తెలియనేకూడదు, అలాగైతేనే నేను వస్తాను, లేకుంటే రానేరాను’,అని ఖండితంగా చెప్పేటప్పటికి, విధిలేక వాళ్లు అందుకే అంగీకరించారు. ఆ కారణంచేత ఆ విద్యార్థుల సత్రభోజనం నాకు అనుభవానికి వచ్చింది. ద్రవ్యదాతల లోపముందేమో అంటే, రోజు వకంటికి పన్నెండు రూపాయలు కూరలకే యిస్తారట. ఇట్టి స్థితిలో పైని వర్ణించిన రీతిగా భోజనం వుండటానికి కారణం మధ్యవాళ్ల చౌర్యమే కాక మఱేమి? ఇంకొక్క విశేషం. ఈ సత్రాధికారి ఎవరో సామాన్యుడు కాక వేదం వచ్చిన కుటుంబంలో పుట్టి వేదం చెప్పికొన్న శ్రోత్రియుడని కూడా విన్నాను. అందుకే కాబోలును, ఇంత శ్రోత్రియంగా విద్యార్థుల భోజనం వుందనుకోవలసి వచ్చింది.

ఇట్టి సత్రభోజనాల మీద మళ్లా జిహ్వా చచ్చి ఎట్లో తుని చేరినాము. అక్కడ మాకు చుట్టాలు లేరుగాని చుట్టాలవంటి వారున్నారు. వారింటికి వెడితే ఈలోపున చచ్చినజిహ్వా లేచి మళ్లా మనుష్యలోకంలో చేరదగిన భోజనం దొరికింది. ఇటీవల నెన్నెన్ని రాజయోగపు విందు లనుభవించిననూ నాటి వంకాయకూరలో శతాంశమునకు కూడ పోలవని సిగ్గువిడిచి వ్రాస్తున్నందుకు చదువరులు మన్నించాలి. ఇంకొకటి, వంట యొక్క రుచి కేవలం వండేవారియందే వుండదు, పదార్థమందున్నూ వుండదు, తినేవాడి అవస్థనుబట్టి కూడా వుంటుంది.

సరే, తునినుండి కొన్ని మజిలీల మీద పిఠాపురం వచ్చి అక్కడ సత్రంలో సహపంక్తి చేసి కావిళ్లు భుజానపెట్టి చామర్లకోటదాకా వచ్చినతరువాత కోమటి

---

అంకితం అదే రోజు ఇచ్చారని నిష్ఠల సీతారామశాస్త్రిగారు రాశారు. (చూ. బొబ్బిలి రాజావారి జీవితయాత్ర – ప్రథమ భాగము 1986). కానీ వేంకటశాస్త్రి 1931లో జరిగిన రామకృష్ణరంగారావుగారి తోబుట్టువు రాణి చెల్లయ్యమ్మ వివాహ సందర్భంలో కృతి వినిపించి అంకితం చేశారు (చూ. విక్రమ చెళ్లపిళ్ల, పు. 1, 2). పట్టాభిషేక సమయంలో పిలిచి కృతి రచించమని తాంబూలం యిచ్చారు. అలా కృతి వినిపించి తిరిగి కడియం వస్తూ విజయనగరంలో ఆగి సత్రం భోజనం రుచి చూశారు. భోజనం మాట ఎలా ఉన్నా ఎంతమంది బీద విద్యార్థులు యిలాంటి సత్రాల వల్ల చదువుకోగలిగారో భరాగో స్వీయచరిత్ర ‘ఆరామగోపాలం’ వలన తెలుస్తుంది.

ఆ కాలువ పడవెక్కి వెళ్లిపోయాడు. నేను కాకినాడద్వారా యానాముకు వెళ్లాను. యానాం ప్రవేశించకపూర్వం సమీపగ్రామం నీలపల్లె దేవాలయంలో కాశీకావిడి సహితం ఆగినాను. ఆగి యింటికి కబురు పంపిన మీదట మావాళ్లు బాజాబజంత్రీలతో వచ్చి నన్ను ఇంటికి తీసుకుని వెళ్లారు[70]. అప్పటికింకా కాశీనుండి గంగకావిడి తెచ్చినవాళ్లకీ మర్యాదలున్నాయి.

## గంగా సంతర్పణ వృత్తాంతము

ఇక్కడితో కాశీయాత్ర సమాప్తి అయినప్పటికీ దీనికే సంబంధించిన గంగా సంతర్పణ వృత్తాంతం వ్రాయడం అంత అనుచితం కాదనుకుంటాను. గంగా సంతర్పణ కొంత నా తాహతుకు ఎక్కువగా చేదామని నా సంకల్పము, ఎక్కువంటే మరేమీలేదు గాని, పిండివంట మిఠాయి చేయించాలని నా కుతూహలం[71]. యానాములో విస్తరించి విస్తళ్లు లేవుగాని, సమీపగ్రామము వింజరం వుంది గనుక నూరింటికి తక్కువ గాకుండా బ్రాహ్మణ్యము వస్తారు. ఇంకా బంధువులు వగయిరాలతో రెండువందలకు యత్నం చేయాలి. ఇది సంపన్నులకయితే లెక్కలోది కాదుగాని అప్పుచేసి త్రోవఖర్చులకు మనియార్డరు చేసిన మా తల్లిదండ్రులు భరించగలరా? కాబట్టి నేను సంపాదించాలి, నాకు మాత్రం యెవరిస్తారు? నాకివ్వరు కాని, కవిత్వానికిస్తారు. ఇంకా ఇప్పటిలాగు అప్పటికి కవిత్వమంటే ఈసడింపు కలుగలేదు అని నా తలంపు. రుద్రాక్షతావళం, దర్భాసనం, గంగాయమునాచెంబు. విభూతిపెండికట్లు, నీరుకావి ధోవతులు, నేనూ కోనసీమకు ప్రయాణమయినాము. అప్పటికి నేనే విద్యార్థిని, కాబట్టి నాకు ఒక్క విద్యార్థీ అలంకారంగా లేదు. పండితవేషానికిది మాత్రమే లోటుగాని తక్కిన లక్షణాల్లో

---

**70.** రైలులోనో, విమానంలోనో కాశీ అలా వెళ్లి ఇలా వచ్చే ఇప్పటి రోజులలో ఈ ఆచారం పూర్తిగా లుప్తమై పోయింది కానీ, 'కాశీకి వెళ్లినవాడు కాటికి వెళ్లినవాడు ఒకటే' అనుకొనే రోజులలో, 5,6 నెలలు యాత్ర చేసి వచ్చే రోజులలో కాశీనుండి తిరిగి వచ్చిన వారిని మేళతాళాలతో ఊరిబయటనుండి ఇంటికి తీసుకు వచ్చేవారు. ఈ సంపాదకుడు చుట్టపక్కాలలో, వృద్ధమిత్రులతో విచారించిన మీదట 1970 ల వరకు మా గుంటూరుజిల్లా ప్రాంతాలలో ఈ అలవాటు ఉన్నట్లు తేలింది.

**71.** శుభకార్యాలలో పది రకాల స్వీట్లు పెట్టే ఈ రోజులలో ఒక మిఠాయి విస్తరిలో పెట్టడం ఒక విశేషంగా అనిపించకపోవచ్చుకానీ, పాతరోజులలో ఒక తీపిపదార్థం చేసి పెట్టడం ఘనంగా చేయడం క్రింద లెక్క. ఇంటికి వచ్చిన అతిథికి భోజనంలోకి తీపిపదార్థం చేయడమంటే ఆయన్ని అమితంగా గౌరవించినట్లు. ఈ విశేషాలను శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి స్వీయచరిత్ర "అనుభవాలూ – జ్ఞాపకాలూనూ"లో గమనించవచ్చు.

లోపము లేశమున్నూ లేదు. మురమళ్ల పోలవరమూ, క్రొత్తపల్లె, కేశనకుఱ్ఱు, ఈ గ్రామాల్లో కొంత ప్రచారం చేశానుగాని, యేదో పది అయిదూ తప్ప త్రోవ పడలేదు. ఆపైని వృద్ధగౌతమి *(గోదావరిపాయ)* దాటి ముమ్మిడివరం ప్రవేశించాను. త్రోవలో ఊరువెలుపల కొబ్బరితోటల్లో కొందరు గృహస్థులు కాపురమున్నారు. అందులో పండిత సంప్రదాయమున్నూ కవి సంప్రదాయమున్నూ స్వతఃపండితులునూ అయిన వక్కలంక వీరభద్రయ్యగారు నన్ను బహూకరించి అక్కడ వున్నంతకాలమూ మిక్కిలి ఆదరముతో ఆతిథ్యమిచ్చినారు. గ్రామకరణం కామరాజుగారు బహు పలుకుబడి కలవాడు. ఆయన నాచేత అష్టావధానం సభ చేయించి నూటపదహార్లు ఇచ్చే వూహతో నున్నాడు. ఈలోగా ఆయన పినతండ్రి అమ్మిరాజుగారున్నూ, వెంపరాల వెంకటశాస్త్రులుగారున్నూ నన్ను పరీక్ష చేయడానికి అప్పుడప్పుడు ఏవో వారికి తోచిన శంకలు శంకిస్తూ వుండేవారు. నా స్థితి అప్పటికప్పుడే ఆలాటి సామాన్య పండితులకు లొంగేటట్టు లేదు. కౌముది ప్రధానభాగాలు అయినాయి, పరిభాషేందు చాలమట్టుకు అయింది[72]. ఇతర వ్యాఖ్యానాల్లో విశేషాలు కొన్ని తెలుసును. ఈ స్థితిలో వున్న నేను కేవల సాహిత్యం మాత్రం వున్నవారికేలా లొంగుతాను? అదిన్నీ కాక వారిరువురున్నూ విద్యావయోవృద్ధులే అయినను నన్ను అడిగే ప్రశ్నలు శుద్ధ అవ్యక్తముగా నున్నాయి.

మాదిరికి వక్కటి వుదాహరిస్తాను, దానివల్ల వారి పెద్దతనమున్నూ నా చిన్నతనమున్నూ మీకే తెలుస్తుంది. నేను అన్నపూర్ణాష్టకంలో అమ్మవారిని "మత్సద్మని స్థీయతామ్" అని కోరినాను, దానికర్థ మింతకు పూర్వం వ్రాసే వున్నాను. ఈ

---

**72.** కౌముది, పరిభాషేందుశేఖరం అని రెండుపేర్లే చెప్పారు కానీ వేంకటశాస్త్రి అప్పటికి చాలా విద్యలు పోగుచేసుకొని ఉన్నారు. కానుకుర్తి భుజంగరావు దగ్గర రఘువంశం, గోరుగంతు రామావధాన్లు వద్ద వేదం కొంతభాగం, రామడుగుల వేంకట సుబ్బరాయావధాన్లు వద్ద పరాయతపుపన్నాలు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి వద్ద కుమార సంభవం, రేగిళ్ల కామశాస్త్రుల వద్ద మేఘసందేశం, భారవిని అనంతాచార్యులు వద్ద, జంధ్యాల గౌరీనాథశాస్త్రి వద్ద బ్రహ్మసూత్రభాష్యం, ఇక అసలు గురువు చర్ల బ్రహ్మయ్య శాస్త్రి వద్ద ప్రధానంగా వ్యాకరణమే కాకుండా వారి వద్దకు పండితులు వచ్చినప్పుడు జరిపే శాస్త్రచర్చల వలన ఎన్నో శాస్త్రాలతో పరిచయం, కాశీలో ఉన్నది కొద్దికాలమే అయినా కొంత వ్యాకరణం – ఇలా సభాపూజ్యతకు కావలసిన సరంజామా అంతా సమకూర్చుకొన్నారు. వ్యాకరణం, అలంకారశాస్త్రం మీద ప్రసిద్ధ వ్యాఖ్యానాలన్నీ జిహ్వాగ్రం మీద ఉండేటట్లు కృషి చేశారు. ఇవి కాక కుమ్మరి కామయ్య వద్ద మృదంగ వరసలు, ముక్కామల జోగయ్య వద్ద సంగీతపరిచయం, కట్టు సూరన్న, సాలగ్రామ గోపాలం వద్ద ఫిడేలు పరిచయం సంపాదించారు.

స్థలంలో వారి శంక, "అబ్బాయీ, అమ్మవారిని మీయింటిలో నుండమన్నావు కదా? అయితే మీ యిల్లు తాటాకులయిల్లా? లేక పెంకుటిల్లా" అని. నా సమాధాన మేమిటంటే, "మాయిల్లు మీరన్న రెండు విధములలో నొక్కటియుగాదు, గడ్డియిల్లు" అని. పాండిత్యంతో పాటు నాకు పెంకెతనమున్నూ లోటులేదు. కనుక పెడసరంగా జవాబిచ్చాను. పైగా వయస్సుముదిరిన వారి ధోరణి యెంత పెడత్రోవ నున్నదో చదువరులు పరికింతురుగాక. దానిమీద వారు నన్ను ఏదో విధంగా గేలిచేయ మొదలిడినారు. నేను "కార్యార్థినః కుతోగర్వః" గనుక, ముందవధానం చేయవలసి వుంది, వీరితో మనకు పోట్లాట తగదు, ఇందులో వకరు సభ చేయించేవారి కత్యావశ్యకులు, ఇప్పుడేమైనా వైరస్యం కలిగితే వీరి ద్వారా కాబోయే కార్యం చెడవచ్చునని వూహించి, వారికి వోడిపోయినట్లు నటిస్తూ కాలక్షేపం చేసేవాడను.

## చందా ముష్టి

అంతలో సభ జరిగింది. నిడమర్రులో మోస్తరుగా ఏవిధమైన కమ్మీలు కృత్రిమాలూ లేకుండా దివ్యంగా అష్టావధానం పూర్తి చేశాను. సభ్యులు సంతోషించారు. గ్రామము చాలా పెద్దది. నూటపదహారు వఱకు చందా కాగితంమీద పడ్డది. వసూలు చేసి వారంలోగా సమ్మానించి పంపాలని కరణంగారి నిజమైన వూహ. ఈ స్థితిలో పినతండ్రి అమ్మిరాజుగారు, 'నీవు వసూలు చేసేదేమిటి? ఆ కాగితం ఆయనకిస్తే ఆయనే వసూలు చేసికొంటా'డని మెల్లగా ఆయన బుద్ధి తిప్పేశాడు. దానిమీద ఆయన నాకు చందాకాగితం చేతికిచ్చి వసూలు చేసి కొమ్మన్నాడు. నాకు పట్టరాని కోపం వచ్చింది. అవసరాన్ని బట్టి దిగమ్రింగినాను. వసూలుకు తిరగడానికి మొదలుపెట్టాను. స్నానసంధ్యాద్యనుష్ఠానాలు ముగించుకొని బయలుదేరి వెళ్లాటప్పటికి వక గృహస్థును చూడడం అయ్యేది. అంతలో భోజనానికి కనిపెట్టుకుంటారని బసకు రావలసివచ్చేది. ఆ వెళ్లే యిళ్లు అక్కడా అక్కడా కొబ్బరి తోటల్లో వున్నాయి. చాలవఱకు రాజుల పద్దులే. ఆ రాజులెవ్వరో తప్ప పొలాల్లో కాపురమున్నవారే. కౌశికకు *(గోదావరిపాయ)* ఈవలి యొడ్డుకంటె ఆవలి యొడ్డున నెక్కువగా నున్నాయి. బాడీబందతో *(బాగా బురుదగా అడుసులాగా ఉంది అనే భావాన్నిచ్చే జాతీయం)* వున్న ఆ కౌశిక మాటిమాటికి దిగడం, వెళ్లడం, అక్కడ పులిచార్ల కుక్కలు కఱవరావడం, ఎవరో వారించడం, ఈలాటి చిక్కులతో ఎట్లో ముప్పది రూపాయీల పై చిల్లర వసూలు చేశాను. అంతలో విసుగు పుట్టింది. భోజనం చేసి పరుండడంతోటే ఒక ఆలోచన పుట్టింది. 'ఈలా తిరిగి ముష్టెత్తుకొనే యెడల సభచేయడం యెందుకు? అసలాయన మంచివాడయినా పినతండ్రిగారి

దుర్బోధవల్ల ఆయన బుద్ధి చెడిపోయింది, గంగా సంతర్పణకు ఈవూరు కాకపోతే ఇంకోవూరవుతుంది, ఏలడానికి వూళ్లు లేకపోవచ్చు గాని, యెత్తుకు తినడానికి వుండకపోవు, 'సాహసేలక్ష్మీః' అన్నాడు' అని లేచి, దర్భాసనం కట్టి, నన్ను మిక్కిలిగా ఆదరించుచున్న వీరభద్రయ్యగారి వద్దకు వెళ్లి, నా మనస్సులో వుదయించిన కోర్కె యిట్టిదియని యథార్థం చెప్పి, ఈ సందర్భం కొద్దిరోజులవఱకూ యెవరికీ తెలియనీయవద్దని కూడా ఆయనతో మనవిచేసి, ఇదివఱలో వసూలైన సొమ్ము ముప్ఫై రూపాయల పై చిల్లరయున్నూ అణాపైసలతో గంగాయమునాచెంబులో పోసికొని, హోరున వర్షం కురుస్తూ వుండగా బయలుదేరి, గ్రామంలోకి వచ్చి కరణంగారిని మామూలుగా దర్శించినట్టే దర్శించి, ఏదో పిచ్చాపాటీ మాట్లాడి, "అయ్యా, ఈరోజున మధ్యాహ్నము నేను పరున్నప్పుడు నిద్రలో మీ గ్రామములో కేశవస్వామివారు కలలో కన్పడి, 'ఏమిరా! నీ కవిత్వసంపాదన ప్రస్తుతం మరమ్మత్తగుచున్న నా ఆలయాని కివ్వలేవుట్రా?' అని వీపుమీద చరిచినట్లయింది, నేను చేసే కార్యమేనా గంగాసంతర్పణగదా, అదిన్నీ దేవతాకార్యమే, ఇదీ దేవతాకార్యమే కనుక ఈ అవధానసభ నూటపదహారున్నూ ఆలయానికి అర్పణ చేశాను, ఇదుగో వసూలైన మట్టుకు సొమ్ము మీకు ఇస్తున్నాను, తక్కినది యావత్తూ శ్రద్ధగా వసూలు చేసి స్వామివారి గుడికి సమర్పించవలసింది" అని అధికారంతో ఆయనకు విధించి, ఆ వర్షంలోనే అయినాపురం గ్రామానికి ప్రయాణమై గుబ్బగొడుగు విప్పుతూవుండగా పాపము, ఆ కామరాజుగారు నేనెంత గంభీరంగా మనోవికారాన్ని తెలియనీయకపోయినా, లౌక్యుడు కనుక, అనుమానపడి, "ఈ పూటమట్టుకు మా యింట ఆగి వెళ్లండి, వర్షము, త్రోవలో చిక్కుపడతారు," అని మిక్కిలిగా బ్రతిమాలినాడు. నేనూ వినయంగానే, "నాకు సెలవియ్యండి, సంతర్పణకు ఏర్పరచుకొన్న రోజు దగ్గఱకు వస్తూ వున్నది" అని మాట్లాడుతూ ప్రయాణం చేశాను.

ప్రొద్దు గ్రుంకేటప్పటికి అయినాపురం ప్రవేశించాను. ఎవరో గృహస్థులింట దర్భాసనం దింపాను. వచ్చిన సంగతి చెప్పాను. ఆ గృహస్థు, 'ఇక్కడ ప్రస్తుతం వున్న డెల్టా సూపరింటెండెంటుగారు బహుయోగ్యులు, పండితులంటే ప్రాణమిస్తారు' అని చెప్పి, వారిబసకు వెంటబెట్టుకొని తీసుకువెళ్లేరు. నన్ను ఆయన మిక్కిలి గౌరవించి, భోజనాలయిన తరువాత ఆ రాత్రే అష్టావధానసభ జరిగించి గౌరవించాడు. మరునాడు సాయంకాలంలోగా యేభై అరవై చాపులు, రమారమి నూరు రూపాయిలు తటస్థమయినాయి. వెంటనే గిర్రున మళ్లీ యింటికి వచ్చి,

గంగాసంతర్పణ జరిగించుకొని, పెండ్లి అయిన కొద్ది రోజులలోనే కాశీ వెళ్లడంచేత తరువాయిగా వున్న మనుగుడుపు నిమిత్తం అత్తవారింటికి వెళ్లి, అక్కడినుంచి తిరిగి గురువుగారి వద్దకు వెళ్లి వారి వద్దనే వ్యాకరణం తరువాయి తిరుపతిశాస్త్రితో సహాధ్యాయిత్వమును గైకొని చదివితిని. ఇదివఱకు తిరుపతిశాస్త్రి నాతో విశేషమైత్రిగా వుండకున్నను, కాశీ వెళ్లి వచ్చినది మొదలు అవధానాది కారణములచే నాపేరు కొంత పైకి రావడం మొదలుపెట్టడం చేత, విశేషమైత్రిగా వుండ మొదలిడినాడు. కాని మధ్య మధ్య పోట్లాటకూడా ఆడుతుండేవాడు. అంతట్లో మా తల్లిదండ్రులు త్రోవఖర్చులకోసం అప్పుచేసి పంపించిన ముప్ఫై రూపాయలు తీర్చుకోవలసి నేనెక్కడికో సంపాదనకు బయలుదేరబోవుచుండగా, గురువుగారు, "అబ్బాయీ! నీకు యితడుకూడా వుంటే చాలా శోభగా వుంటుంది, గనుక ఇతన్ని కూడా తీసుకు వెళ్లవలసింది" అన్నారు. వారు ఈలా సెలవిచ్చేటప్పటికి, నాకూ తిరుపతిశాస్త్రికీ యేవో మనఃకలహాలున్నాయి[73]. దానిమీద నేను "ఆతడు వస్తే నా అభ్యంతరం లే"దన్నాను. "రాకేం చేస్తాడు, తప్పకుండా వస్తా"డని గురువుగారని, "ఏమయ్యా, అతడూ నువ్వూ కలిస్తే బాగావుంటుం"దన్నారు. మంచిదన్నాడు, వచ్చాడు. కాకినాడ వెళ్లేము. అక్కడ జరిగిన శతావధానం[74] వగయిరా జాతకచర్యలో వున్న విషయమేకదా!

---

**73.** మనఃకలహాలంటే ఏవోకావు. తిరుపతిశాస్త్రి, వేంకటశాస్త్రి గురువుగారు చేసే గణపతి ఉత్సవానికి కావలసిన డబ్బు కోసం గ్రామాలు తిరుగుతున్నప్పుడు ఆదరణ వేంకటశాస్త్రికే ఎక్కువగా ఉండేది. తిరుపతిశాస్త్రి పద్యపఠనం చేసేటప్పుడు శ్రోతలు ఆయనని ఆపమని వేంకటశాస్త్రిని చదవమనడం తిరుపతిశాస్త్రికి కష్టంగా ఉండేది. అందుకని వేంకటశాస్త్రి చెప్పిన ఒక పద్యంలో ఉపమానం సరైనది కాదని తిరుపతిశాస్త్రి మడతపేచీకి దిగారు. అది ముదిరి ఇద్దరూ కొట్టుకున్నారు. "అంతు చూస్తా" అనే దాకా వ్యవహారం వచ్చింది. అవే మనఃకలహాలు. కానీ వాటిని విద్యార్థిదశలో ఎంతో ప్రతిష్టాకరంగా తీసుకుంటారు కదా. అలా ఉప్పునిప్పులాగా ఉండేవాళ్లు పాలూతేనెలాగా కలిసిపోయారు.

**74.** 1891లో జరిగిన కాకినాడ శతావధానం తిరుపతివేంకటకవుల మొదటిప్రదర్శన. అందులో వారు చెప్పిన పద్యాలలో వ్యాకరణదోషా లున్నాయని పెద్దపండితులు కూడా శంకించారు తిరుపతివేంకటకవులు నోరు మెదపకుండా అవి నిజంగా తప్పులే అని అందరికీ అనుమానం వచ్చేటట్లు ప్రవర్తించారు కావాలని. శతావధానం చివరిలో ప్రధాన సభకు ముందు జరిగిన ఉపసభలో ఆ శంకలన్నింటినీ పూర్వమహాకావ్యాల ప్రయోగాల సహాయంతో ఎగరగొట్టారు. నిండా 20 యేళ్లులేని కుర్రవాళ్లు దిగ్గజాల వంటి పండితులను ఓడించడంతో నాటినుండి వారికి ప్రభ ఎత్తుకొంది. అందుకు ఆ సందేహాలు లేవనెత్తిన పండితులకు కృతజ్ఞతలు చెప్పుకొన్నారు వేంకటశాస్త్రి ఒక వ్యాసంలో.

ఈ కాశీయాత్ర మాత్రము జాతకచర్యలో లేనిదా అంటే, ఉన్నదే కాని, విస్తరింపవలసిన పుణ్యగాథ కనుక, నేనీమధ్య షష్టిపూర్తి జరిగినది మొదలుకొనిన్నీ, అంతకు పూర్వం నుంచిన్నీ, మిక్కిలి జబ్బుస్థితిలో వుండి, నిన్న నేటినుండి కొంచెం తేరుకుంటూ, ఈ రచన యిహపరసాధకమని చెప్పి దీనిని కొంత విస్తరించి వ్రాశాను. కాకినాడ, అమలాపురం వగయిరా అవధానములకున్నూ కాశీయాత్ర కున్నూ సంబంధముండ నేరదు గనుక, వాటిని గూర్చి యిందు వ్రాయవలసింది లేదు. ఒక్కటి మాత్రం వ్రాసి తీరాలి. ముమ్మిడివరం కరణం మాచిరాజు కామరాజుగారు మేము అమలాపురంలో గొప్పగౌరవములు పొందుచూవున్న సమయంలో వచ్చి, వెనుక జరిగిన లోటు తీర్చుకొనే వుద్దేశ్యంతో వక పర్యాయం వారిగ్రామం రావాలని మిక్కిలి బలవంతంగా కోరారు. ఆయన యోగ్యతను బట్టి త్రికరణయా వెళ్లాలనే నేను అనుకొన్నాను గాని, యెందుచేతనో సాగిందికాదు. “బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా”.

ఏ గురువుగారి వద్ద చదువుకొంటూ, తీరికూర్చుని అయితే నేమి, నేను కాశీకి వెళ్లానో, మళ్లా ఆ గురువుగారి దగ్గఱకు వచ్చాను గనుక, ఇక దీన్ని ముగించుట యుక్తంగా వుంటుంది, యీ కాశీయాత్రన్నది నా జాతకరీత్యా, చంద్రమహా దశలో శుక్రాంతరంలో తటస్థించింది. వివాహం కూడా దానిలోనే. జాతకవిషయం తెలిసినవారికి, ఆయీ విశేషాలు ఏయే గ్రహస్థితులను బట్టి సంఘటించాయో తెలిసికొనే నిమిత్తం, నా జాతకం కూడా వుదాహరించి మఱీ ముగిస్తాను. ఈ శుక్రాంతరం విరోధి *(1889)* సం॥ వైశాఖ బహుళ త్రయోదశి మొదలుకొని, వికృతి *(1890)* సం॥ పుష్య బహుళ త్రయోదశి వఱకును అని తెలియగోరినాను. వివాహము జరిగినరోజు ఇదివఱలో వ్రాసియేయున్నాను. కాశీకి బయలుదేరినది పుష్యశుద్ధ తదియ యని జ్ఞాపకము. అటనుండి దేశానికి వచ్చినది ఆషాఢమాసము. కోనసీమకు సంపాదనకు వెళ్లినది భాద్రపదమాసము. వివాహం నాటికి నా వయస్సు పందొమ్మిదిసంవత్సరముల మూడుమాసముల యిరువదియొక్క రోజులు. కాశీప్రయాణం నాటికి ఇక నొక్కమాసం కలుపుకొంటే సరిపోతుంది. ఇంత డిటైలుగా యెందుకు వ్రాస్తున్నానంటే, నా జాతకమందు కొంత యితర పాపగ్రహ సంబంధం వున్నప్పటికీ శతమంజరీ యోగాలలోని “కుసుమయోగము” అనే మొట్టమొదటియోగము పూర్తిగా పట్టింది. ఆ యోగము పట్టిన జాతకమునకు ఇరువదియేండ్లు దాటిన తర్వాత యోగమారంభ మవుతుందని దైవజ్ఞులు వ్రాశారు. దానికి తథ్యంగా, కాకినాడలో సంపూర్ణ శతావధానం చేసి పెద్దగా గౌరవము

పొందినది ఖర *(1891)* సం॥ ఆశ్వయుజ బహుళములో గనుక, అప్పటికి నా వయస్సు ఇరువదియొక్క సంవత్సరమూ రెండుమాసములపై చిల్లర అగుటచే జాతకము చక్కగా దృష్టాంతం ఇచ్చినట్లే తజ్ఞులు అనుకోవచ్చును. ఈ కాకినాడ అవధానం నాటికి కుజమహాదశలో కుజాంతరం జరుగుతూ వున్నది. యత్కించిద్యోగము కాశీప్రయాణానికి ముందే ఆరంభమయింది కనుక చంద్రునిలో శుక్రాంతరంలోనే యోగానికందిచ్చినట్టున్నూ, దానిని కుజుడు ప్రబలం చేసినట్టున్నూ అనుకోవచ్చును. కుసుమయోగాన్ని వుదాహరించి, యిక దీనిని ముగిస్తాను. జాతక చక్రములు జాతకచర్యా గ్రంథమున చూడగోరెదను.

## కుసుమయోగము

శ్లో॥ లగ్నా త్సప్తమగే చంద్రే, చంద్రాదష్టమగే గురౌ,
గురుణా సంయుతే లగ్నే, యోగః కుసుమ సంజ్ఞితః ।
కుసుమాఖ్యేతు సంజాతో భూపాలో బంధురక్షోః
వింశత్యబ్దాత్పరం గ్రామపురకర్తా భవిష్యతి ॥

ఇంత చక్కగా ఋజువిచ్చుచున్ననూ, ఇప్పటివారనేకులు జాతక విషయమున విశ్వాసము లేనివారుగానున్నారు.

## అపసవ్య చక్రము

ప్రమోదూత సం॥ శ్రావణశుద్ధ ద్వాదశి సోమవారం, (*8-8-1870*) రాత్రి 25-8 విగడియలవేళ, మిధునలగ్నమందు జననము.

లగ్నభుక్తి 3-45 శేషం 1-30 పూర్వాషాఢా చతుర్థచరణభుక్తి పోగా శేషము 14-21. ఋక్షాద్యంతము 57-50. పాదప్రమాణం 14-27. జననకాల శుక్రమహాదశాశేషము సం 4-మా11-రో16.

జాతక పరిశీలకులకు ఈ చూపిన ఆధారములు చాలునుగాన విస్తరింపను.

ముమ్మిడివరంలో వితండవాదం మొదలుపెట్టిన పండితులకు నేను లిఖిత పూర్వకంగా యిచ్చిన సదుత్తరమును లిఖించి విరమిస్తాను.

"మత్సద్మనిస్థియతా మిత్యత్ర, అన్నపూర్ణాంబికాయా భక్తగృహనివాసోక్తి ర్నదోషాయ, కుతః, తస్యాభక్తపరాధీన త్వాత్, తథాచ, శ్రీసూక్తే, 'మమవసతుగృహే సర్వమాంగళ్యయుక్తే' త్యుక్తత్వాచ్చ".

ఇందింకనూ మఱికొన్ని శంకాసమాధానాలున్ననూ విస్తరభయముచే దిఙ్మాత్రముగా నుదాహరించి విరమించుచున్నాను. ఇదేనా, మీ యిల్లు

తాటాకులిల్లా? పెంకుటిల్లా? అంటే, బెడిదంగా రెండూ కాదు గడ్డియిల్లని మాత్రమే జవాబు చెప్పానంటే, చదువరులు నిజమైన జవాబేమి అని అనుకోక మానరని వ్రాయవలసి వచ్చింది. అప్పుడు యానాములో మేము కాపురమున్న యిల్లు గడ్డిల్లయిన మాటా సత్యమే. జాతకచర్యలో ఏవోకొన్ని పంక్తులలో టూకీగా వుదాహరించిన నా కాశీయాత్ర పూర్తిగా కాకున్ననూ కొంత విస్తరించి వ్రాస్తే ఇంత పెరిగింది. ఇంకా ఇందులో బుచ్చిమనుమరాళ్ల పెండ్లి వగయిరాలు వ్రాస్తే యెంత పెరిగేదో! కొంతమంది పండితుల నామములు మాత్రం ఇందు ఉదాహరించినాను. ఇంకా యెందఱినో వ్రాయవలసివున్నది. అందు మా గురుపరంపర మట్టుకు వ్రాసి విరమిస్తాను. కాశీనాథశాస్త్రులుగారు, వీరి శిష్యులు రాజారామశాస్త్రులుగారు (వీరు శ్రీ భాగవతుల హరిశాస్త్రులవారికి సహాధ్యాయిలు), వీరి శిష్యులు మా గురువులు శ్రీ చర్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారు. అస్మచ్ఛ్రీ గురుచరణారవిందాభ్యాం నమోనమః.

**సమస్త సన్మంగళాని భవంతు**



*క్రీ.శ. 1890 లో కాశీ విశ్వనాథ మందిర గోపురం*

# సిగ్గూ - బిడియమూ

సిగ్గూ, బిడియమూ అంటూ సర్వసామాన్యంగా వాడుకొనేదాన్ని గూర్చి కొంచెం వ్రాస్తాను. యీ రెండుమాటలూ పృధక్కుగా వాడుకుంటూ వున్నట్టు కనపడినా అర్థం మాత్రం వకటే. యీలాటివి చాలా శబ్దాలు పునరుక్తిప్రాయంగా కనపడేవి మన వాడుకలో వున్నాయి. మఱొకప్పుడు వాట్లనుగురించి మాట్లాడుకుందాం. యీ సిగ్గుబిడియాలను సంస్కృతభాషలో "హ్రీ" మొదలైన కొన్నిశబ్దాలతో వ్యవహరిస్తారు[1]. అందులో "హ్రీ" అనేది సాక్షాత్తూ పరదేవతా ప్రీతికరమైన మంత్రబీజాక్షరం. ఆ కారణం చేతే అనుకుంటాను, తద్వాచ్యమైన యీ సిగ్గును పరదేవతా స్వరూపాల్లో దేవీభాగవతంలో చేర్చినట్టు తోస్తుంది. ఈ సిగ్గును విశేషించి పాటించడం గొప్పగొప్ప మర్యాదకుటుంబాలవారిలో కనపడుతుంది. స్త్రీలకు అన్ని భూషణాలకన్నా యీ సిగ్గునే యెక్కువ భూషణంగా కవులు వాడివున్నారు. అనుభవంచేత చూచినా మన భారతీయులలో యీ సిగ్గు అలాటి భూషణంగానే కనపడుతుంది. దీన్ని వర్జించి సంచరించేవాళ్లు మనదేశపు స్త్రీలలో వుండనేవుండరు సరికదా, పురుషులలో నున్నూ వుండరు. కాని పురుషులు పాటించేరీతి వేఱు, స్త్రీలు పాటించేరీతి వేఱున్నూ అని అందఱున్నూ యెఱిగిందే కనక విస్తరించేది లేదు. దీన్ని వదిలిపెట్టిన వ్యక్తికి చేయరానిపని అంటూ వుండనేవుండదని అభియుక్తులు చెపుతారు.

**"లజ్జా మేకాం పరిత్యజ్య త్రిలోకీవిజయీ భవేత్"** అనే వాక్యాన్ని తఱుచు పండితులు వాడుతూ వుంటారు. సిగ్గువదిలి పెట్టినవాడు యీ లోకాన్ని మాత్రమే కాదు మూడులోకాలనీ కూడా జయిస్తాడని దాని తాత్పర్యం. అంటే? వాడికి విధినిషేధా లంటూ వుండవుకనుక వాడు అన్నిటికి సిద్ధపడతాడని తేలింది. శ్లోకంలో – "విజయీ" అని పుంలింగ నిర్దేశం చేసినా స్త్రీలక్కూడా అది సంబంధించవలసిందే. బొత్తిగా బీదతనంలో వున్న స్త్రీలుకూడా జరిగినంతలో యీ సిగ్గును ముఖ్యవిషయాల్లో

1. హ్రీ, లజ్జ, ఆపత్రప, వ్రీడ, మందాక్షమ్, షండ అనేవి సిగ్గుకు పర్యాయపదాలని సర్వానందుని రత్నకోశమ్ చెబుతున్నది.

పాటిస్తూనే వున్నారు. జరుగుబాటు యెక్కువగా వున్న గౌరవ కుటుంబాలలో దీన్ని యెంత గౌరవిస్తారో చెప్పనే అక్కఱలేదు. ఘోషా వగయిరా మర్యాదల కన్నిటికీ యీ సిగ్గే మూలకందం. అట్లని ఘోషానియమం లేని కుటుంబాలలో దీన్ని పాటించడం లేదనుకోవడానికి అవకాశం లేదు – "సలజ్జా గణికా నష్టా నిర్లజ్జేవ కులాంగనా" అనే వాక్యం వల్ల వేశ్యలకు లజ్జ వుంటే వృత్తి, నాట్యాభినయాలు వగయిరా బాగా సాగవని అన్నాడేకాని వుండదని అనలేదు. కాబట్టి వాళ్లకుకూడా వున్నట్టే తేలుతూ వుంది. స్త్రీమాత్రసహజమైన దీన్ని వేశ్యలుమాత్రం వదలడం యెలాగ? యీ సిగ్గనేది పురుషసాన్నిధ్యంలో స్త్రీలకున్నూ, స్త్రీసాన్నిధ్యంలో పురుషులకున్నూ మాత్రమే కాదు స్త్రీ సాన్నిధ్యంలో స్త్రీలకున్నూ, పురుషసాన్నిధ్యంలో పురుషులకున్నూ కూడా వుంటుంది. అందచందాల మాటలా వుండగా శీతబాధలేని వుష్ణదేశాల్లో మండువేసంగిలో ఆ పూటకు గతిలేని స్త్రీపురుషుల దగ్గఱనుంచీ యేమాత్రమో వస్త్రధారణం చేయడానికి యీ సిగ్గే కారణం. సావిత్రి – "మనమున గైకొన్నభర్త మానందగునే" అని అనడానికి కూడా కారణం యీ సిగ్గే అనుకుంటాను. యితరులకు తన మనస్సులో వరించిన సత్యవంతుని విషయం తెలియక పోవచ్చుగాని తన అంతరాత్మకు తెలియకుండా వుంటుందా? అనేదే యిక్కడ ముఖ్యాంశం. ఆపై లోకోత్తరయైన పరమపతివ్రత కావడానికి యీ "హ్రీ" అనే మంత్రబీజాక్షరమే, అంటే దీన్ని మానసికంగా పురశ్చరణ చేయడమే ముఖ్య కారణంగా భావించాలి. సీత త్రిలోకాధిపత్యాన్ని తృణీకరించింది కూడా యీ సిగ్గుకు లోబడియ్యేవే కాని స్త్రీ సహజమైన యీ సిగ్గును వీడి రావణునితో పురుషుడికన్నా మిన్నగా ధిక్కరించి యేలా మాట్లాడిందంటారేమో? అదికూడా సిగ్గును కాపాడు కోవడానికి చేసిన ప్రయత్నమే కాని అన్యం కాదు. ఆమె అప్పుడు మహావిపత్తులో వుంది – "ఆపత్కాలే నాస్తి మర్యాదా" అనే అభియుక్తోక్తి అప్పుడు ఆమెకు వుపాదేయం అయింది. అక్కడికీ అడ్డుగా వక గడ్డిపఱకను మధ్యగా పడేసింది. యీ సిగ్గు లేకపోవడం చేతనే రావణుడు పుత్రమిత్రకళత్రాదులతో నశించి పోవలసివచ్చింది. త్రిలోకీజేత సిగ్గును వదిలిపెడితే అవుతాడన్న మాటకు ప్రస్తుత వాక్యం విరోధించిందంటారా? ఎందుకంటారు? అనరు. ఆమాటకర్థం వేఱని యెఱగనివా రెవరు? మూడు లోకాలున్నూ బాహుపరాక్రమంచేత జయించిన మహాయోధుడు రావణుడు తుదకు సిగ్గుమాలిన పనికి అగ్గమై కూకటివేళ్లతో నశించాడంటే వేఱే చెప్పవలసిందేమిటి? రావణుని సిగ్గుమాలినతనాన్ని వివరించనక్కఱలేదు. అయినా కొంచెం వివరిస్తాను. సీతకు మొదట తనయందు అనురాగం వుందో లేదో తెలియక –

తే.గీ. బలవిహీనుని కన్యనిభార్య యంచు
దనకళత్రం బటంచు భేదంబుగాని
సొగసుగల దెల్ల దనచేతిసొమ్మె కాక
బలము గలిగినవాని కేర్పాటు కలదె

అనే ముట్టితోపుడుబలాన్ని పురస్కరించుకొని బలాత్కారంగా, దొంగతనంగా తీసుకు వచ్చినా తరువాత ఆపై చేష్టలవల్ల యథార్థం తెలిసింది కనక సిగ్గు కలవాడే అయితే రావణాసురుడు ఆపె సాంగత్యాన్ని అభిలషించేవాడే కాదు. అదిలేని మోట మొద్దు స్వరూపం కావడంచేతనే కూకటివేళ్లతో నాశనం కావలసి వచ్చింది.

సిగ్గనేది తరచు కవులు శృంగార రసాంగంగా మాత్రమే వర్ణిస్తూ వచ్చారు. కాని యే రసమూ లేని విషయాల్లోకూడా దీని ప్రసక్తి కనపడుతుంది. యెవరిదగ్గితేనా నాలుగుడబ్బులు అప్పు తెచ్చుకుంటే ఆ అప్పు తీర్చేదాకా ఆ ఋణదాత మొఖం చూడడానికి సందేహించేవాళ్లెందఱో నాచిన్నతనంనాటికి వుండేవాళ్లు, యిప్పుడున్నూ వుంటారు. కాని క్రమంగా రూల్సులు ప్రబలిన తరువాత, ప్లీడర్లు విస్తరించిన తరువాత ఋణప్రదాత అప్పునుగూర్చి కదిపితే వకటి రెండుసార్లు 'అప్పుడిస్తాను, యిప్పుడిస్తా' నంటూ బదులు చెప్పడమున్నూ, మూడోసారి అడిగేటప్పటికి కళ్లెఱ్ఱ చేసి "కావలిస్తే దావా చేసుకో" అనేదగ్గఱికి మాత్రం వచ్చింది ప్రపంచం. కాని అప్పుడు కూడా కాలదోషం పట్టిన నోట్లు కూడా తీర్చిన మహానుభావులు కొందఱుండేవారు[2]. బందరులో భైరవప్రెస్సువారికిన్నీ, నాకున్నూ యిచ్చిపుచ్చు కోవడాలు వుండేవి. కాని యెన్నోసార్లు కాలదోషం పట్టడమున్నూ వుండేది. కాని వారెన్నడూ తుటాయించనే లేదు. ఆ రోజుల్లో రచించిన గుంటూరిసీమలో "నోటుకు కాలదోష మది నోటికి లేదు" అని వ్రాయడం పైసందర్భాన్నే గూఢంగా సూచిస్తుంది. యీలాటివారి కందఱికి పరలోకభీతికంటే కూడా యిహలోకంలో కలిగే సిగ్గే ఆయీ యోగ్యతకు ముఖ్యకారణమనుకోవాలి. వక సంపన్నగృహస్థు నా చిన్నతనంలో దివాలా తీసి ఫ్రెంచిగ్రామం–యానాం ప్రవేశించాడు. ఆ వూళ్లోనే నివాసంగా వుండేవాడు. దివాలా తీసినా సంపన్నుడుగానే వుండేవాడు కాని తలెత్తుకుని మాత్రం సంచరించినట్లు లేదు. అందఱున్నూ ఆయన యింటిపేరుతో ఆయన్ని వాడక యింటిపేరు స్థానంలో – దివాలా పదాన్ని చేర్చి వాడుకునేవారు. కొందరు యెట్టయెదుటకూడా ఆ పేరుతోటే పిల్చేవారు. పాపం! యేమీ

**2.** ఇటువంటి ఒక హృదయంగమమైన, చదివి తీరవలసిన ఒక ఘట్టం. దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి స్వీయచరిత్రలో ఉంది. (పు. 106–112 రచయితల సహకార సంఘము – గుంటూరు ప్రచురణ, 1976)

అనేవాడుకాదు. యెందఱో అనాథలు ఆయనవద్ద వడ్డీలేని పద్ధతినో, స్వల్పవడ్డీ యిచ్చే పద్ధతినో దాచుకున్నవాళ్లు చెడిపోయారని చెప్పుకునేవారు. కాని కలియుగ మవడంచేతనో యేమోకాని ఆ సంపన్నగృహస్థు దోసతోటలాగ అభివృద్ధిగానే వుండేవాడు గాని బుద్ధిపూర్వకంగా చేసిన దుష్కృత ఫలితాన్ని అనుభవించినట్టు మాత్రం లేదు, కాని సిగ్గుతోనే సంచరించేవాడు. దీన్ని బట్టి చూస్తే "ఋణస్య దానస్య న కించిదంతరం", కనక అప్పు తీర్చడం అనవసరంగా కనపడుతుంది. యెక్కడో యీలాటివాడొకడుంటే వుండనివ్వండి గాని ఆ రోజుల్లో ఆ సిగ్గు అంతతో నిల్వనిచ్చేది కాదు. యేలాగో ఋణదాత కాళ్లూ, కడుపూ పట్టుకొని తృణమో దుగ్గాణో యిచ్చి బాకీ లేదనిపించుకొనే వఱకూ వూరుకోనిచ్చేదే కాదు. అందుచేత సిగ్గనేది ఋణాలు యెగబెట్టనిచ్చేది కాదు. అందుచేత సిగ్గనేది ఋణాలు యెగబెట్ట నివ్వని మహాగుణంగా మనం జమకట్టుకోవచ్చు ననుకుంటాను.

నాకు సుమారు నలభైయ్యేళ్లు వచ్చేనాటికి దివాలాలు విస్తరించాయి[3]. ఆ రోజుల్లో నేను బందరులో వుండేవాణ్ణి. సెలవులలో అప్పటి నివాసగ్రామమవడం చేత దివాలాకోర్లకు శరణ్యంగా వుండే యానాం వెళ్లడం తటస్థించేది. అప్పుడు యింకో సంపన్నగృహస్థు చిన్నదివాలా తీసి యానాం ప్రవేశించాడు. చిన్నతనములో నేనూ అతడూ నీలపల్లి స్కూల్లో వకటే తరగతిలో చదువుకొన్న స్నేహాన్ని పట్టి నన్ను చూడడానికి వచ్చాడు పాపం. ఆ సమయానికి వక పెద్ద జ్యోతిష్కుడు జాతకభాగంలో మంచిప్రజ్ఞకలవాడు నా దగ్గిఱ వున్నాడు. నేనూ ఆయనా జాతకవిషయాలు మాట్లాడుకుంటూ వున్నాం. ఆనా బాల్యస్నేహితుడు తన జాతకాన్ని కాగితంమీద వేసి ఆయన చేతికిచ్చాడు. ఆయన కుండ పగలగొట్టినట్లు వున్నదున్నట్టు చెప్పడమే కాని బొత్తిగా లౌక్యం మర్యాద పాటించే స్వభావం కలవాడు కాడు. ఆ కారణంచేత వున్నదున్నట్టుగా చెప్పడానికి మొదలెట్టాడు. ఆ రీతి కొంచెం వివరిస్తాను. మొట్టమొదటే 'శ్రీమతే పేడదేవ్యై నమః' అన్న మాదిరిగా "నాయనా! నీవిచ్చిన జాతకం యెవరిదోకాని యిది నిజమైన జాతకమే అయితే యీ జాతకుడు సంవత్సరం క్రితమే చచ్చిపోవలసి వుంటుంది. నీవు పరీక్ష కోసం నాచేతి కిచ్చినట్టు తోస్తుంది. యిలాటిపని యెప్పుడుగాని చేయవ"ద్దని మందలించాడు. దానిమీద ఆ గృహస్థన్నాడు కదా "అయ్యా! యీ జాతకం నాదేనండి" అన్నాడు. "నీదే

---

**3.** 1910 నుండి ఆంధ్రప్రదేశ్‌లో దివాలాలు ఎక్కువయ్యాయి. దివాలాలు, అప్పులు ఎగబెట్టడం గురించి, అలాంటివారు ఎలా ఆలోచిస్తారో, అలాంటివారికి వకీళ్లు ఎలా కొమ్ముకాస్తుంటారో 1915–25 మధ్య ప్రచురించిన పానుగంటివారి సాక్షి వ్యాసాలలో ఎన్నో చోట్ల విసుర్లు కనబడుతుంటాయి.

అయితే నీ వెందుకు చచ్చిపోలేదో చెప్పవలసిం"దని జ్యోతిష్కుడు నిర్బంధించాడు. యిదేమిట్రా అని నాకు ఆశ్చర్యం కలిగింది. అతడు దివాలా తీసినట్టు నాకుగాని, జ్యోతిష్కుడికిగాని లేశమూ తెలియదు. అతనితో వచ్చిన వక మనిషి మెల్లిగా విచారసూచకంగా యుక్తియుక్తంగా "సంవత్సరం క్రితం యిలాటి చిక్కు వచ్చిం"దంటూ తేల్చాడు. దానితో జ్యోతిష్కుడు "నీవు చస్తేనే ఇంతకన్న మేలు" అంటూ చీవాట్ల కారంభించేటప్పటికి ఆ సంపన్న గృహస్థు పాపం! యెంతో బాధపడ్డాడు. నాకున్నూ యెంతో సిగ్గేసింది. జాతకుడికి లోలోపల కోపం కూడా వచ్చిందేమో కాని స్వయంగా జాతకం చేతికిచ్చి అడగడం చేత యేమీ అనలేక పోయాడు. యింతకూ జ్యోతిష్కుడు ఫలాపేక్షకు సంబంధించినవాడు కాడుకూడాను. అందుచేత పృచ్ఛకుల ఆగ్రహానుగ్రహాలతో ఆయనకు అవసరం లేదు.

ఈ జాతకభాగంలో పనిచేసినవారు తఱచు మంచినే చెపుతూ వుంటారు. చెడ్డను చెప్పే యెడల గతించినదాన్ని మాత్రమే చెపుతూవుంటారుగాని భవిష్యత్తును గూర్చి చెప్పరు. యెందుచేత? అలా చెప్పడంవల్ల అది నిజమే అయినా చెప్పించుకున్న వారివల్ల కలిగేలాభం వుండదుకదా? వక పెద్ద జమీందారు "కలౌ షష్టి" సమీపంలో వుండి అనారోగ్యం చేత చిక్కుపడుతూ కొందఱికి జాతకాన్ని చూపిస్తే వారు వున్న యథార్థాన్నే చెపుతూ వచ్చారు. యింకో పండితుడికి చూపడం తటస్థించింది. ఆ పండితుడు చాలా లౌక్యుడు. ఆయన గతంలో పండితులు చెప్పినమాటలన్నిటినీ "తోసిరా"జని "యీ జాతకుడికి యింకా రెండుదశలు *(20 యేళ్లు)* ఆయుర్దాయం వుందంటూ చెప్పడంతోటట్టుగానే చాలా సంతోషించి దుశ్శాలువులూ, అర్ధవేయిన్నూటపదార్లూ యివ్వడం జరిగిందని చెప్పుకుంటారు. తరువాత యిదివఱలో యథార్థం చెప్పిన పండితులు ఆయన్ని నిలవతీసి "స్పష్టంగా మారకం కనపడుతూ వుంటే, రెండుదశలు ఆయుర్దాయం యేలా చెప్పారు మీ" రని అడిగేటప్పటికి ఆయన నవ్వి, "నాయనలారా! మీరు యథార్థమే చెప్పారు. దాని వల్ల మీ కేంలాభం కలిగింది? యిదిన్నీ కాక, అన్ని భావాలకన్నా ఆయుర్భావం నిర్ణయించడం చాలా దుష్కరం. కాబట్టి దాన్ని గూర్చి "నాశ్లీలం కీర్తయేత్" అని సమాధానం చెపుతూ", వకవేళ మీరు మారకకాలంగా అభిప్రాయపడ్డ 'టయిము' దాటితే యిప్పుడు జరిగిన సమ్మానానికి మించిన సమ్మానం నాకు మళ్లా జరుగుతుంది. దాటకపోతే ఆయన నన్ను "సరిగా చెప్పలేదేమి?" అని ప్రశ్నించడు. యింక ఆయనకు సంబంధించినవాళ్లు అగుపడతారనుకోవాలి. వారికి మీకు చెప్పిన జవాబే చెప్పవచ్చును" అంటూ చెప్పినట్టు వినడం. సరే! విషయం విషయాంతరంలోకి దూకింది.

సిగ్గును గూర్చి మనం మాట్లాడుకుంటూ వున్నాం. శృంగారరసంలోనే కాకుండా యీ సిగ్గును అన్యత్ర కూడా ప్రసక్తి వుందని చెపుతూ యెన్నో రూల్సులు అప్పెగవేయడానికి వున్నప్పుడుకూడా యీసిగ్గు వాట్లను వుపయోగపఱుచుకోనీయక పోవడంచేత కొందఱు యెట్లో క్రమప్రకారంగా ఋణముక్తిని పూర్వకాలంలో చేసుకొనేవారని చెప్పినట్టయింది.

ఇంకా యీ సిగ్గుకు ప్రసక్తి కలది మఱొకటి వుంది. అది యుద్ధం. ప్రాణాల యందు యెంతో తీపివున్న వాళ్లుకూడా యింట్లో కూర్చుని వుంటే తమరిని ఆడవాళ్లు నవ్వుతారనే తాత్పర్యంతో యుద్ధరంగానికి వెళ్లి తోచినంత పనిచేసి ప్రాణాలు విడిచినట్టు యెన్నో యితిహాసాలు కనపడతాయి. యుద్ధరంగాన్నుంచి భయపడి యింటికి వచ్చినప్పుడు ఖడ్గతిక్కన్నగారిని కాబోలును వదినెగారు – "ముగు రాడువారమైతిమి, వగపేటికి జలకమాడ వచ్చినవేళన్"[4] అని పరిహసించి వెళ్లినట్టున్నూ వున్న యితిహాసం అందఱూ యెఱిగిందే. యెక్కడపడితే అక్కడ తినడానికి, నోటికి వచ్చినట్టల్లా మాట్లాడడానికి గాని యెందఱో సంశయించడం కూడా యితర కారణాల మాటలా వుండగా సిగ్గుచేతనే అనుకోవడం యుక్తియుక్తంగా వుంటుంది. బాగా ఆలోచిస్తే మనం తినే పదార్థాలలో యేకొన్నింటిలోనో తప్ప బాహుళ్యంగా వుప్పు కలవడం యేలాటిదో ప్రవర్తనలో సిగ్గు కలవడమూ అలాటిదే. దీనివల్లనే అనేకులు సత్ప్రవర్తన కలవారవుతూ వున్నారనుకోవచ్చును. మగవాళ్లకు సిగ్గుండకూడదనిన్నీ ఆడవాళ్లకే సిగ్గుండవలసిందనిన్నీ చెప్పేమాటలు సర్వసామాన్యమైనవిన్నీ శృంగారరసానికి సంబంధించినవిన్నీ అని తెలుసుకోవాలి.

కం. కాంతు డుచితజ్ఞుడైనను
గాంతకు సిగ్గుపడ జెల్లుగా కకటకటా!
కాంతుడు సిబ్బితికాడై
కాంతయు నట్లైన నెట్లు కాపుర మింకన్

అంటూ పింగళి సూరన్నగారు చెప్పినమాటవల్ల శృంగారంలోకూడా సిగ్గును కొన్ని సందర్భాలలో స్త్రీలు సమేతూ కొంత తగ్గించుకోవలసిందిగా కనపడుతుంది గాని యెంతో ప్రాణం మీదికి వస్తే తప్ప స్త్రీ సిగ్గు వదిలి మాట్లాడడం తటస్థింపదు. అలా మాట్లాడవలసేవస్తే యిక తరవాయంటూ వుండనే వుండదు. చూడండి

---

**4.** ఖడ్గతిక్కనగారి వదినగారు కాదు, ఆయన భార్య వీరనారీ శిరోమణి అయిన చానమ్మ. కాటమరాజుతో జరుగుతున్న అలవలపాటి యుద్ధం నుంచి మధ్యలో ఇంటికి వచ్చిన ఖడ్గతిక్కనకు నులకమంచం నిలబెట్టి దానిపై చీర అడ్డంగా వేసి నీళ్లు, పసుపుతో అడవారికి లాగా స్నానం చేయడానికి ఏర్పాటు చేసి పలికిన మాటలు.

శకుంతల భారతంలో దుష్యంతుడు తన్ను అనాదరించి అసత్యాలాపాలాడే సమయంలో యెలా మాట్లాడిందోను! యిలాంటివింకా యెన్నో వుదాహరణలు స్త్రీల విషయంలో సిగ్గు వదలుకున్నవి చూపవచ్చును. కాని యింతమాత్రం చేత ఆయా స్త్రీలు లజ్జాశూన్యురాండ్ర తరగతికి జమ కాదు. మొత్తం పురుషులు కూడా సిగ్గును పాటించేవారే అయినా స్త్రీలవల్లనే యీ సిగ్గు నిన్నమొన్నటిదాకా బతుకుతూ వచ్చింది పాపం. “లజ్జితుమసిలజ్జతే” అనిన్నీ, “సిగ్గుకు సిగ్గులే దిటులు చేసినపిమ్మట నుండవచ్చునే?” అనిన్నీ వాడుకొనే యిత్యాదులన్నీ స్త్రీల సిగ్గుకు సంబంధించినవే. యెంతటి “బూతులబుంగ”లున్నూ ఆడవాళ్లున్న చోట విశృంఖలంగా బూతుకూతలు రానీయరు. అలవాటు చొప్పున వస్తే చట్టన నాలుక కఱచుకొని పశ్చాత్తాపాన్ని సూచిస్తారు.

నిమ్నజాతులలో ఆడవాళ్లు పలువురు బండబూతులు వాడేవాళ్లున్నూ వుంటారు. కాని అవి బూతులని వాళ్లు ఎఱుగరు. వాళ్లందఱూ నామమాత్రానికి ఆడవాళ్లే కాని, వస్తుతః మగవాళ్లే అనుకోవాలి. అందులోనూ సిగ్గూ, బిడియమూ లేని మగవాళ్లని కూడా అనుకోవాలి. తాటక, శూర్పణఖ వగయిరాలు స్త్రీలని యెవరనుకుంటారు? స్త్రీచిహ్నాలు మాత్రమే స్త్రీత్వాన్ని సమర్థించవు. పురుషుల విషయంకూడా యీలాగే. ఆ చిహ్నాములను పోషించతగ్గ గుణాలలో ముఖ్యగుణం సిగ్గుబిడియాలు. అవి వదలు కొన్న తరువాత స్త్రీత్వం నట్టేటిలో కలిసినట్టే. స్త్రీకి చిన్నతనంలోయేమోగాని, పెళ్లిమాట తలపెడితే యెంతో సిగ్గు పుట్టుకువస్తుంది. అది కొనితెచ్చుకునేది కాదు, సహజం. ఆ పెళ్లి అనేది యేమేనా అశాస్త్రీయమేమో అంటే అట్టిది లేశమున్నూ కాదు. కాకపోయినా సిగ్గుబాధ తప్పేదిలేదు. వొక్క స్వయంవరాల విషయంలో దీనికి మినహాయింపయితే కనపడుతుంది గాని, దేవీ భాగవతంలో సుదర్శన చరిత్రలో అతని భార్య శశికళ యీ మినహాయింపునుకూడా అంగీకరించింది కాదు. పూర్వుల రచనలంటే బొత్తిగా యీసడించే నవనాగరకులకు వాట్లని వుదాహరిస్తే యేం లాభం?

ఈ సిగ్గంతా స్త్రీలకు పురుషులే స్వార్థపరత్వంచేత కల్పించారనేవారున్నూ యీ కాలంలో వున్నారు. ఒక విషయమేమిటి? అన్ని విషయాలల్లోనూ యిప్పటివాదం పిడివాదమే. స్త్రీలు బహిష్టయినప్పుడు నాలుగురోజులు అస్పృశ్యలుగా వుండడానికి యెన్నో కారణాలు మనవారు ఆయుర్వేదాదులద్వారా కనిపెట్టి నిర్ణయించి వున్నారు. అగ్రవర్ణాలలో సర్వత్రా యీ ఆచారం యిప్పటికీ జరుగుతూనే వుంది. దేశభేదం చేత యీ అస్పృశ్యతలో కొంత తారతమ్యం వున్నా మొత్తం అందఱూ దీన్ని పాటిస్తూనే వున్నారు. నిమ్నజాతులు మాత్రం అగ్రజాతులతోపాటు

జరుగుబాటు లేక తాత్కాలిక స్నానమో యేదో చేసి సరిపెట్టుకుంటూ వున్నారు. స్నానమే చేయడానికి కొన్ని పౌనులు ఖర్చుపెడితేనేకాని వీలుపడని యూరపు ఖండంలో దీన్ని మనలాగా పాటిస్తూన్నారని చెప్పడానికి వీలుపడదు. దాన్ని వుదాహరణ పుచ్చుకుని యిప్పుడు యీ ఆచారాన్ని పాటించవద్దని చెప్పేవారెందఱో వున్నారు. యిదికూడా పురుషుల స్వార్థపరత్వం వల్ల కల్పితమైనట్టే వారి అభిప్రాయం. కట్టకడపటి జాతులకు దేవాలయ ప్రవేశం లేకుండా చేసిన ధర్మశాస్త్రమే స్త్రీలకు రజస్సమయంలో అంటరానితనాన్ని యేర్పాట్లు చేసింది. యిందులో వకటి స్వార్థపరత్వానికి వుదాహరించతగ్గదైతే రెండోది యెందుకు కాకపోతుందో?

పూర్వులు చేసిన ఆయీ యేర్పాట్ల కన్నింటికీ బాహ్యకారణాలు చూపడం దుర్ఘటం. ఆధ్యాత్మిక దృష్టితో ఆయీ కట్టుబాట్లు చేసినట్టే కనపడుతుంది. అట్టి యేర్పాట్లు మన దృష్టి మాత్రంతో సర్వజ్ఞత్వాన్ని ప్రకటించే మనకు కనిపిస్తాయా? గోచరింపని మాత్రంచేత అవి స్వార్థపరుల కల్పనలని అలాగ్గా తోసివేసి లోకాన్ని మోసపుచ్చడం యుక్తం కాదు. కాని "ఆ దేశపు స్త్రీల కేం లోపం వచ్చింది మనకి రావడానికి?"కని కొందఱు సాహసురాండ్రు ఆయా కట్టుబాట్లను అతిక్రమించడం అనివార్యం అవుతూవుంది.

కించిజ్ఞులుగా వుండి సర్వజ్ఞుల మనుకునే కొందఱు పురుషులే యీ అతిక్రమణానికి ప్రోత్సాహకులు. అతిక్రమించినా హాని లేనివి కొన్ని వున్నాయి. స్త్రీలు మనదేశంలో కొంతకాలందాకా బాల్యంలో జడ వేసుకొనేవారు. వ్యక్తురాండ్రైన పిమ్మట కొప్పు పెట్టుకొనేవారు. ఆ కొప్పుకూడా సంసారిణు లొకమాదిరిగానున్నూ, యితర స్త్రీలు వకమాదిరిగానున్నూ పెట్టుకొనేవారు. యిటీవల జడవేసుకొని దాన్ని చుట్టుకోవడం మొదలుపెట్టారు. కొన్నాళ్లు ఆ హయాం నడిచింది. యిటీవల మళ్లా జాఱుజడలు ప్రారంభించారు. ప్రస్తుతం అదే అమల్లో వుంది. కొందఱు తమ ఆడపిల్లలకు పూర్వం మొగపిల్లల పద్ధతిగా గిరజాలుగా కత్తిరిస్తూ వున్నారు. యివికూడా పయికి కొంత విడ్డూరంగానే కనపడతాయి గాని పరలోకహాన్ని కలిగించతగ్గంత దురాచారాలకోటిలోకి రావు. యీలాంటిమార్పులెన్నో యిప్పుడు క్షణేక్షణే అవతరించి నీటిబుడగల్లాగ అంతలోనే అంతరిస్తూవున్నాయి. యితరదేశ సంపర్కంవల్ల యెన్నో వ్యాధులు యీ దేశానికి దిగుమతీ అయినట్టే ఆచారాలున్నూ అనుకోవాలి. అందులో యిహపరదూష్యాలు వదులుకొని యితరాలు స్వీకరిస్తే బాగుండేది కాని అలా జరగడం లేదు. సర్వానికి సిద్ధమవుతూ వుంది ప్రపంచకం. మన దేశాచారాలని మాత్రం యితరదేశాలవారు స్త్రీలుగాని పురుషులుగాని అవలంబిస్తూ వున్నట్టు లేదు. యెందుచేత? యిందులో విధినిషేధాలంటూ

వుండడంచేతే అనుకోవాలి. యెవరో అమెరికా స్త్రీ మన దేశాచారాలన్నీ మంచివి కావంటూ ఒక పుస్తకం వ్రాసిందని మనదేశంలో వుండే నాయకులందఱూ యెంతో పరితాపపడ్డారు, పడి వూరుకోలేదు, ఖండనగ్రంథాలు కూడా వ్రాసి యెదురుకున్నారు. సరే సంతోషిద్దాం గాని మనదేశంలో అనాదిగా అలంకారభూతంగా వున్న సిగ్గుబిడియాలు స్త్రీలకే కాక పురుషులకు కూడా లేకుండా చేసే ప్రయత్నాలు మనవారే దేశాభివృద్ధికంటూ చేస్తూవున్నారు. వూరికే చేయడం మాత్రమే కాదు కంఠపాశాల్లా, బిల్లులుకూడా ప్యాసు చేసి తద్వారా పీడకూడా కలిగిస్తూ వున్నారు. ఫలితం యేలా పరిణమించినా వుద్దేశం దేశాభివృద్ధి కని చేసేది కనక దానికిన్నీ సంతోషిద్దాం. వారి దృష్టిలో వృథాగా ప్రజానాశకమైన బాణాసంచా కాల్పులను పెళ్లిళ్లు వగయిరాలలో జరగకుండా చేదామనే వుద్దేశం యెందుకు కలగలేదో? అనుకుంటాను.

సుమారు నాలుగేళ్లనాడు యీ బాణాసంచాను నిర్మించే వక వర్తకుని మేడ విశాఖపట్నంలో బాణాసంచా అంటుకొని దానిలో వున్న జనంతో "సహేంద్రతక్షకాయ స్వాహా"గా ఆహుతి అయింది. ప్రతి సంవత్సరమూ యీలాటి విపత్తులెన్నో జరుగుతూ వున్నాయి. దీపావళిపండుగ జరిగిన మఱునాడు ప్రతీ ఆస్పత్రిదగ్గిఱా దీనివల్ల గాయపడ్డ జనం కనపడుతూనే వుంటారు. అసలు దీపావళి శబ్దానికి వున్న అర్థం నూనెతో భగవత్ప్రీతికరంగా దీపాలు పెట్టడమే కాని బాణాసంచా కాల్పు కానే కాదు. బ్రిటిషువారి ప్రభుత్వం రాకపూర్వం తాటాకు టపాకాయలతోటిన్నీ కొద్దిగొప్ప మతాబాలతోటిన్నీ యీ వుత్సవం జరిగేదని వినడం. మా చిన్నతనంనాటికి తారాజువ్వలున్నూ లంకాపురులున్నూ వెలిశాయి కాని బాంబులు బయలుదేఱలేదు. యిటీవల యివికూడా బయలుదేఱాయి. దేవతా వుత్సవాలుగాని పెళ్లిళ్లుగాని వీట్ల కాల్పులు లేకుండా జరగడమంటే చాలా న్యూనతగా చూస్తూ వున్నారు. యజమానికి యిష్టం లేకపోయినా వచ్చిన చుట్టాలలోవారేనా చేతి డబ్బు పెట్టుకొని యీ బాణాసంచాను సప్లయి చేసి తీరుతారు. నా చిన్నతనంలో యానాంలో శ్రీ మన్యం వారింట వక వివాహంలో యీ కాల్పులవల్ల చూడడానికి వచ్చిన వక మనుష్యుడి కళ్లు పోయినాయి. మనిషి మాత్రం బ్రతికాడు "చావుతప్పి కన్ను లొట్టపోవడం" – యెన్ని యీలాటివి యిటీవల జరిగాయో వివరించి వ్రాయవలసే వస్తే గ్రంథం చాలా పెరుగుతుంది. మద్యపాననిషేధంకంటే కూడా యీ బాణాసంచా కాల్పు నిషేధం మొట్టమొదట చేయదగ్గదిగా నాకు కనపడుతుంది. యేకొంచెంగానో లైసెన్సు మూలకంగా వచ్చే రాబడి తగ్గినా మద్యపాననిషేధం వల్ల వచ్చే నష్టమంత నష్టం కూడా దీనివల్ల

గవర్నమెంటుకు వుండదనుకుంటాను. మన కాంగ్రెసుమంత్రులు కులాచారాలకూ, వేదశాస్త్ర మర్యాదలకూ భంగించే రూల్సులు కొన్ని ప్రజాక్షేమానికంటూ చేస్తూనే వున్నారు. యిది వారి దృష్టిలో యెందుకు పడిందికాదో అనుకుంటాను. యుద్ధాలలో తప్ప యీ బాపతు వాడడానికి అవకాశం లేకుండా వకబిల్లు పెడితే దీన్ని యెదురుకునేవారు అంతగా వుండరు. యెందఱికో అకారణంగా సంఘటించే విపత్తు యీ బిల్లువల్ల తొలగుతుంది. యీ నిషేధం యే ధర్మశాస్త్రాన్ని కాని యే సదాచారాన్ని కాని భంగించేదికాదు. యిది యెందఱో నిరపరాధులను కూడా విపత్తులో ముంచుతూవున్న దుర్వ్యసనం.

రామాయణంలో పిడకల వేట్లాట అన్నట్టు ప్రసక్తి గాని ప్రసక్తిగా యీ సిగ్గూ బిడియం అనే వ్యాసంలో యీ బాణాసంచా కాల్పు గొడవ యెందుకు వచ్చిందంటే, మొన్న రాత్తిరి సుమారు పదిగంటలవేళ ఆకాశం మీద లేశమున్నూ మబ్బులేకుండానే వక వురుము వినపడింది. దీని క్కారణ మేమిగా వుంటుందని చర్చించాను కాని నిష్కర్షగా తేలిందికాదు. మర్నాడు రాజమండ్రిలో జరుగుతూవున్న షాహుకారు గృహంలో జరిగే పెండ్లిలో అఱవై రూపాయీలు వెలగల వక బాంబువల్ల యిరవై తొమ్మండుగురు గాయపడ్డట్టున్నూ, అందులో తొమ్మండుగురు తత్కాలమందే మరణించినట్టున్నూ, ఆ మరణించినవారిలో వకరితల యెక్కడ పడిందీ తెలియనే తెలియనట్టున్నూ, వొక బ్రాహ్మణకుఱ్ఱవాని కాలు దొరికితే తండ్రి దాన్ని మళ్లీ అతికించుకొనే వుద్దేశంతో చేతపట్టుకొని దుఃఖిస్తూ తిరుగుతూ వున్నట్టున్నూ, తక్కిన యిరవైమందిన్నీ ఆస్పత్రిలో వున్నట్టున్నూ యెవరో చెప్పుకుంటూవుంటే విన్నట్టు మా మూడోచిరంజీవి చెప్పగా విన్నాను. యిందులో యేకొంచెమో హెచ్చుతగ్గులుంటే వుండవచ్చును. శుభమల్లే జరిగే పెళ్లేమిటి, యీ "స్త్రీ పర్వపు గాథేమిటి"[5] అని తోచి యీ వ్యాసంలోనే దీన్ని గుఱించి రెండుమాటలు వ్రాసి యీ మతాచారాన్ని తొలగిస్తే బాగుంటుందేమో అని మంత్రులకు జ్ఞాపకం చేదామని యిందులో ప్రసక్తిలేని ప్రసక్తిగా దీన్ని యిఱికించాను. యిటీవల యీ ఘోరదృశ్యాన్ని చూచినవారు చెప్పినమాటలు బొత్తిగా వినలేకపోయాను.

యెప్పుడో ప్రపంచయుద్ధం వస్తే యీ కర్మం చీనాతోపాటు మన దేశాని క్కూడా వస్తుందేమో అనుకుంటే అప్పటిదాకా యెందుకు? యిప్పుడే వచ్చిందన్నట్టు మొన్నటిరాత్రి రాజమండ్రీ దృశ్యం ఋజువు చేస్తూవుంది. యీ దిక్కుమాలిన

---

**5.** కురుక్షేత్రయుద్ధరంగంలో చనిపోయినవారి తాలూకు ఆడవాళ్లు వచ్చి విలపించే ఘట్టాన్ని వివరిస్తుంది భారతంలోని స్త్రీపర్వం.

బాణాసంచా లేనంతమాత్రంచేత పెళ్లికి వచ్చేలోటు లేశమున్నూ కనపడదు. సిగ్గుసిగ్గని చెప్పి నృత్తగీతాలు కొందఱు పెళ్లిళ్లలో పెట్టడం మానేశారు. వృథా వ్యయమని చెప్పి సదస్యాలు మానుకున్నారు. యింకా యెన్నో పూర్వులు ఆచరించే ఆచారాలు తగ్గించుకున్నారు. కాని వున్నంత శక్తిలోనే అంతో యింతో బాణాసంచా కాల్పంటూ లేకుండా యేమహాఛాందసుల యిళ్లల్లో జరిగే పెళ్లిళ్లు కూడా నూటికి తొంభైతొమ్మిది జరగడమే లేదు. పైని మానుకున్నట్లు వుదాహరించినవాట్లల్లో అంతో యింతో మంగళసంపాదకత్వం వుంది గాని యీ బాణాసంచాలో అట్టిది లేశమున్నూ వున్నట్టు లేదు. ఆపత్తు అందఱికి స్పష్టంగా కనపడుతూనే వుంది. దీపావళినాటితో పాటు పెండ్లిండ్లలో కూడా దీన్ని మానిపించే ప్రయత్నం జరిగితే బాగుండును. దీపావళిపండుగనాడు బాలకులను సంతోషపెట్టడానికి యిటీవల విదేశాలనుంచి వస్తూవున్న కాకరపువొత్తులు[6] వగయిరాలకు అనుమతి యిస్తే అంత చిక్కులేదనుకుంటాను. యిది మానిపించడం ఆవశ్యకమని తోచేయెడల మఱికొందఱుకూడా వ్యాసకర్తలు వారివారి సమ్మతిని చూపవలసిందనిన్నీ, అన్యథా తోస్తే అన్యథాగానే వారి వారి అభిప్రాయాన్ని తెలపవలసిందనిన్నీ అభ్యర్థిస్తాను. దీనివల్ల యిదివఱలో మన భారతజాతికి వున్న సిగ్గుబిడియాలు పోవడంగాని, లేని సిగ్గుబిడియాలు రావడం కాని జరగదని తెలిసుండీ నా ఛాందసబుద్ధికి తోచి ఏవో నాలుగు మాటలు వ్రాశాను. యీ సంస్కారం యిదివరకుండే సంస్కారాల మాదిరిగా నెగ్గడం విషయంలో దృశ్యాదృశ్య శంక కూడా లేదని నాకు తోస్తుంది. వొక్కక్కప్పుడు యీ బాణాసంచా ముచ్చట యితరులకే కాక పెండ్లికొడుక్కూ, పెండ్లికూతురికీ కూడ మోసం తెస్తే తేవచ్చును గదా! అథవా వారి మట్టుకు ప్రోవరాదే అనుకుందాం యెవరి పెళ్లిలో యీలాటి అమంగళం జరుగుతుందో ఆ దంపతుల భవిష్యత్కాలాన్ని గూర్చి ఆలోచించాల్సి వుంటుందా వుండదా? శుభశోభనాలలో యిట్టి ఆపత్కరాలకు చోటివ్వడ మనేది ప్రజలలో వుండే మూర్ఖతకే కదా తార్కాణం? ఇట్టి ప్రజలే ప్రపంచకంలో నూటికి తొంభైవంతులుంటారు. యిట్టి ప్రజల కందఱికి దివ్యజ్ఞానం కలిగించడాని కంటూ యెందఱో యెన్నో ప్రయత్నాలు చేసి తుదకు వారి జీవితాన్ని యావత్తూ దానికి ధారపోసి కృతార్థులు కాలేక పోయినట్టు గ్రంథాలు ఘోషిస్తూవున్నాయి. ఘోషించినా చేతనంతలో యత్నం చేయడం పరిజ్ఞాతలకు కర్తవ్యమే. అందుచేత పరిజ్ఞాతలు యత్నిస్తూ వుండవలసిందే.

---

**6.** 1895లో మొట్టమొదటిగా రాజమండ్రి వర్తకుడు ఒకరు చైనా కాకరపువ్వొత్తులను దిగుమతి చేసుకున్నారు.

కాని ఆ ప్రయత్నంలో పూర్వులు చేసిన యేర్పాట్లను గూర్చికూడా తఱిచితఱిచి కాని చట్టన వాట్లను మార్చకూడదు.

అందులోనున్నూ యితరవిషయాల మాటేలావున్నా వివాహాది ప్రధాన విషయాలు మఱీ ఆలోచించి కాని మార్చకూడదు. అందఱికీ స్వయంవరాధికార మంటే మాత్రం అది నెఱవేఱడం యేలాగ? యీమధ్య వక సభలో వకాయన వుపన్యసిస్తూ హరిజనులకూ యితర వర్ణస్థులకూ వివాహాలుకూడా జరగడం ఆవశ్యక మని వుపన్యసించినట్టు చదివాను. వకప్రక్కనేమో వేదాధికారంకోసం ద్విజేతరులు ప్రయత్నిస్తూ మళ్లా యీ ప్రయత్న మేమిటి? యెవరికి తోచినట్టల్లా వారు తోవలు తొక్కుతూ వున్నారు. స్త్రీలు చేసే సభలలో పురుషులు సర్వథా తమకు అపకారం చేసివున్నారని తేల్చడమే కాని మఱొకటి కనపడదు. వొకవేళ అర్థాత్తూ ఆయాకాలాల్లో నిష్పక్షపాతబుద్ధితో చేసిన ధర్మనిర్ణయాలు కొందఱికి యిటీవల బాధకాలుగా పరిణమిస్తే పరిణమించాయేమో కాని నిర్ణేతలు మాత్రం పక్షపాతులు కారనుట ధ్రువము. యిప్పుడు లోకోపకారబుద్ధితో మహాత్ముని యంతటి నిస్పృహుడు చేసే ధర్మనిర్ణయాలు కొందఱికి బాధకాలుగా ఉండడం లేదా? అలాగే అనుకోవాలి.

అప్పటివారు యెంతసేపు ఆలోచించినా స్త్రీ జాతికి ముఖ్యంగా సహజంగా వుండే సిగ్గు బిడియాలకు లోపం రాకుండా వుండే కట్టుబాట్లను చేసినట్టు తోస్తుంది. అనులోమవివాహాలే కావాలనే దానిలో కూడా యీ అర్థమే యిమిడివుంది. ఘోషాలో కూడా యిదే యిమిడి వుంది. యిప్పుడు స్త్రీలైతే స్వయంగా ఆ నిర్ణయాలు వదలు కోవాలని కుతూహలపడ్డట్టు లేదు గాని కొందఱు సంస్కర్తలు అదేపనిగా పత్రికలో వ్రాస్తూవుండడం చూచి యే కొందఱో స్త్రీలు కూడా వారి ధోరణిని అనుసరిస్తూ వున్నారు. అనుసరించేవారు నూటికి పదిమందేనా వుండకపోయినా పత్రికలలో పెద్దచేసి ప్రచురించడం వల్ల వారే యెక్కువగా వున్నట్టు లోకానికి తోస్తుంది. ఆ సంస్కర్తలుకూడా కొందఱు విడాకుల చట్టాన్ని యితర దేశస్థులతోపాటుగా యేవగించుకుంటూ కూడా వ్రాస్తూనే వున్నారు. వారికి నమస్కరించవలసి వున్నది.

సంసార మనేది కప్పల తక్కెడ. యెన్ని వుపాయాలు చూపినా యేదోవక లోటు వుంటూనే వుంటుంది. అలాటిలోటు లేకుండా చేసేదల్లా వక్క యథాలాభ సంతుష్టే. ఆ సంతుష్టిని కలిగించేదల్లా వక్క జ్ఞానమే. పోతరాజుగారేమో,

వ్యాప్తిం జెందక వగవక,
ప్రాప్తంబగు లేశమేని పదివేలనుచున్,
దృప్తిన్ జెందని మనుజుడు,
సప్తద్వీపములనైన జక్కంబడునే?

అని చెప్పి తదనుకూలంగా కాలం గడుపుకున్నా జరిగింది. శ్రీనాథుడు – "అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరికా భిక్షాదానము సేయు" మంటూ కస్తూరి దగ్గఱనుంచీ భిక్షించినా కాలం జరిగింది. ఆయన సిగ్గఱితనాన్ని అనేకులు అనేకవిధాల పొగడి కీర్తిస్తూవున్నారు. శ్రీనాథుణ్ణి కవితారచనా విషయంలో యెంతకీర్తించినా యీ విషయంలో పోతరాజుగారిదే హక్కు. అలాటి ప్రవర్తన అందఱికి అలవడుతుందా? అనే ప్రశ్నకు జవాబుచెప్పడం కష్టం, "రామాదివ ద్వర్తితవ్యం, న రావణాదివత్" అని కదా పెద్దలయాదేశము, అందఱును రామునివలె వర్తింపగలరనేనా వారి తాత్పర్యం? నేర్చుకోవలసిన గుణాలు అలాటివి కాని యితరాలు వాటంతటఅవే అలవడతాయి. అందుకే – "లోకే వ్యనాయామిష మద్యసేవా జంతోస్తు నితాః" అని యెత్తికొని, "వ్యవస్థితి స్త్వత్ర" అని పరిసమాప్తి చేశారు ఋషులు. ఆ వ్యవస్థ యెంత చక్కగా చేయాలో అంత చక్కగానూ చేశారు. ఆ చేయడంలో స్త్రీలతోపాటు పురుషులనుకూడా కట్టుబాటు చేశారు. ఆ చేయడంలో స్త్రీలతోపాటు పురుషులను కూడా కట్టుబాటు చేశారు. కాని పురుషులకు బహుభార్యాత్వాన్ని మాత్రం అంగీకరించారు. స్త్రీలకు బహుభర్తృకత్వాన్ని సమ్మతించారు కారు. అది పరంలోమాట దేవుడెఱుగును గాని యిహానికే యెంతో హేయంగా వారికి కనపడింది. ఆ కనపడడం సిగ్గుకు సంబంధించినదే కానీ వేఱు కాదు. ఆ సిగ్గును గూర్చే దేవీ మంత్రబీజాక్షర మనిన్నీ, సాక్షాత్పరదేవతా రూపాలలో అది వకటనిన్నీ నేను దీనిలో వ్రాసింది. పురుషుల కంటేకూడా ఆ బీజాక్షరజపం స్త్రీలే చేసి నిలపదగ్గవారు. కొందఱు దానివిషయంలో అతిక్రమించినా యింకా యెందఱో దాన్ని అవలంబించి యీ భరతఖండ మర్యాదను నిలుపుతారనే నా నిశ్చయం. పూర్వమ్మాత్రం అందఱూ దాన్ని కాపాడినట్టు చెప్పగలమా? అప్పుడు అలాటివారికి సంఘంలో స్థానం వుండేదికాదు. యిప్పుడో? దాన్ని సంపాదించు కొన్నట్టవుతుంది. అంతేకాని దానికి మంత్రబీజాక్షరత్వం యెప్పుడూ నిల్చే వుంటుంది. యెంత వ్రాసినా యింతే. కొన్నాళ్లకు మళ్లా వెనకటిరీతి ప్రపంచస్థితి మాఱితే మాఱుతుందేమో? యిప్పటిమార్పు లేవిగాని చిరస్థాయులుగా వుండేటట్టు తోచదు. సర్వే జనా స్సుఖినోభవంతు. "హ్రీంకారరూపిణ్యై నమః" స్వస్తి.

*(భారతి, ఆగస్ట్ – 1938)*



## మా విద్యార్థి దశ - నాటి కవిత్వం

దీన్ని గుఱించి యెందుకు వ్రాస్తున్నానంటే కవిత్వం చెప్పేవాళ్ల మనోవృత్తులు మొట్టమొదట యేలా ఉంటాయో తరవాత తరవాత క్రమేణా యేలా యేలా మాఱతాయో జిజ్ఞాసువులు తెలుకోవడానికే యీ వ్రాయడం. అయితే అందఱి మనోవృత్తులూ వొకటే విధంగా వుంటాయా అన్న శంక కవకాశం లేకపోదు గాని అలాటి భేదం మఱివొక రెవరేనా తెల్పడానికి యిది మార్గదర్శకం కావచ్చునుగదా !

పరమగురువులు బ్రహ్మయ్యశాస్త్రుల్లుగారి సాన్నిధ్యానికి వెళ్లేలోగా విశేషించి చెప్పిన కవిత్వం పదకవిత్వం. యేకొంచెమో పద్యకవిత్వమూ వుంది గాని అది చాలా తక్కువ. పద్యకవిత్వంలో మొట్టమొదటిది.

> శ్రీమదఖండవైభవముచేఁ జెలువారెడి వేంకటాద్రిపై
> సామజయాన శ్రీరమణి చక్కగ బాదము లొత్త నారదుం
> 'డో మహనీయ సేవిత గుణోజ్జ్వల' యంచు భజింపుచుండ ని
> న్నే మది నమ్మినాడ దయ నేలుమి శ్రీకర వేంకటేశ్వరా !

ఈ పద్యంలో 'వేంకటాద్రిపై' అనే పదాన్ని బట్టి యీ వేంకటేశ్వరుడు తిరుపతికొండ మీద వుండే వేంకటేశ్వరుడని చదువరులకు తోచడం యుక్తమేగాని నావుద్దేశంలో వున్న దేవుడు తాత్కాలిక నివాసం యానాంలో వుండే దేవుడు వేంకటేశ్వరుడే. మా యిద్దఱిలో (ఆయీ టైముకు యింకా నన్ను తిశా గాని, అతణ్ణి నేనుగాని కలియలేదు, చూడలేదు, వినాలేదు. యెవరికి వారే యమునాతీరే) నా బాల్యదశ పదేళ్లు మొదలు యావత్తూ యీ వేంకటేశ్వరుని దేవాలయావరణంలోనే గడిచింది. అఱువైయేళ్లు దాదాపు కావచ్చినా ఆ గుడి ఆవరణలో వున్న బొగడచెట్ల కొమ్మలు మా ఆటలప్పుడు కోతికొమ్మచ్చి ద్వారా నునుపెక్కినవి యిప్పు డేమేనా మళ్లా గరుసెక్కా యేమో కాని యిప్పటికి పదేళ్లనాటికి యింకా నున్నగానే వుండడం పరీక్షించి నేను స్వయంగా చూచిందే. నాకు ఆ దేవుడంటేనే ఆ రోజుల్లో యెక్కువభక్తి

వుండేది (శివుడంటే కొంత ద్వేషం వుండేది). యిటీవల దేవీభక్తుడుగా నేను కాశీలో కాళికాష్టకం చెప్పే రోజుల్లో మాటినా ఆ భక్తికి లోటు లేదు. “శైవా వయం”[1] అన్న లీలాశుకుని శ్లోకం తెలిసినవారికి నా భక్తి సమన్వయిస్తుంది.

యానాంలో వున్న వేంకటేశ్వరునిమీద శతకం వ్రాయడానికి మొదలెడుతూ “వేంకటాద్రిపై” అని యెత్తుకోవడ మేమిటి అని ఆ రోజుల్లో యెవరూ శంకించలేదు గాని శంకిస్తే జవాబు చెప్పడం కష్టమే. అయితే ఆ పద్యంలో యానాం గ్రామం పేరు వుటంకించకపోవడంచేత ఆ శంక కవకాశం కలగలేదనుకోవాలి. ఒక యింగ్లీషు మెట్రిక్యులేషనుదాకా చదివిన విద్యార్థి – ‘శ్రీమత్+అఖండ’ కల్పితే ‘శ్రీమతఖండ’ అని కావాలి గాని ‘శ్రీమదఖండ’ అని యేలా అయిందని ప్రశ్నించడమున్నూ దానికి నేను అది యేలా అయిందో సూత్రాలు చెప్పడానికి నాకు వ్యాకరణం రాదుగాని, అది తప్పుమాత్రం కాదని జవాబు చెప్పడమున్నూ జరిగినట్టున్నూ, దానిమీద ఆ విద్యార్థి పిడివాదానికి వుపక్రమించడమున్నూ, ఆ కారణంచేతనే నాకు వ్యాకరణం చదవాలని బుద్ధిపుట్టి –

వ్యాకరణశాస్త్రమందున
నాకుం బ్రేమయును బుట్టె నయముగ దానిన్
సాకల్యముగా జేయుమి
ప్రాకటముగ మ్రొక్కుచుంటి భార్గవరామా!

అన్నపద్యం నాలో నేనే చెప్పుకొన్నట్టున్నూ యేదో వ్యాసంలో లోగడ వుద్ఘాటించే వుండడం చేత యిక్కడ స్పృశించి విడిచాను. ఆ యీ శతకారంభం వాటికి “కాజులూ రనునూర గామసోములయొద్ద నొక మూడుమాసము లున్నవాడ” అన్నంతవఱకు జరిగింది విద్యార్థితనం జరగడం మాత్రమే కాదు, చదివేది మేఘసందేశంలో పూర్వభాగమే అయినా తలబిరుసెంతలో వుందంటే – యింక మనం చదివేతే వ్యాకరణం చదవాలి గాని కావ్యాలు చదవనే అక్కర్లేదన్నంతలో వుండేది. ఆ వ్యాకరణం చదవడమేనా కాశీలో వుండే పండితుల వద్ద చదవాలనే కాని యీ దేశంలో వున్నవారివద్ద కాదు. అప్పటి అహంభావమే కాశీకి ప్రయాణం

---

**1.** శైవావయం నఖలు తత్ర విచారణీయం, పంచాక్షరీ జపపరా నితరాం తథాపి।
చేతో మదీయ మతసీకుసుమావభాసం, స్మేరాననం స్మరతి గోపవధూ కిశోరమ్॥
ఇది లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతమ్ ద్వితీయాశ్వాసం 25వ శ్లోకం. మేము శైవులము. పంచాక్షరీ జపం దీక్షతో చేస్తాము. ఇందులో ఏ అనుమానమూ లేదు. అయినా గోపాలుని యందే మా హృదయం సదా ఆసక్తమై ఉంటుందని భావం.

చేయించింది (నిజానికి నా చదువుకు కాశీ వెళ్లనక్కఱలేదు. దేశంలో మహావిద్వాంసు లెందఱో వుండేవారు). అది విశాఖపట్నం దాకా మాత్రం సాగించి అంతలో మళ్లా వెనక్కి (మాధవా! మన రథంబును మరలనిమ్ము) మళ్లించింది. కాని చామర్లకోటలో లఘుకౌముదిని మాత్రం ప్రారంభింపచేసింది. వ్యాకరణం పూర్తి అయేదాకా కవిత్వం చెపితే యెవరేనా ప్రశ్నిస్తే జవాబు చెప్పలేక తెల్లబోవలసి వస్తుందని రచన మాత్రం ఆపు చేశాను. లఘుకౌముదితో పాటుగా భారవికూడా చదువుకుంటూ అమరంకూడా వల్లించేవాణ్ణి. "చామర్లకోటలో జదివితి రాఘువాచార్య సన్నిధిని మాసత్రయంబు" చదివింది మూడుమాసాలే గాని మూడేళ్లు చదివినంత కంటే కూడా యెక్కువ చదువే చదివినట్టయింది. ఆ మహత్త్వం మాధుకరం యెత్తుకొని చదువుకోవడంలో వుందని నేను నమ్ముతాను. అందుకే మన ఆర్యులు వుపనయనవటువుకు "భిక్షుచర్యం చర" అని వుపదేశిస్తారు.

ఆయీ విషయం 'గుంటూరిసీమ'లో"గురుకులవాసమున్ జరిపి కూరిమి మాధుకరంబు వారముల్" ఆ నేపథ్యంలోనే కాక ' ప్రాచీన గురుశిష్యపద్ధతి' అనే శీర్షికతో వున్న వొక పద్యవ్యాసంలో కూడా వివరించి వున్నాను. యితర విద్యలమాట నేను చెప్పలేనుగాని మన వేదశాస్త్రాలు సాధించే విద్యార్థులకు మాధుకరాన్నం చేసే సహాయం అంతాయింతా కాదని నేను ఘట్టిగా చెప్పాను. యిది విషయానంతరం. ఆ కాలంలోదే యీ పద్యం కూడాను :

శ్రీరామామణి వక్షమందుదనరన్ జెన్నొందు తన్నున్ జనం
బౌరా! చంచలతన్ దొరంగని మెఱుంగర్థిన్ ధరింపంగబో
నీరాజద్ఘనమంచు వర్ణనల దారింపారగా జేయ నా
శ్రీరంగమ్మున నుండు రంగడు యశశ్రీ లిచ్చు మా కెప్పుడున్

ఈ పద్యంలో *(ఆ యీ పద్యం చెప్పింది చెప్పినట్టే యిక్కడ ప్రచురించాను. తప్పులు సవరించలేదు)* వున్న శ్రీరంగంలో వుండే రంగన్నకిన్నీ, యానాంలో వుండే వెంకన్నకిన్నీ యేం సంబంధమని యెవరూ శంకించలేదుగాని శంకిస్తే యతిప్రాసలనే తెరచాప ఆ యీ పద్యమనే వోడని అలా నడిపించిందనేదే యథార్థమైన జవాబు. ఈ రెండుపద్యాలేకాక మఱికొన్ని వేంకటేశ్వరశతకంలో పద్యాలు వుండకపోవు గాని రికార్డు జాగ్రత్త పెట్టడపు లోపంచేత యివి మాత్రమే కలగూరగంపలో ముద్రించినట్టు జ్ఞాపకం.

పద్యకవిత్వం వొకవందకు లోపలే వుంటుంది గాని పదకవిత్వం కొంచెం అధికంగానే వుంటుంది. శ్రద్ధ చేయకపోవడం చేత అంతరించింది. బ్రహ్మయ్య

శాస్తుల్లుగారి శుశ్రూషకు ఆరంభించిన వుత్తరక్షణమే చల్దివణ్ణం తినడం, తలదువ్వుకోవడం వగయిరాలయందు యెంత అనాస్థ కలిగిందో, తెలుగు కవిత్వమందున్నూ అంత అనాస్థా కలిగింది, పైగా గురువుగారు యేసంపన్న గృహస్థులతోటేనా ప్రసక్తానుప్రసక్తంగా యితడు తెలుగులో కవిత్వం చెబుతాడని ప్రస్తావిస్తే, నాకెంతో అవమానకరంగా వుండేది. ఆ రోజులనాటికి సంస్కృత పండితులు చాలామంది వుండేవారు. తెలుగంటే లేశమూ గౌరవం లేదు. అసలు చదువురాకపోయినా అంత తప్పు లేదు గాని తెలుగు చదువుకున్నాడంటే తప్పుగా కనపడేది. గురువుగారు సంస్కృతవిద్వాంసులు, విద్యార్థులందఱూ సంస్కృత విద్వాంసులు, నేనొక్కణ్ణీ వెలేసినట్టు తెలుగుకవిత్వం చెపితే ఆ సభలో నన్ను ఆదరించే దెవరు? వారాదరిస్తే ఆదరిస్తారేమో కాని అసలు తెలుగుకవిత్వం చెప్పడమంటే నాకు చచ్చినచావుగా వుండి పూర్తిగా దాన్ని విసర్జించి సంస్కృతంలోకి దిగాను. యేదో భాణం మొదలు పెట్టాను. శ్లోకాలు వ్రాస్తుండేవాణ్ణి. తోడి విద్యార్థులలో కొందఱు కవిత్వసంప్రదాయాలు నేర్చుకోవడానికి నాకు శిష్యులుగా చేరారు. కాని యెవరికీ అబ్బిందే కాదు. యేవొకరికి మాత్రమో నాత్రోవ పట్టుపడింది. దానికి నేను నిమిత్తమాత్రం. అలాగే కాకపోతే అభ్యసించాలని మొదలుపెట్టినవాళ్ల కెవళ్లకీ లవలేశమూ అంటకపోవడ మేమిటి? అభ్యాసేన నలభ్యంతే చత్వార స్సహజా గుణా.

తిరుపతిశాస్తుల్లూ, నేనూ సంస్కృతంలో నొకరి మీద పోటీకి నొకరు దీర్ఘసమాసాలు పెట్టి గణేశ్వరాష్టకరచన ప్రారంభించి నాలుగు చరణాలకీ (తెలుగులోలాగే) యేకసమాసం పెట్టి మకుటం "ఈశం గణేశం భజే" అని పూర్తి చేసి అక్కడక్కడ వినిపిస్తూ వుండేవాళ్లం. దానిలో మంచిఅర్థం వుందో లేదో యెవరి క్కావాలి, సమాసగ్రథనానికే సంతోషించేవారు.

"వస్త్రేణ వపుషా వాచా" అన్నట్టు కొంతకాలం జరిగింది. అప్పుడప్పుడు యేలూరికీ, రాజమండ్రికీ, కాకినాడకీ అనధ్యాయాలలో సంపాదనకి వెళ్లినప్పుడు మాత్రం తెలుగుకవిత్వం చెప్పడం వుండేది. యేదేనా వొక డబ్బు సొమ్మిచ్చేవాళ్లు మాకోసం సంస్కృతం చదువుకుని కూర్చుంటారు కనకనా? తెలుగైతే దేశభాష కనక అంతో యింతో తెలుస్తుంది. ఆ రోజుల్లో యెవరో పెద్దషావుకారు వొకబేడ యిస్తే "ఈ మేడే మీ బేడేమి" అంటూ ఆరంభించేటప్పటికి రూపాయి వూడిపడింది. అయితే వట్టి తెలుగేనా యేదో దానిలో ఆశ్చర్యకరమైన విషయం వుంటేనేకాని పైసా వూడిపడదని వూహించి దానికోసం బంధకవిత్వం తయారు చేసేవాళ్లం.

ఆ బంధకవిత్వమేనా సర్వతోభద్రం వగైరాలయితే చెప్పేవాళ్లకూ, ఆవలివాళ్లకు బోధ కావడమూ కష్టమే. అందుచేత సౌధబంధాలే తేలికని తయారు చేసేవాళ్లం. యిటుకగాని, సున్నంగాని, కలపగాని అక్కఱ లేకుండానే వొకటి రెండు గంటల కాలంలో కొన్ని అంతస్తుల మేడ తయారయేది. దానిలోనే కొన్ని గదులలో వుండే అక్షరాలు (మాకు మహాభాష్యం కావలెను, దాని వెల యింత, ఇత్యాదులు) చదువుకుంటే మాకు వారు చేసే సత్కారం యేదో అది వచ్చేటట్టే ఆశీర్వచనపద్యం తయారుచేసేవాళ్లం. రు.10 టికి హెచ్చు లేదు. రు.4 టికి తగ్గులేదు. రోజు ఒకటికి  ఇద్దఱికంటె యెక్కువ చూడడం లేదు. బంధకవిత్వం గనక అంతకంటె యెక్కువ సౌధాలు తయారయేవి కావు.

ఆయీ రచనవల్ల ద్రవ్యలాభ మాలా వుండగా కవిత్వం వృద్ధి పొందింది. జయదేవు డేమన్నాడు – "కావ్యం నవపల్లవః" అన్నాడు. యే వెట్టిమొట్టి పద్యాలో రచిస్తూ వుంటే చిగుళ్లు చెట్టును వృద్ధిపఱచినట్టే కవిత్వాన్ని ఆయా పద్యాలు వృద్ధిపఱుస్తాయన్న మాట. అసలు చెట్టుకు బీజమో? "బీజం యస్య పురార్జితం సుచరితమ్" అన్నాడు.

అయితే యీ సంపాదనకోసం కవిత్వంతో మేడలు నిర్మించడానికి మాకు మార్గప్రదర్శకు లెవరంటారేమో? పన్నాల రామబ్రహ్మశాస్త్రుల్లుగారి శిష్యులు యిద్దఱు జంటగా యీ సౌధబంధాలతో ద్రవ్యార్జన చేయడం చూచాము. ఆ శిష్యులిద్దఱిలోనూ వొకడు చాలా వాచాటకుడు, రెండోవ్యక్తి కొంచెం స్తబ్ధు. ఇద్దఱికీ బాంధవ్యం కూడా వుంది. తణుకు ప్రాంతమే వారి నివాసగ్రామం (వారి నామధేయం జ్ఞాపకం లేదు. వారి కవిత్వం అంతతో ఆగిపోయింది గాని పైకి రాలేదు. నామా౽పి న శ్రూయతే). వారి గురువుగారిని గూర్చి వినడమే కాని చూడలేదు ఆయన మంచి కవి అనిన్నీ, కూచిమంచి గోపాలకిష్టమ్మగారి వల్ల యేదో అపకారం జరగడంచేత 'ఖలకర్ణ విషాయణం' అనే పేరుతో యేదో శ్లేషగా ఒక గ్రంథం రచించినట్టు ఆ శిష్యుల వల్లనే విన్నాం. ఆ గురువుగారి కవిత్వం "తులసీ చత్వరే భాతి కలశీకృత మంటపే" అన్నది తప్ప నా కింతకంటె యితరం జ్ఞాపకం లేదు. ఆ విషాయణం దూషణాత్మకమే అయినా ఆయన ప్రజ్ఞావిశేషం దానిలో రసాయనంగానే నడిచి వుంటుంది. కాని అది పైకివచ్చినట్టు లేదు. భవతు.

ఆ శాస్త్రుల్లుగారి శిష్యులు మాకు భిక్షాటనానికీ, మేడలు కట్టడానికీ మార్గప్రదర్శకు లన్నది ప్రస్తుతం వక్తవ్యాంశం. సంపాదనార్థం, అదేనా చదువుకొనే పుస్తకాల నిమిత్తమే సంవత్సరానికి వొకటీ, లేదా రెండుసార్లు యాచ్నార్థం వెళ్లినప్పుడే

తెలుగుకవిత్వాన్ని స్పృశించడం. యితర కాలాల్లో సంస్కృతం తప్ప తెలుక్కేసి చూసేది లేదు. రెండోసారి కాశీప్రయాణం కట్టేవఱకున్నూ అడపాదడపా తెలుగు చెపుతూ సంస్కృతం కూడా అడపాదడపాగానే యే భాణం పేరో పెట్టి రచిస్తూ కాలం నడిచింది. ఆ కాశీప్రయాణసుముహూర్తం నాకు వివాహసుముహూర్తంగా మాఱినప్పుడు శ్రీ కిర్లంపూడి జమీందార్లలో పెద్దాయన శ్రీ బుచ్చితమ్మయ్యగారిని గూర్చిన పద్యాలలో వొకటి వుదాహరిస్తాను.

అంచితు లౌ భవజ్జనకు లాదర మొప్పగ గాశిలోన జె
ప్పించిన సర్వశాస్త్రముల బెంపుగ నధ్యయనం బొనర్చి రా
ణించెడి చర్లవంశవర నీరధిశారదచంద్రు సార్థతో
దంచితబ్రహ్మయాభిధ బుధాగ్రణిశిష్యుండ వేంకటాఖ్యుడన్

మా పరమగురువులు బ్రహ్మయ్యశాస్తుల్లుగారు యీ దేశంలో వ్యాకరణగ్రంథాలు చాలావఱకు చదువుకొని తరవాయి చదువుకు కాశీకి వెడుతూ కిర్లంపూడి సంస్థానానికి వెడితే పద్యంలో వున్న 'భవజ్జనకులు' అనేపదానికి వాచ్యంగా వున్న శ్రీ యినుగంటి సూరయ్యగారు చాలా ఆదరించి సాలు ఒకటికి రూ.60లు వార్షికం యేర్పఱచి (మా గురువుగారు కాశీలో తోడివిద్యార్థులతోపాటు సత్రాలలో భోంచేయలేదు, స్వార్జితద్రవ్యాన్ని ఖర్చు పెట్టుకొని చదువుకొన్నారు) కాశీలో వున్నంతకాలం మనియార్డరు చేయడమే కాకుండా దేశానికి వచ్చిన పిమ్మట కూడా ఆ వార్షికం వారు యావజ్జీవం జరిపారు. ఆ సందర్భాన్నే ఆ పద్యంలో నేను వుద్ఘాటించాను. నా వివాహం ఆ సంస్థానద్రవ్యం చేతనే జరిగింది. కాశీకి వెళ్లే పూర్వం తెలుగు కవిత్వధార యేలా వున్నదీ పయిపద్యంవల్ల చదువరులు తెలుసుకుంటారు గదా! ఇందులో శంక కవకాశం కలది వొక ప్రయోగం వుంది. జిజ్ఞాసువుల వుపయోగానికి కొంచెం చర్చిస్తాను. "చర్లవంశవరనీరధి శారదచంద్రు"అనే విశేషణం డువర్ణవిరహితంగా పడింది. దీనికి ప్రయోగాధారం తప్ప తెలుగులో సూత్రాధారం కనపడదు (తెలుగునకున్న వ్యాకరణదీపము చిన్నది). ప్రయోగం చూపుతాను.

ఎటులు మెప్పించేదో నన్ను నింకమీద
రావు సింగన్న భూపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొని యుండి నీవు
సకలసద్గుణనికురుంబ! శారదాంబ!

ఈ శ్రీనాథుని ప్రయోగాన్ని బట్టి ఆ ప్రయోగం సాధువు. ఇటీవల చాలా కాలానికి రచించిన పాండవనాటకాలలో వుద్యోగంలో కూడా ఈలాటి ప్రయోగం పడింది–

"గొల్లరా, చుట్ట మెఱుంగునే భువనశూరు సమీరకుమారు బీరమున్". ఆయీ చోట 'భువనశూరు' అనే విశేషణానిక్కూడా శ్రీనాథప్రయోగమే జీవకం. "విలువ గల కవుల లక్ష్యమ్ములె తా మీభారమెల్ల మోయగవలయున్" (ఆ యీ శంకా సమాధానాలు నా అంతట నేను లేవదీసినవే కాని వొకరు శంకిస్తే పుట్టినవికావు).

ఆయీ పద్యరచననాటికి పట్టుమని పది పద్యాలు కాస్త రసజ్ఞ లోకానికి రుచించేవి రచించినట్టు లేదు. సాహిత్యంమాత్రం కౌముదీజ్ఞానంతో మిళితమై యెదుగుతూ వుంది. తెలుగు సాహిత్యం లోకల్‌ఫండు స్కూలులో అలవడిం దెంతో అంతే. పైగా తెలుగంటే యింగ్లీషు స్కూల్ విద్యార్థుల కెంత గౌరవమో నాకూ అంతే. అయినా అంతకు పూర్వం దైవవశాత్తూ సంభవించిన వొకానొక చేదస్తంవల్ల తెలుగులో కొంత జ్ఞానం యేర్పడింది. ఆ చేదస్తం యేమిటంటే? మా పిన్న ముత్తాత (పెద్దకవీంద్రుడై పేరు చెందినవాడు పిన్నముత్తాత నర్సన్నగారు) స్వదస్తూరీతో వ్రాసిన యిరవైరెండు పెట్టెల తాటాకు పుస్తకాలున్నూ కాగితాలమీద వ్రాదామనే కోరిక పుట్టింది. యెప్పుడంటారు యీ కోరిక, చామర్లకోటలో చదువుకొనే రోజుల్లో. అనధ్యాయపుదినాలు నెలకు యెనిమిదిన్నీ యానాం వచ్చి, దీక్షగా, వంచిన నడుం యెత్తకుండా యిదే పని చేసేవాణ్ణి. ఆ మూడు మాసాలలోనూ వచ్చిన అనధ్యాయాలు ఇరవైనాలుగురోజులలోనూ మా ముత్తాతగారి స్వంత కవిత్వంలో యామినీపూర్ణతిలకానున్నూ, అహల్యాసంక్రందనవిలాసమున్నూ వ్రాయగలిగాను. మా ముత్తాతగారికవిత్వం యెక్కడో వొకపద్యం తేలికశైలిలో వున్నా చాలాభాగం నారికేళపాకంలో వుండేది. అందుచేత దాన్ని బద్దలుకొట్టడానికి స్వయంకృషి చాలేది కాదు. దానికోసం యెవరినో పెద్దల్ని ఆశ్రయించవలసివచ్చేది. దానాదీనా మిడిమిడిజ్ఞానం తెలుగులో పరమగురుసాన్నిధ్యం చేరక పూర్వమే యేర్పడిందన్నది పరమార్థం.

యే పుస్తకమేనా యితరులు వ్రాసి వుంచిందో, అచ్చుపడివున్నదో చదవడం కంటే స్వయంగా వ్రాసుకుచదువుకోవడంలో యెంతో ప్రయోజనం యిప్పుడు పూర్తిగా అంతరించింది. కారణం అచ్చుపుస్తకాలల్లో చదవడమే. యిప్పటి సాహిత్యం "పుస్తకేషుచ యా విద్యా పరహస్తేషు యద్ధనమ్"[2] అన్న తరగతిలో వుంటుంది. అప్పటిదో? వాచో విధేయంగా వుండేది.

---

2. పుస్తకేషుచ యా విద్యా, పరహస్తేషు యద్ధనమ్।
   సమయేతు పరిప్రాప్తే నసా విద్యా న తద్ధనమ్।। *(చాణక్య నీతి)*

పుస్తకాలలోనే ఉన్నజ్ఞానం, ఇతరుల వద్ద ఉన్నధనం–ఇవి సమయానికి అక్కరకురావు.

"వాగ్దేవీ వదనాంబుజే వసతి చే త్కానామ దీనా దశా" అన్నాడు ఒక మహాకవి. ఆ మహాకవి యీ మాట మఱో సందర్భంలో వుపయోగించినా నేను దాన్ని యీ సందర్భంలో వుపయోగిస్తున్నాను. ప్రస్తుతం అందుకుంటాను.

పైని వుదాహరించిన పద్యం చెప్పేనాటికి మనస్సులో యమకకవిత్వం చెప్పాలనీ, అలంకారాలతో, యేవోయేవో అపూర్వకల్పనలతో కవిత్వం చెప్పాలనీ వుబలాటం వుండేది. కాని బాగా సాగేది కాదు. సాగినా అది ఏకవితాలూకు వుచ్ఛిష్టమో అయినట్టే తోచి వదులుకోవలసి వచ్చేది. లోగడ శ్రీరంగేశ్వరుణ్ణి గూర్చిన పద్యంలో యేదో కాస్త వుపమాలంకారం పడిందని సంతోషిస్తూ వుంటే యెవరో అన్నారుగదా – యిది గ్రంథచోరత్వం కిందకి వస్తుందన్నారు (మెఱుగు చెంగట నున్న మేఘంబు కైవడి నువిద చెంగటనుండ నొప్పువాడు). యిది శ్రీమద్భాగవతం లోది. ఆ శ్రీరంగేశ్వర పద్యరచననాటికి యీ భాగవతం చదవకుండానే వుంటానా? నేను చదవకుండా వుంటే మాత్రం ఆయీ మాట లోకం – అందులో ప్రతివాదిలోకం విశ్వసిస్తుందా? (నాకు మొదటినుంచీ ప్రతిపక్షులు వుంటూనే వుండేవారు. ఆ బాధ యిప్పటికీ శాంతించలేదని వ్రాయనక్కరలేదు).

పండితుడిజీవితంకంటే కవిజీవితం చాలా (మొట్టమొదటే అనండి) లోకవిరోధాస్పదంగా వుంటుంది. వీడు యెవ్వడికీ ఏవిధమైన అపకారమూ చేయకపోయినా యేవెట్టిమొట్టి పద్యమో వ్రాయడమే అకారణవిరోధాన్ని పుట్టిస్తుంది. క్రమక్రమంగా లోకాదరాన్నిన్నీ కలిగిస్తుంది గాని ఆ భాగ్యం పట్టడానికి కొన్ని దశలు పడుతుంది. అప్పుడేనా యెవడికో నూటికి వొక్కడికి మాత్రమే. యేదో తనలో తాను చెప్పుకొంటూ వూరుకుందామంటే, అలా వుండనివ్వరు. యెవరో మహాఆప్తులలాగ వచ్చి, యేదీ నీ వేదో కవిత్వం చెప్పావట! కాస్త వినిపించమంటారు. వినిపించకపోతే వీడికి గర్వం అంటారు. వినిపిస్తే ఆ విన్నవారిలో కొందఱు వూరుకున్నా కొందఱు పూర్వపక్షాలకు దిగుతారు. యిదంతా తల్చుకుంటే యిప్పుడు యేలాగో కనపడుతుంది. వయస్సు తక్కువగా వుండి కవిత్వం చెప్పేవాణ్ణి మఱీ లోకువగా చూస్తుంది లోకం.

కాశీ వెళ్లివచ్చిన కొత్తలో సంపాదనార్థం ముమ్మిడివరం వెళ్లినప్పుడు అన్నపూర్ణాష్టకం వినిపిస్తూ వుండగా వొక ముసలిపండితుడు చేసిన శంక యెక్కడో యిదివఱలోనే వ్యాఖ్యానించి వున్నాడు. అన్నపూర్ణను గూర్చి ప్రార్థిస్తూ నేను "మత్సద్మ నిస్థీయతామ్" అని వేడుకుంటే, ఆ వృద్ధపండితుడు మహాగ్రావణ్యంగా నాకేసి చూచి "అబ్బాయీ! మీ యిల్లు తాటాకిల్లా, పెంకుటిల్లా" అని ప్రశ్నించాడు.

దీన్నిబట్టి చూస్తే కవిత్వం చెప్పేవాడికంటే లోకువ వ్యక్తి లోకంలో వుండనే వుండ డనవలసి వస్తుందేమో? పరిశీలకులు ఆలోచించాలి. దేవతా ప్రార్థనకీ, యింటికి సంబంధం వుంటుందని యేసహృదయు లనుకుంటారు? పద్యంగాని, శ్లోకంగాని వినిపించడానికి ఆరంభం చేసేటప్పటికల్లా తప్పు పడదామనే వూహేగాని యేదో విందామనే వూహ సభ్యులలో యెవరికో తప్ప వుండనే వుండదు. అందుచేత కవిజీవితం చాలా దుర్భరంగా వుంటుందని నేననుకుంటాను. "భాగ్యవంతం ప్రసూయేథా మాశూరం మాచ పండితమ్" అందులోనూ కవిత్వాన్ని జీవనోపాధిగా బెట్టుకొన్నవాళ్ల జీవితాన్ని గూర్చి చెప్పనే అక్కర్లేదు.

సభజేయించునొ లేదొ యంచు మొదటన్ సందేహ మా మీద నీ
సభలో నేమిట లోపమౌనో యనుచున్ సందేహ మా మీద నీ
సభలో నింతకు లాభమేమొ యనుచున్ సందేహ మూహింప నీ
సభలన్ జేసెడివారి పో జగతిలో సందేహ సంరక్షకుల్

ఆయీ పద్యం వేంకటగిరి సంస్థానం వెళ్లినప్పుడు చెప్పింది. కిర్లంపూడి పద్యం చెప్పేటప్పటికి యీ పద్యం చెప్పేనాటికి వున్నంత జ్ఞానం లేదు. ఆ పద్యానికీ, యీ పద్యానికీ మధ్య యెంత వ్యవధి వుందంటే, నాలుగేళ్లు వుంది. అది విరోధిసంవత్సరంలో *(1889)* చెప్పింది. యిది విజయలో *(1893)* చెప్పింది. ఆ పద్యం చెప్పే సందర్భంలోనే యమకంగా చెప్పడానికి వొకపద్యమయితే మొదలు పెట్టానుగాని అది యేదో మాదిరి గానే నడిచింది గాని పయిపద్యం మాదిరిని నడిచింది గాదు. వుదాహరిస్తాను :

ఓ యినుగంటి తమ్మయనృపోత్తమ! నీదు ప్రతాపతుల్యుగా
నాయినుగంటి నాయనకు నాదువివాహప్రసక్తి లేమిచే
నాయినుకంటె మీర లధి కాఢ్యు లటంచు మదిన్ దలంచి మి
మ్మే యినుగంటి నిప్పటికిన్ మేల్మిమెయిన్ దపమధ్యకాంక్షినై

యీ పద్యంలో తుట్టతుదనున్న 'దపమధ్య' శబ్దానికి ధన మని అర్థం. దకారపకారాలకి మధ్య వున్న అక్షరాలు 'ధ-న' అని రెండేకదా! యీలాటి వెఱ్ఱిధోరణిలోనే మొట్టమొదట రచన నడిచేది. మఱిన్నీ ఆయీ పద్యంలో తలపెట్టిన యమకమే మఱి పదేళ్లకి వికారి సంవత్సరంలో (1899) శ్రీకిర్లంపూడి జమీందారుగారు నవరాత్రమహోత్సవాలకు ఆహ్వానించినప్పుడు తలపెట్టితే యేలా నడిచిందో చూపుతాను, చూడండి -

ఇనుగంటి న్నిను గంటి భేద మొకయింతేనిం గన రాదు సో
ముని గంటి న్నిను గంటి భేదము లవమ్ముం గానగా రాదు మే
ఘునిగంటి న్నిను గంటి భేద మరయన్ గోరంతయున్ లేదు మీ
యినగంట్యన్వయ మెంత చేవ గలదోయీ! చిన్నరాయాధిపా!

ఆ పద్యంలో నడవని యమకం యీ పద్యంలో అవలీలగా నడవడాని క్కారణం క్రమంగా అనుభవం యెక్కువ కావడమే. యీ పద్యం చెప్పేటప్పటికి శ్రవణానందమే కాదు, శ్రీదేవీభాగవతం కూడా సుమారు నాల్గుస్కంధాలదాకా తెలిగించడమే కాకుండా ఆత్మకూరిరాజుగారికి కృతిగా రచించిన శ్రీనివాసవిలాసం కూడా పూర్తి చేయబడింది.

మళ్లా కిర్లంపూడిపద్యాల తరవాయినే అందుకుంటాను. అప్పుడు అవసర మైనప్పుడు తెలుగుకవిత్వం చెప్పినా తెలుగు కవుల మనిపించుకుందామనే కుతూహలం లేశమూ వుండేది కాదు. పైగా అలా అనిపించుకోవడంలో యేదో అవమానం వున్నట్టు తోచేది. ఆ కారణం చేతనే కిర్లంపూడి పద్యం చెప్పిన నెలరోజులకే కాశీ వెళ్లినప్పుడు అక్కడ దేవతలను గూర్చి చెప్పిన కవిత్వమంతా సంస్కృతమే. వాట్లనే 'కాళికాదిస్తోత్రమాల' అనే పేరుతో అచ్చు వేశాము. ఆ కవిత్వంలో మొట్టమొదటి అష్టకం కాళికాష్టకం ('నాళీకజాద్యదితిజాళీ'. చూ). ఆయీ అష్టకకవిత్వంలో యేవో కొన్ని శ్లోకాలు సాపుగా వున్నా ఆరంభదశలోవి కావడంచేత విశేష సాపుగా వుండవు. కాని అక్కడ వున్న రోజుల్లో శ్రీ ద్రావిడ సుబ్రహ్మణ్యశాస్త్రుల్లు గారి కొమార్త వివాహసందర్భంలో రచించిన శుభలేఖాశ్లోకం మాత్రం మంచి ధోరణిలోనే నడిచింది. ఆ జగత్పండితులు మెచ్చుకొని దీన్నే స్వీకరించారు. వుదాహరిస్తాను –

శ్లో॥ మున్యబ్ద్యంకేందువర్షే గుణగణమహితే రాధమాసే వళక్షే
పక్షేஉ నంగస్య తిథ్యా మసురగురుదినే మత్సుతాయా వివాహః
ప్రాతర్భావీ బుధేంద్రామహఇహభవతాం యాచతే సన్నిధానం
శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రీ ద్రవిడకులభవ స్స్వాహితాగ్ని ర్వినీతః

అష్టకశ్లోకరచనాకాలమున్నూ, యీ శ్లోకరచనాకాలమున్నూ వొకటే అయినా యీ శ్లోకరచన చాలా సాపుగా వుంటుంది. అష్టకశ్లోకాల్లో కొన్ని విధాల యమకం నడిచినా ఆ శ్లోకాలేవీ దీన్ని పోలవు. యీ శ్లోకం చెప్పి యిప్పటికి యేభైయేళ్లయింది. యిప్పుడు, అనగా డెబ్భైయేళ్లు దాటిన యీ వయస్సులో చెప్పవలసివచ్చినా ఇంతకన్న మంచిగా చెప్పడం పొసగదన్నమాటే.

కాశీలో నేను వున్నదల్లా అయిదుమాసాల సుమారు మాత్రమే. అక్కడినుంచి రావడంతోటట్టే కోనసీమకు అష్టావధానాల కంటూ బయలుదేఱి అక్కడ సంస్కృత శ్లోకాలతోటే మాట్లాడడం మొదలుపెట్టాను. ఆ ధోరణికి పండితులే డంగైపోతే యితరులమాట చెప్పేదేమిటి? యిదంతా "పటాటోపో భయంకరః". ఆ శ్లోకాలు యిప్పుడు జ్ఞప్తిలో లేవు. వొక్క చరణం మాత్రం జ్ఞాపకం వుంది.

"యానాం నామకపట్టణం హి వసతి శ్రీవేంకటేశోఽ స్మ్యహమ్"

గంగాసంతర్పణ వగైరాలు చేసుకొని మళ్లా గురువుగారి సాన్నిధ్యానికి చేరిన తరవాత కవితావ్యాసంగం శాస్త్రాధ్యయనానికి అంతరాయం కలిగిస్తుంది కనక కొంతకాలం ఆపవలసిందన్నారు గురువుగారు. అప్పుడు గత్యంతరం కనపడక శాస్త్రానికి సంబంధించిన కవిత్వమే అయితే శాస్త్రుల్లుగారు కొంతమట్టుకేనా అంగీకరిస్తారని వూహించి 'ధాతురత్నాకర' మనే పేరుతో రామాయణగాథ రచించడానికి ప్రారంభించాము. యెంత కఠినంగా కవిత్వం చెపితే అంత గొప్పపేరు వస్తుందనే అభిప్రాయంతోటి రచన సాగించడం చేతనే అది కొంత పాషాణపాకంలో వుంటుంది. కొంచెం వుదాహరిస్తాను :

విపక్షరక్షఃపరిశిక్షణక్షఽ మో ప్యభీక్ష్ణతీక్ష్ణాక్షరరూక్షవీక్షణే।
నచ క్షణం తైక్ష్ణ్య మివాశుశుక్షణి ర్మణౌ డుఢౌకే యమశిక్షణక్షణః॥

యీ శ్లోకంలో క్రియాపదం యెంతో మాఱుమూలది కాదు, యేమాత్రం ధాతుపాఠ జ్ఞానమున్నా బోధపడుతుంది. వుపమావిషయం యేకొంచెమో తర్కసంప్రదాయం తెలిస్తే తెలుస్తుంది గాని ప్రసాదగుణం లేకపోవడం చేత వెంటనే తాత్పర్యం బోధపడదు. శ్లోకం చాలా బింకంగా క్షకారాలతో నిండించినా యింకా కొన్ని క్షకారాలు పడలేదుగదా అనే చింత మాకు వుండేది. క్షకారమయంగా వున్న రచన చూపించడం జరిగింది. కనక త కారమయంగా వున్నది కూడా వొకటి చూపుతాను –

వితండకసుత శ్రుర్నతశ్రుతవతాం వతంస స్సతే।
పతేసుతగతా వితశ్చ తురతామితి త్వత్రకౌ॥

వచ్చిన అక్షరం అసకృదావృత్తిగా వచ్చేటట్టు చెప్పగలిగాం గదా అనే సంతోషమే కాని కవిత్వం లోకం కోసం పుట్టిందిగదా, ఆ లోకానికి యీ తకారాలతోటీ, క్షకారాలతోటి అవసరం వుంటుందా అనే శంకే కలిగేది కాదు. అయితే యీ క్షకారాలకీ, తకారాలకీ సంతోషించే విద్వాంసులున్నూ వుంటారు గాని వారు కవిత్వతత్త్వాన్ని యెఱిగినవారు కారు. ఆ రోజుల్లో మేము విద్యార్థులకు పాఠాలు

చెప్పే భాగవతచంపు వగయిరాలలో ఆలాటి శ్లోకాలే కనపడేవి –

దయితో మే యశోదాయా దయాదోఽయం దయామయే।

దేవి! తే దయయా భూయా దాయాసోఽయం కియా నయే॥

యిది అభినవకాళిదాసు భాగవతచంపులో చెప్పిన శ్లోకం అతడు అర్థప్రధానంగా చెప్పిన శ్లోకాలు యెన్నో వున్నప్పటికీ వాట్లమీదకంటే యీ శబ్దాడంబరం మీదకే మనస్సు పరిగెత్తేది. మొట్టమొదట ప్రతీ విద్యార్థికీ శబ్దాడంబరం మీదనే యెక్కువ ఆస్థ వుంటుంది. అర్థగాంభీర్యం దగ్గిఱికి బుద్ధి మళ్లడానికి చాలాకాలం పడుతుందనే నేను నా అనుభవాన్ని చెపుతూ వున్నాను.

కాళిదాసుగారి "స రాజ్యం గురుణా దత్తం" వగైరా కవిత్వం యెందుకూ పనికిరానిదనిన్నీ, వేంకటాధ్వరి లక్ష్మీసహస్రంలోని –

ప్రాతరంబుజవిడంబిలోచనాం మాతరం త్రిజగతా ముపాస్మహే।

శీతరమ్యకరుణావలోకనై ర్యా తరంగ యతి మంగళాని నః॥

అనేదే సర్వోత్కృష్టకవిత్వమనిన్నీ అనుకున్న కాలం చాలావుంది. 'ప్రాతరం, మాతరం, శీతరం, యాతరం' అనే పదాలు మనస్సును యిట్టే ఆకర్షించేవి. లాక్షణికులు యమకకవిత్వాన్ని అధమకవిత్వంకింద జమకట్టడం చూచి నే నెంతో నొచ్చుకొనేవాణ్ణి కూడాను. ధాతురత్నాకర కవిత్వంలో చాలాభాగం యమకంతోటే నింపాలనే వూహ వుండేది గాని ధాతుపాఠక్రమంగా కవిత్వాన్ని నడిపించే నియమశృంఖల మూలాన్ని ఆ ప్రయత్నం యేకొంచెమో తప్ప కొనసాగింది కాదు. ఒక్కొక్క చోట ఆ ధాతుపాఠక్రమం కూడా మావుద్యమానికి అనుకూలించేది. అట్టి సందర్భంలో యెంతో సంతోషంగా వుండేది మాకు. వొకటి చూపుతాను –

నరాః కింనరాః పన్నగా యక్షసంఘా స్సురా స్సిద్ధసంఘా స్తదానీ మతీవ।

అణంతో భణంతో రణంతో వణంతో మణంతః కణంతో జయం రామచంద్రే॥

ఆయీ ణకారాంత– ధాతువులకన్నిటికీ అర్థం వొకటే – 'పలికిరి' అనేదే. ఆఱుకర్తృ పదాలుండడంచేత ఆఱు క్రియాపదాలూ సమన్వయించుకోవడానికి వీలిచ్చింది.

నూతనదంపతులకు శాకుంతలాదినాటక కవిత్వమే రుచిస్తుందో, భగవద్గీతాకవిత్వమే రుచిస్తుందో తెలిసినవారికి విద్యార్థిదశలో, లేదా కొత్తగా కవిత్వం చెప్పేరోజుల్లో శబ్దాడంబరమే రుచిస్తుందో, అర్థగాంభీర్యమే రుచిస్తుందో బోధపడుతుంది. కాళిదాసు "ద్వైపాయనప్రభృతి శాపాయుధ త్రిదివసోపాన ధూళిచరణా" అనే శ్లోకాలు కూడా చెప్పివున్నాడని తెలిసివుండంచేతగాని,

రఘువంశాదులు మాత్రమే రచించడం మట్టుకే అయితే అతడు కవి కాడనే నే ననుకోవలసివచ్చేది. యీ విభ్రాంతినిబట్టే ధాతురత్నాకరంలో యెంతో ప్రయత్నించి యీలాటిరచన సాగించవలసివచ్చింది.

రాఘవ! దుష్టతరాఘవనాగ్నే పామరపాల! నృపామరపాల!।
దేవ! రమాప! ముదే వర మాప న్నాశక! పిట ఘనాశకవాటమ్॥

వచ్చినమాట మళ్లా వస్తూ వుందనే సంతోషమే కాని యితరలోపాలమీదకి ఆరంభ దశలోనే కాదు, మధ్యకాలంలో కూడా బుద్ధి ప్రసరించదనే నే ననుకుంటాను. (కొందఱికి యావజ్జీవమున్నూ బుద్ధి యమకాదుల మీదే మసలడమున్నూ వుంటుంది). ఉదాహరించిన శ్లోకంలో నాలుగోచరణంలో 'పిట' ధాతువు క్రమప్రాప్త మవడంచేత ప్రయోగించకతప్పదు. దాన్ని యమకభంగం లేకుండా యిమిడ్చే టప్పటికి మా పెద్దలు దిగి వచ్చారు. ఆయీ శ్లోకాలు అహల్య రాముణ్ణి స్తుతించే ఘట్టంలోవి. మఱి కొన్ని వున్నాయి. అన్నీ యీమాదిరి గానే వుంటాయి.

దాశరథే శరధే ! సుగుణానాం చారుజయే రుజయేరిత మేతత్।
మానస మద్య సముద్యమినమ్యే సారమయే రమయే నటతీశ!॥

ఆయీ శ్లోకాలకు అర్థం చెప్పడానికి కొన్ని వంకరమార్గాలున్నూ, వ్యాకరణ సూత్రాలున్నూ ఆధారంగా వుంటేనే కాని కాపరం తుద నెగ్గదు. రసారసవిచారాని కేం గాని విద్యార్థిదశలో యీ కుస్తీలో బాగా కృషి చేసివుంటే పరిణామదశలో యెన్నో విధాల వుపకరిస్తుంది (కామిగాక మోక్ష కామి గాడు.చూ). అంతేనే కాని యిది యీ స్వరూపంతోనే వుపకరించడం సర్వకల్ల. యీ విషయం యింకా విడమర్చి వ్యాఖ్యానిస్తాను. సంగీతం వుందనుకోండి. దాన్ని అభ్యసించేటప్పుడు అకార సాధనమంటూ చేస్తారు. అలా చేయడం యెప్పుడంటే? మంచి నడిశీతా కాలంలో తెల్లవాఋజామున చల్లటి నీళ్లకుండని కాగలించుకొని చేస్తారు. యింకా యీలాటివే యేవో వుపాయాంతరాలు వుంటాయి ప్రతీవిద్య నభ్యసించడానికిన్నీ. సభలో గానం ప్రదర్శించే పాటకుడు తనవిద్యార్థిదశనాటి వర్కంతా చూపెట్టడానికి మొదలెడితే యెవరేనా సంతోషిస్తారా ? "అనంతశాస్త్రం బహువేదితవ్యం....... .......యత్సారభూతం తదుపాసితవ్యమ్"[3] అన్న అభియుక్తోక్తికి వుదాహరణంగా

---

3. అనంతశాస్త్రం బహు వేదితవ్యం, స్వల్పశ్చకాలో బహువశ్చ విఘ్నాః।
యత్సారభూతం తదుపాసితవ్యమ్, హంసోయ యథా క్షీరమివాంబు మిశ్రమ్॥
శాస్త్రములా అనంతములు. తెలియదగినదా మహాసముద్రమంత. కాలమా స్వల్పం. విఘ్నములు లెక్కలేనన్ని. హంస పాలను స్వీకరించి నీటిని విడిచినట్లు కావలసినమేరకు సారభూతమైన దానినే మనం తెలుసుకోవడానికి ప్రయత్నించాలి. *(ఉత్తరగీత-3.1)*

ప్రవర్తించాలన్నమాట. యుద్ధానికి వెళ్లిన యోద్ధ తన చిన్నప్పుడు ధనురాచార్యులు చేయించిన బస్కీలూ, తీయించిన గుంజీలూ మొదలుపెట్టినట్టు కవిత్వంలో పరిణామ స్థితికి వచ్చిన కవి తన బాల్యాద్యవస్థలలో పోయిన పోకడలు, యమకచిత్రాదులు చాలావఱకు వదులుకోకపోతే హాస్యాస్పదు డవుతాడు. యే ఆశ్వాసాంతాలలోనో చూపుకుంటే చూపుకోవచ్చును. అదేనా యెందుకంటారు? నాకు చతుర్విధకవిత్వం రచనలున్నూ తెలుసు సుమండీ అని లోకానికి నచ్చజెప్పడానికి మాత్రమే. అంతేకాని ఆ కవిత్వంవల్ల రసజ్ఞలోకానికి కలిగే ఆనందం లేశమూ వుండదు (ప్రబంధరాజ వేంకటేశ్వరవిలాసం యెందరు చదువుతారో పరిశీలించండి). విశేషమైన అర్థపు సొగసు లేకపోయినా చక్కని పదాలకూర్పుతో వున్న రచన కూడా హృదయాన్ని ఆకర్షిస్తుంది –

వయం వకుళమంజరీ గళదరీణమాధ్వీఝరీ
ధురీణశుభరీతిభిః ఫణితిభిః ప్రమోదామహే

యిందులో వరసగా అయిదు రీకారాలు గల సమాసం యెంతో ముచ్చటగా పడింది. పైషోకేగాని అర్థంలో యేమంత సొగసు లేదు లేకపోనూ లేదు. అంత లోతులోకి యెవరోగాని పోరు. వినేటప్పటి కల్లా సంతోషం కలుగుతూ వుందా లేదా అనేదే విచార్యం. ఆ శ్లోకం బాపతే పూర్వార్థం కూడా వుదాహరిస్తాను – తారతమ్యం పరిశీలించండి.

ఘటః పట ఇతి స్ఫుటం పటు రటంతి నైయాయికాః,
పఠంతి చ హఠాత్తరాం ఖఫఛఠేతి పాతంజలాః

లోగడ వుదాహరించినదానికి, దీనికీ వున్న భేదాన్ని సహృదయులు తెలుసుకుంటారు. లోగడ వుదాహరించిన రీకారపంచక సమాసంలో వున్న 'ఝరీ' శబ్దం తప్పని అపవదించేదగ్గిఱికి వచ్చిన యీ కాలంలో వుండే కవులస్థితి శోచ్య మనక తప్పదు (ఝరీశబ్దం తప్పనుకొని శంకించడంకన్న ప్రమాదం లేదని యెన్నో సుప్రయోగాలు చూపివుండడం చేత యిక్కడ స్పృశించి విడిచాను. అమరవ్యాఖ్యానం చూచినా యీ విషయం తెలుస్తుంది). అక్కడక్కడ యీలాటి సమాసప్పోకడ రసోచితంగా వుండడం కవికి వుండే పాండిత్యాన్ని తెలుసుకోవడానికి వుపకరిస్తుంది.

బహురత్నద్యుతి మేదురోదర దరీ భాగమ్ములం బొల్చు ని
మ్మిహికాహార్యమునం జరింతు మెపుడుం బ్రేమ న్నభోవాహినీ
లహరీశీతలగంధవాహ పరిఖే లన్మంజరీసౌరభ
గ్రహణేందిందిర తుందిలంబు లివి నుత్కాంతార సంతానముల్

లోగడ వుదాహరించిన రీకారపంచక సమాసానికీ మించిపోతూ వుంది యీ ఆంధ్రకవితాపితామహుడు గారి సమాసగ్రథననైపుణ్యం. 15 పర్వాలు భారతం తెనిగించిన సోమయాజులుగారికిగాని అసలు ఆంధ్రకవిత్వానికే త్రోవ చూపిన నన్నయ్య గారికిగాని లేని పితామహబిరుదు కృష్ణరాయలవంటి విద్వన్మహాకవి వూరికేనేనా యిచ్చింది? యిస్తే యిస్తాడు గాక తన్ను ఆశ్రయించిన కవి గదా అని! రాయలు ఆస్థానంలో వుండే దిగ్గజాలు నోరుమూసుకొని వూరుకొనేవారేనా? ఆ దిగ్గజాలు రాజుకు భయపడేవారే అయితే యెన్నో కథలు అబద్ధం కావలసి వస్తాయి. సింగభూపాలుణ్ణి గూర్చి –

సర్వజ్ఞ నామధేయము
శర్వునికే రావుసింగజనపాలునికే
యుర్విం జెల్లెడి నితరుని
సర్వజ్ఞుం డనుట కుక్క సామజ మనుటే

అని వొకకవి పద్యం చెప్పితే దీనిలో "రావు సింగజనపాలునికి+ ఏయుర్విం జెల్లెడిన్" అని అర్థాంతరం తీసిందెవరు? కవులేకదా! ఆ రోజులలో ఆ సింగభూపాలుడు యేంచేయాలంటే చేయలేడు? ఆ కవి తీసిన అర్థాంతరంలో వచ్చిన అవమానం అంతా యింతానా? దానికి భూపాలుడు బుఱ్ఱకాయ తీయించినా తీయిస్తాడను కోవాలి(ఆయీ అపార్థం భూపాలుడున్న సభలో తీసివుండడు, యే చాటునో జరిగి వుంటుందనే వాదం రావచ్చును. దాన్ని గూర్చి మఱొకప్పుడు చూచుకుందాం). అయితే ఆ అపార్థం తీసిన కవిమాత్రం బుఱ్ఱకాయ పోతుందని భయపడేవాడై వుంటాడా? పోతే పోయింది, బుఱ్ఱకాయ మఱోటి వస్తుం(వాసాంసి జీర్ణాని యథా విహాయ) దనే రకంలోవాడై వుంటాడు. యిది విషయాంతరం.

పెద్దన్నగారి కిచ్చిన బిరుదాన్ని గూర్చి కాగడా పత్రిక తాలూకు సంచికలో యేదో కొంత చర్చ చదివినది జ్ఞాపకం వచ్చి ఆ యీ రెండు మాటలూ వ్రాశాను. తెలుగులో ప్రబంధకవిత్వానికి మార్గదర్శకత్వం పెద్దన్నగారియందు వుండడంచేతనే రాయలవారు "ఆంధ్రకవితా పితామహుడ నెవ్వ రీడు పేర్కొన నీకున్" అనవలసి వచ్చింది. అట్లా అనడం న్యాయంగా వుండడం చేతనే దిగ్గజాలు సమ్మతింపవలసి వచ్చిందన్నది పరమార్థం.

ధారాశుద్ధికూడా సహృదయాకర్షకం కావడం వుంది అని వ్రాస్తూ మఱికొంతదూరం వచ్చాం. మళ్లా వెనక్కి మళ్లాలి. అభ్యాసావస్థలో అభినవకాళిదాసు గారి భాగవతచంపులో వుండే–

మురాంతక పురాంతక....... దయారసమ
యాశయే మనసి శంకరాహ్లాదిని

లోనైన శ్లోకాలు చూచి ఆ మాదిరిని కొంత కవిత్వం నడిచింది. కొంచెం వుదాహరిస్తాను:

1. లటిష్యతి మహా నహర్పతికులే జలజేక్షణో
రమాపతి రమాపతిప్రముఖనిర్జరారాధిత

2. శాంతయా గుణసందీప్తా
శాంతయా శాంతయా తయా

3. విశ్వామిత్రవచ శ్శృత్వా
విశ్వమిత్ర స్సరాఘవః

యీ విధంగా వచ్చినమాట మళ్లా వచ్చేటట్టు చెప్పడమే గొప్పనుకొని కవిత్వం చెప్పడం కొంతకాలం జరిగిందన్నమాట. ఆయీ మాదిరి కవిత్వమంతా సంస్కృతంలోనే గతించింది. మొట్టమొదటి బందరు శతావధానంనాటికి యింకా యీ చేదస్తమయితే వదలలేదు గాని ఆ వూళ్లో రామన్నపేట కంపెనీవారు శుక రంభాసంవాదాన్ని శ్లోకరూపకంగా తేలికగా వుండేట్టు రచించిపెట్టు మన్నారు (అప్పటికి పూర్వకవికృతమైనది వొకటి శుకరంభాసంవాదం వుండగానే కోరారన్న మాట). వారి కోరికను పట్టే అనుకోండి, లేదా అప్పటికే కొంత కస దిగిన స్థితికి కవిత్వం వచ్చి వుండడంచేత అనుకోండి అది సంస్కృతమే ఐనా తెలుగుమాదిరినే (సర్వే సర్వత్ర కాదు) యేమాత్రం భాషాజ్ఞానం వున్నా తాత్పర్యం అయే శైలిలో నడిచింది. నాటకానికి వచ్చేవాళ్లు విశేషించి పామరులే వుంటారు. పండితులు అసలే వుండరనే చెప్పవలసి వస్తుంది. అందుచేత ఆబాలగోపాలమూ తెలిసే శైలిలో వుండాలని నాటకులు కోరారు.

తద్బాల్యం ఖలు యత్ర వాఽపి పఠితం శృంగారకావ్యాదికం
తద్వైయౌవనమార్జితం యువతభిస్సఖ్యం పునర్యత్ర వా,
వృద్ధత్వంతు తదేవ యత్ర తు నమో ముక్తౌ నిషక్తం భవే
త్కా మీ యో స భవే మ్మనే ! సతు కథం ముక్త్యాఽభిషిక్తో భవేత్?

సంస్కృతంలో యింతకంటే తేలికకవిత్వం వుండదంటే వొప్పని సహృదయ లుండ రనే నేను విశ్వసిస్తాను. యిది రంభ చెప్పేమాట. శుకుడు చెప్పేమాట సిద్ధాంతకోటిగా వుంటుంది. కవికి అంతర్భావం చెప్పవలసివస్తే సిద్ధాంత వాక్యంలోనే చెప్పాలి.

బాల్యం తత్థలు యత్ర మాధవకథా భక్త్యా పునః పఠ్యతే
తారుణ్యం చ తదేవ యత్ర తు మహాఽ ఽ సక్తిర్ద్వరౌ వర్తతే,
వృద్ధత్వం చ తదేవ యత్ర తు మనో ముక్తౌ నిషక్తం భవేత్
యత్రైఽ తాని న సంతి శుద్ధమనసా తత్కేన సమ్మావ్యతే?

ఆయీ కవితారచన బ్రహ్మచారిదశలోదే. విద్యార్థిత్వం కూడా వదలలేదు గాని గురుసాన్నిధ్యంలో వుంటేతప్ప యితరత్రకు వెడితే పండితులలో పద్దు వుండేది. ఆయీ పద్దు కాకినాడలో అవధానం చేసినప్పటి నుంచీ ప్రారంభమయింది. అవధానాలలో యెవరేది అడిగితే అదే చెప్పేవాళ్లం గాని వయస్సు యౌవనారంభంలో వుండడంచేత శృంగారకవిత్వానికి యెక్కువగా పరుగెత్తేది. దాన్నిబట్టే వీధినాటకం వొకటి సంస్కృతంలో రచించబడింది. అది చాలా పచ్చిగా వుంటుంది. ధారాలోపం లేదు.

1. పశ్యతో మమ మనోహర త్యహో! పశ్యతోహర మనోహరాంగనా।
   పశ్యతా మపకృతం విరించినా పశ్యతాంను గణికా మకారిణా॥

2. వేశ్యాఽ వశ్యాయభామప్రతిభటలపనా లాస్య మాతన్వతే

యీ శైలిలో వుంటుంది దాని రచన. శ్రీనాథుని వీథినాటక పద్యాలు వరవడిగా బెట్టుకొని దాన్ని మొదలుపెట్టాము. ప్రతాపరుద్రీయంలో వీథిరూపకానికి "యత్ర భాణవ దంగానాం క్లుప్తిర్వృత్తిస్తు కైశికీ" అనిమాత్రం లక్షణం వ్రాసి "ఉదాహరణంతు మాధవ వీథ్యేదికం ద్రష్టవ్యం" అని వ్రాసి వూరుకున్నాడు. ఆ మాధవవీథి గాని, మఱోటిగాని యెక్కడా వీథిరూపకాలు అప్పటికే పఠనపాఠాల్లో కనపడడం లేదు. అందుచేత మేం రచించింది (లక్ష్యజ్ఞానం లేని రచన కావడం చేత) అంత మంచిస్థితిలో లేదని తరవాత తరవాత మాకే తెలియవచ్చింది. దీన్ని అచ్చువేసుకొని మాకు యేవో కొన్ని ప్రతులు మీకు తోచినన్ని యివ్వవలసిందని వ్రాస్తే, అది నచ్చకే అనుకుంటాను, మా పుస్తకాన్ని మాకు వాపసు చేశారు. కొన్ని శ్లోకాలు బాగానే వున్నా చాలా భాగం మిక్కిలి పచ్చిశృంగారంగానే వుండడం చేత యిటీవల యెన్నిమాట్లో సంస్కరించి కూడా అచ్చువేయడానికి సాహసించనే లేదు. ఆ రోజులకు కొంచెం పిమ్మట రచించిన కాళీ సహస్రంలో–

వక్త్రం చంద్రసమం కుచౌ గిరిసమౌ నేత్రే తు మిత్రేఽబ్జయో
ర్వాలా నీలమణిప్రభాభపటలీ సంపల్లవాః పల్లవా
ఇత్యాలాపకలాపకం యువతిషు శ్రద్ధాళుబుద్ధ్యుద్గిరం
వీథీనాటక మేక మంబ రచితం పాపాయ నీపాయనే !

అనే శ్లోకం అపరాధస్తబకంలో వున్నది దీనికి సంబంధించిందే. బాగుండని గ్రంథం ప్రచురించడం కంటే మానేయడం చాలా మంచిదంటూ పండితరాయలు యేదో సందర్భంలో "నోచే ద్దుష్కృతమాత్మనా కృతమివ స్వాంతా ద్బహి ర్మాకృథాః" అని వుపదేశించి వున్నాడు. సంస్కృతరచనలో కాళీసహస్రం తుట్టతుదిది. దాన్ని వేంకటాధ్వరి విరచితమైన లక్ష్మీసహస్రాన్ని వరవడిగా బెట్టుకొని ప్రారంభించాం. సుమారు 5 వందలదాకా అయినాక దానిమీద శ్రద్ధ తగ్గింది. దానిరచన మఱీ మాలోకంగా వుంటుంది. ప్రతీశబ్దంలోనూ అక్షరాలు విడదీసి యేదో క్లిష్టార్థాన్ని కల్పన చేయాలనే వుద్దేశమే. మచ్చుకు కొంచెం చూపుతాను :

పద్మం న యోగ్యవస్తు  స్యాదే వాఽ త్రోపమిత్యవస్థాయామ్।
ఇత్యేవ మద్రిజాతే! కంఠరవేణాంబ! వక్తి నేత్రం తే॥

దీని ముఖ్యతాత్పర్యం వ్రాస్తాను. "ఓ తల్లీ! నీ కన్నులకు పద్మాన్ని వుపమానం చెపుదామంటే అలా చెప్పడానికి ఆ వస్తువు తగిన పదార్థం కాదని నీ నేత్రమే కంఠోక్తిగా మాకు చెపుతూవుంది" అని పైకి దానికి కనపడే అర్థం. కంఠోక్తిగా చెప్పడమేమిటి అని శంక కలుగుతుంది గాని ఆ శంక మాద్వారా రహస్యం తెలుసుకుంటేనే కాని (యెవరికో తప్ప) తీరదు. ఆ రహస్యస్వరూపాన్ని వివరిస్తూన్నాను. 'నేత్రం' అనే పదాన్ని విఱిస్తే 'న+ఈత్రం' అని విఱుగుతుంది. 'ఈ' అంటే లక్ష్మీదేవి,  ఆపెను 'త్రం' అంటే కాపాడేది (గృహ మవడంచేత వన్నమాట). మొత్తం 'ఈత్ర' పదానికి పద్మం పిండితార్థం. అట్టి పద్మం 'వ' అంటే కాదు. యెందుకు కాదు అని ఉత్థితాకాంక్ష కలిగితే ఉపమించడానికి తగ్గది కాదు అని తేలింది. ఈలాగే భమిడిపత్తికాడలు విడదీసినట్లు విడదీసికొని వ్యాకరణ సూత్రాల మాదిరిని సమన్వయించుకోవలసిన శ్లోకాలే ఆ కాళీసహస్రంలో చాలా వఱకు వుంటాయి. కొన్ని లోకపరిపాటిగా వుండేవిన్నీ వుంటాయి.

ఆచలాధిపోఽ యమితి కృత్తివాససే
మునయోఽ చ లేన భవతీ మదాపయన్,
తమపి స్వయం కృతవతీ మహేశ్వరం
సుకృతాఽ తిరేక మపి లోపయంతి కే

దోషాస్సహస్రమపి సంతు గుణా న సంతు
మృత్యుంజయే న తదిదంతు విచారణీయమ్,
ఇత్థం విలోచ్య కిమయేఽ మ్బ త మిచ్ఛసిస్మ,
స్త్రీణాం ప్రధాన మఖిలేష్వసి కుంకుమంహి

అగ్ని శిఖాజన్మత్వా దగ్నిశిఖాఽ లంకృతౌ తవ ప్రీతిః,
అథవా స్వజన్మభవనే నహి కాసాం ప్రీతి రంబ మహిళానామ్

యీలాటి శ్లోకాలు యత్కించిత్ శ్లేష వున్నప్పటికీ సుళువుగా తాత్పర్యం అయేవి చాలావున్నాయి గాని కొన్ని బొత్తిగా పాషాణపాకంలో వుండడమే కాకుండా యేదో అగమ్యగోచరప్పుంతగా నడిచినవిన్నీ వున్నాయి. యిటీవల దీన్ని అచ్చొత్తించే టప్పుడు చాలాభాగం శ్లోకాలు త్యజించడానికి అదే కారణం.

చెప్పొచ్చే దేమిటంటే కవిత్వమనేది లోకం కోసమే అనేది సిద్ధాంతవాక్యమే అయితే దుర్బోధంగా రచించడంకన్న అనాలోచితప్పని వుండదనియ్యేవే. మొట్టమొదటిరోజుల్లో మనకవిత్వం మనకేగాని (రంగూను వుత్తరాలలాగు)[4] యితరులకు తెలియకుండా వుండాలి అనే వూహ వుండేది గాని అది కొలది కాలంలోనే అంతరించి తేలిక కవిత్వరచనకే అలవాటుపడ్డాం. యేదేనా తికమకశైలి మా కవిత్వంలో వుండే యెడల అది సంస్కృతంలోనే కాని తెలుగులో వుండదు. తెలుగు "గొల్లలకూ గొడ్ల కాపరులకూ కూడా" తెలిస్తే తెలుస్తుందేమో కాని సంస్కృతం మాది మాకేగాని (కొన్ని యిప్పుడు మాకుకూడా పుస్తకాపేక్షే) యితరులకు అన్వయించడం సంశయాస్పదమే.

క్లీఽ బపుంసోస్తు దేహో స్త్రీకో మత ర్న తత్ర బహుచిత్రమ్।
స్త్రీపుంసయోరపి తథా లలితే! యద్దృశ్యతే మహచ్చిత్రమ్॥

యీలాటి శ్లోకాలు కొన్ని వున్నాయి. మాకూ, మా శిష్యులకూ తప్ప యివి కొఱకబడవు. యిట్టి కవిత్వం యెందుకు చెప్పవలసి వచ్చిందంటే – ఇట్టిది పూర్వులు చెప్పింది కొంత చదివివుండడంచేత అనేది మొదటి జవాబు. రెండో జవాబో – బాగా ఆలోచిస్తే పరిపక్వాంతఃకరణ కలక్కపోవడం చేతనే అని యిప్పుడు విస్పష్టంగా చెప్పవలసి వుంటుంది. ఆ రోజుల్లోనే అయితే యిచ్చే జవాబు యీలా వుండదు. దాన్నే సమర్థించేదిగా వుంటుంది. యెంతకాలం కవి వొకరిని వరవడిగా పెట్టుకొని రచన సాగిస్తాడో అంతకాలం వాడి స్వాతంత్ర్యం రచనలో ప్రతిఫలించడం సంభవించదు. మనకవిత్వంలో ఆ అలంకారం వుండాలి, యీ అలంకారం అనొ మనస్సులో పెట్టుకొని రచించిన రచనకూడా హృదయంగమంగా వుండదు.

---

4. ఒకప్పుడు రంగూన్‌కు (బర్మా) ఆంధ్రదేశంలో శ్రీకాకుళం నుండి గోదావరి జిల్లా ప్రాంతం వరకు లావాదేవీలు ఉండేవి. ఆ వర్తక వ్యాపారానికి సంబంధించిన ఉత్తరాలు సంకేతలిపిలో ఉండేవి. లిపి తెలుగే కానీ ఆ తెలుగుని పంపినవారు, అందుకొన్నవారు మాత్రమే అర్థం చేసుకోగలరు. వ్యాపారరహస్యాలు బట్టబయలు కాకుండా ఈ ఏర్పాటు.

నన్నడిగితే చెప్తా గదా – అసలు కవికి భాషాజ్ఞానమే అవసరం గాని అలంకార జ్ఞానంతో అవసరం లేదనే నేను చెపుతాను. వాడు నిజమైన కవే అయివుంటే వాడు నోరు విప్పేటప్పటికి, లేదా కలం పట్టేటప్పటికల్లా అక్కడక్కడ అవసరమైన అలంకారాలు (శ్లో. లీలావతీనాం సహజా విలాసాః) వాటంతట అవే వచ్చి యిఱుక్కుంటాయి. వొకటి మాత్రం వుంది. అలంకారశాస్త్రపరిజ్ఞానం వున్న కవి అయితే యెవరేనా అడిగితే ఫలానా చోట ఫలానా, ఫలానా చోట ఫలానా అని సవిమర్శంగా అలంకారాలు వ్యాఖ్యానించగలుగుతాడు. ఆ పాండిత్యం లేనివాడైతే ఆ భారం వ్యాఖ్యాతలమీద వుండవలసి వస్తుంది. అలంకారజ్ఞానం లేకపోవడం కవికి లోటుకాదా అంటే, వినండి. కవికి యేజ్ఞానం లేకపోయినా లోటే. "తుడుం *(దేవతాఉత్సవాల సమయంలో వాయించే చర్మవాయిద్యం)* దగ్గిఱి నుంచి దేవతార్చన దాకా" వాడి వుద్యోగం. అందుచేతే "అహో భారో గురుః కవే" అన్నారు అభియుక్తులు. వాడికి పనికిరాని శబ్దమూ లేదు, అర్థమూ లేదు, పదార్థమూ లేదు, నీతీలేదు, ఆఖరికి బూతుకూడా (పదినీతులు పదిబూతులు. చూ. కవి చౌడప్ప శతకం పద్యం)[5] లేనిదే చెప్పాలి కాని అలంకారశాస్త్రం బట్టీ పట్టక పోయినంత మాత్రం చేత వాడికవిత్వంలో అలంకారాలు పడవనే సంశయం నిరాధారమని తెల్పడానికే నే నింతగ ప్రస్తావించింది.

విషయం విషయాంతరంలోకి దూకింది. మా విద్యార్థి దశ యావత్తూ యించుమించు సంస్కృతకవిత్వంతోటే జరిగింది గాని అవధానాలలో యెవరేనా అడిగితే తెలుగు కూడా చెప్పేవాళ్లం. తెలుగు చెప్పడం చేతనైనా తెలుగు కవులనిపించుకోవడానికి మాత్రం మాకు లేశమూ యిష్టం వుండేది కాదు. శ్రవణానందం విద్యార్థిదశానంతరం కొద్దిరోజుల్లోనే మొదలుపెట్టిందే. ఐతే శ్రవణానందకవిత్వం అంత తెలుగుమయంగా వుండడం యేలా సంభవిస్తుంది? శ్రవణానంద రచనకు పూర్వం మేము తెలుగులో రచించిన కవిత్వమల్లా రసికానందమున్నూ (ఇది కాళిదాసాదుల శ్లోకాలకు తెలిగింపు), శుకరంభా సంవాదపద్యాలున్నూ. రెండోది సంస్కృతం కూడా మాదేకదా! యిని రెండూ కలిపినా యేభైఅఱవై పద్యాలకు మించవు. అవధానాలలోవి కూడా తెలుగుపద్యాలు కలుపుకున్నప్పటికీ మహావుంటే సుమారు మూడువందలకు మించవు. అంత మాత్రానికే ధార యింత సాపుగా వుంటుందా? యెంత సాపు!

---

5. పది నీతులు పది బూతులు, పది శృంగారములు గల్గు పద్యముల సభన్
జదివినవాడే యధికుడు, గదరప్పా కుందవరపు కవి చౌడప్పా!

శా. ఎంచు న్మర్మము లెత్తి మాటికి దుటాయించున్ గనుల్ బల్ మిటా
రించున్ జప్ఞవపై చెఱంగు వలపూరించు న్నగించున్ బ్రశం
సించు న్మించుమనోవికారమును సూచించున్ మరుల్ నెంచునె
మ్మించుంబోడిస్వభావమో ? అతని నమ్మించం బ్రయత్నించుటో ?

దీనిక్కారణం మా ముత్తాతగారు స్వదస్తూరితో వ్రాసి ప్రసాదించిన పత్రగ్రంథాలు (మూడువంతులు పూర్వకవుల తెలుగువన్నమాట) నేను అర్థం తెలిసినా తెలీక పోయినా తఱుచుగా తిరిగేస్తూ వుండడమే అని నేను వూహిస్తాను. యింకోటి వ్రాయవలసిన సమాధానం నిజమయిందే వుంది గని అది నేను వ్రాస్తే ఆత్మస్తుతికిందకి వస్తుందని భయపడ్డాను. ఆయీ కారణం చేత పరమగురు సాన్నిధ్యానికి (కడియెద్ద గ్రామానికి) చేరేటప్పటికే నాకు తెలుగులో ధారాళంగా అల్లే అలవాటు యేర్పడింది గాని అది కవిత్వం కానేకాదనిన్నీ, యేవో యమకాలూ గమకాలూ వున్నదే కవిత్వమనిన్నీ మనస్సులో వొక విపరీతాభిప్రాయం వుండేది. అంతేకాదు, సంస్కృతంలో కవి అనిపించుకోవడమే గౌరవావహం కాని తెలుగులో కవి అనిపించుకోవడం గౌరవావహం కాదని కూడా వుండేది. అన్నమాటప్రతీదీ నిల్పుకోవడానికి తగిన పాండిత్యం వుంటేనే తప్ప కవిత్వం చెప్పనే కూడదనిన్నీ వుండేది. యీ వూహ నేను పుట్టుకతో తెచ్చుకున్నటే గాని యిటీవల సంపాదించు కున్నది గాదు దాతృత్వానికి పరశురాముణ్ణి వుపమానంగా చెప్పి అది తిశా ఆక్షేపిస్తే దానికోసం మూడు నాలుగేళ్లు గ్రంథాలు వెదికి సాధించేదాకా నిద్దరపోలేదు. యిది నా ప్రకృతి. ఆ స్థలం "భార్గవుం డీడనంబరగు భార్గవునకు గ్రోధాపవాదంబు గూడదేని." దీనికోసమని అప్రామాణికవాదం చేయడం నా కెంత మాత్రమూ యిష్టం లేదు. యేదేనా భ్రాంతిపడి ప్రయోగించడం జరిగితే అది మళ్లా యే నాలుగేళ్లకో, అయిదేళ్లకో వాటంతట నాకే స్ఫురించడమే కాని యితరులు తెల్పితే తెలుసుకున్నట్టు యిప్పటికి యెఱగను. యిక ముందు చెప్పలేను. కొన్ని ప్రమాదాలు–

1. రుద్రాని భద్రాణి తథా దిశేర్మే కద్రాజమద్రాక్షం
2. ఏనా మనూనాకృతిభాసమానాం
3. మరుద్భూపాలుడు
4. మృతాయితుడు

యిలాటి వేవో పరిమితంగా వుంటాయి. యివి మార్గాంతరంచేత సాధింపబడ్డాయి. సాధింపబడని ప్రమాదాలు యెక్కడేనా యతో, ప్రాసో తప్పితే తప్పిందని మొట్టమొదటే వొప్పుకోవడమే కాని వాదానికి దిగడం గాని, అచ్చుపొరబాటని

యెవళ్లమీదకో తోసివేయడం గాని నాపని కాదు. నేనల్లా బూకరించి అబద్ధ మాడిందల్లా వొకటే వుంది. అది రామఠ శబ్దానికి సంబంధించినది. రఘువంశం చదువుకునే రోజుల్లోది.

తాళ్లరేవు కేశవపురంలో దేవాలయమండపంలో ఆ వూరి విద్యార్థులకూ, నాకూ వాదం పడింది. ఆ విద్యార్థులు 'రామఠం' అంటే చెప్పవలసిందన్నారు. నాకేం తెలుసునా యేమేనా! కాని మహా తెలిసినవాడిలాగు నటించి "యిదేనా బ్రహ్మాండం. అపానవాయువు" అన్నాను. కాదన్నారు ఆవలివాళ్లు. అవునని నేనన్నాను. తుదకి నిఘంటు చెప్పమన్నారు. "రామఠం గుదమారుతం"[6] అని చదివాను. వాళ్లు యిది యే నిఘంటులో వుందన్నారు. హలాయుధం[7]లో వుందని బదులు చెప్పి బుకాయించాను. అమరమైతే[8] చూచి లేదనడానికి అవకాశం ఉండేది వాళ్లకు. హలాయుధ నిఘంటెక్కడ దొరకుతుంది? ఆ నిఘంటు అప్పటికే కాదు, యిప్పటికి అచ్చుపడలేదేమో? అంతలో ఆ వాదం సమసిపోయింది. ఆవలివాళ్లకూ తగినంత జ్ఞానం లేదు, నాకూ లేదు కనక సరిపోయింది గాని అదే వుంటే నేను చదివిన శ్లోకంలో 'మారుతం' అన్నదాన్ని బట్టే యావత్తూ తప్పు బయటపడేది. మారుతశబ్దం పుంలింగంకదా, 'మారుతః' అనక 'మారుతం' అనడం యేలాగ? యిటీవల యెన్నాళ్లకోగాని నాకీతప్పు రఘువంశం చదివేటప్పుడు గోచరిస్తుందా?(యీలాటి దేదేనా వ్రాస్తే "నేనంతోణ్ణింతోణ్ణి మదురుగోడెక్కించి పడదోశారు" అంటూ వెక్కిరించారు వొకరు. యేనుక్కి వచ్చిన పాట్లివి. సంతోషించి

---

6. ప్రస్తుతం పంజాబ్ పైన పాకిస్థాన్, ఆఫ్ఘనిస్తాన్ దేశాలలోని పీలికలాంటి భాగానికి రామఠదేశమని పేరు. ఇక్కడ తయారయ్యే ప్రశస్తమైన ఇంగువను రామఠం అని అంటారు.

7. అసలు పేరు అభిధానరత్నమాల. కూర్పరి అయిన భట్టహలాయుధుని పేరు మీదుగా హలాయుధమని వ్యవహరిస్తారు. 10వ శతాబ్దంలో జీవించి ఉండవచ్చని అంచనా. 12 వశతాబ్దము తరువాతి గ్రంథకర్తలే హలాయుధుని స్మరించారు. కవిరహస్యమనే ఛందోగ్రంథాన్ని, మృతసంజీవని కావ్యాన్ని, హలాయుధస్తవమ్ అనే శివస్తోత్రం కూడా రచించాడు. గొప్ప శివభక్తుడు. బసవపురాణంలో హలాయుధుని కథ ఉంది. చిరుతొండనంబి సమకాలీకుడు.

8. సంస్కృత వ్యాకరణాలలో అష్టాధ్యాయికి ఎలాంటి స్థానముందో నిఘంటువులలో అమరానికి అంతటి స్థానముంది. కూర్పరి అమరసింహుడు, బౌద్ధుడు. విక్రమాదిత్యుని సభలోని నవరత్నములలో ఒకరట. 6వ శతాబ్దికి ముందరి వాడని అంచనా. కావ్యాలకు వ్యాఖ్యానం రాసినవారందరూ అమరాన్ని ప్రామాణికంగా స్వీకరించారు.

వూరుకున్నాను). కవితాధారమాత్రం అప్పటికే వుందనుకోవాలి. అది సహజం గనక అట్టిది కాదనడానికి అవకాశం లేదు. “చత్వార స్సహజాగుణాః”. యిది తప్ప యెవరితోటీ అప్రమాణవాదం చిన్నప్పుడుకూడా నేను చేసినట్టు జ్ఞాపకం లేదు. మార్గాంతరం తొక్కి సాధించినవి లోగడ చూసే వున్నాను. నన్ను యితరులు తప్పు పడితే సమాధానం చెప్పడమే గాని వొకర్ని నేనై తప్పు పట్టడం యెఱగను. యెంతటి వాడేనా సరే, యెంత‘లోయరుక్లాసు’ వాడిమీదకేనా సరే తనంతట తాను వెడితే యెక్కడో గోతులో గూలడం తప్పదని నాకు మొదటి నుంచీ భయం వుండేది. అదిన్నీ కాక, ఎవరో కవిత్వంలో తప్పులు చెప్పుకుంటే తీరికూర్చుని ఆ తప్పులన్నీ యేరి చూపడం బాధ మనల కెందుకనికూడా నాకు తోచేది. అయితే యీ అంశం యితరులకు మాత్రం తోచకేనా “కజ్జాకు కాలు దువ్వడా” లంటారేమో? తోచకేం, అందఱికీ తోచేదే గాని యీ అంశం వ్యక్తిగతద్వేషాన్ని పురస్కరించుకొని కొందఱు అలాటిమార్గంలో ప్రవర్తిస్తారు. అదేలా వుంటుందంటే, యెంత రసాభాసుగా వుండాలో, అంత రసాభాసుగానూ వుంటుంది. ద్వేషానిక్కారణం అపవాదకల్పనకు సహించక తిరగబడడం. దాన్ని సమర్థించుకోవడానికి మార్గం లేక యేలాగరా వీణ్ణి సాధించేది అని యోజించి యోజించి చివరికి యేతోవా కలిసిరాక, చూదాం అటునుంచి నఱుక్కురమ్మన్నాడని వోదరినుంచి వరసపెట్టి వాడి పుస్తకమంతా గీట్లు పెట్టి కనపడ్డ పెద్దమనిషికల్లా వినిపిస్తూవుంటే యేకొందఱో యిది సమంజసంగా లేదనడం, దానితో మఱింతకోపం హెచ్చి తిట్టడం, ఆ తిట్లు వినలేక ఆ పెద్దమనుషులు శివా శివా అని చెవులు మూసుకోవడం రసాభాసు. యీ పంథా నాకు బొత్తిగా సరిపడదు. అందుచేత నే నెప్పుడూ అలాంటిపని పెట్టుకోలేదు. నామీదకి వస్తే మాత్రం యెవరినీ వుపేక్షించలేదు. పండితరాయ లంతవాడు తన్ను వెలేశారనే హేతువును పురస్కరించుకొని కోపాన్ని ఆపుకోలేక అప్పయ్యదీక్షతులవారి గ్రంథాలు తప్పు పట్టడం ప్రారంభించి గోతులో గూలి అపహాస్యాస్పదుడైనాడంటే యిక అస్మదాదుల లెక్కేమిటి, పత్రమేమిటి? అందులోనూ యేదోకోపం మీద అలాటిపని పెట్టుకుంటే వొప్పులన్నీ తప్పులుగా తోచి తుదకు కంఠం పట్టుకుంటాయి కూడాను. యిది విషయాంతరం.

విద్యార్థిదశలో యేకొంచెమో తెలుక్కవిత్వం అవధానాలలో తప్పనిసరిచేత మేం చెప్పినా మాకు సంస్కృతకవుల మనిపించుకుందా మనే వుబలాటమే హెచ్చుగా వుండేది. వుంటే మాత్రం మీ యిష్టమేనా? తుదకి తెలుగుకవులమే అయాము. తెలుగులోనే చాలా వ్రాశాము. “తెలుగదేల యన్న దేశంబు తెలుగేను

దెలుగువల్లభుండ" అన్నట్టయింది. విద్యార్థిదశలో సంస్కృతమే చెపుతూ వుండేవాళ్లం. వాళ్లకీ, మాకూ తఱుచుగ శిఖపట్లగోత్రందాకా కూడా వొకప్పుడు వస్తూ వుండేది. మామా తగాదాలు తీర్చలేక గురువుగారు కూడా శ్రమపడవలసి వచ్చేది. ఆ శంకాసమాధానాల స్వరూపం కొంచెం చూపుతాను –

పశుపతిదయితాతృతీయపుత్రౌ
తిరుపతి వేంకటశాస్త్రిణౌ కవీంద్రౌ

అని ధాతురత్నాకరంలో వొకశ్లోకంలో వ్రాసుకున్నాం. పార్వతీదేవికి విఘ్నేశ్వరుడూ, కుమారస్వామీ యీ యిద్దఱున్నూ కొడుకులున్నారని అందఱూ యెఱిగిందేనా? మేమిద్దఱమూ మూడవకొడుకులం అని వ్రాసుకున్నాం. దాని తాత్పర్యం పుత్రుని వంటివాళ్లమని కదా పరిణమిస్తుంది? యిక్కడ చేసే కుశ్శంక చూడండీ, యేలా వుంటుందోను. "అయ్యా! మీరిద్దఱు కదా! యిద్దఱిలో వొకరు మూడోకొడుకైతే యింకొకరు నాలుగోకొడుకు కావాలి గాని యిద్దఱూ మూడో కొడుకులే యేలా అవుతారు" అని శంక. పైకి యిది యుక్తంగా వున్నట్టు కనపడుతుంది గాని విచారిస్తే యింత చొప్పదంటుశంక యిదేగాని మఱోటి వుండదు, వుండనే వుండదు. సమాధానం వినండి.

సాక్షాత్పుత్రత్వానికైతేనే అలాటి చిక్కు తగులుతుందిగాని ఆరోపితపుత్రత్వానికి తగలదు. అభినవకాళిదాసు భాగవతచంపులో "త్రినయనదయితాయాః ప్రేమడింభ స్తృతీయః" అని ఇదివఱకే తృతీయపుత్రత్వాన్ని తనయందు ఆపాదించుకొని వున్నాడు. అతడు మాకంటే పూర్వుడే కదా! ఆ పద్ధతిని మాలో వొకరికికూడా తృతీయపుత్రత్వం కుదరకపోవలసివస్తుంది. మనకి తెలియడం అభినవకాళిదాసుది మాత్రమే కాని యింకా మఱికొందఱు కూడా యీలాటివారు వుంటే వుంటారు. ఇది యీలా వుంచుదాం. దేవాలయంలోకి తండ్రీకొడుకు లిద్దఱూ వెళ్లి, 'ఓ తండ్రీ, భగవంతుడా' అని ప్రార్థించారనుకుందాం. దేవుడు తండ్రికీ తండ్రి, కొడుక్కి తండ్రి యేలా అవుతాడు, కొడుక్కి తాత కావద్దా అనడం యేలాటిదో యిదీ అలాటిదే అని సమాధానం. యిదే మాదిరి శంకాసమాధానాలతోనే విద్యార్థిదశలో కవిత్వం సర్వమూ గడిచింది. మా దగ్గఱ చదివే విద్యార్థులుంటే వాళ్లని "పశు పతిదయితాపౌత్రు లోయి వీరు" అంటూ వెక్కిరించేవాళ్లు కొందఱు సతీర్థ్యులు. యిలా కిందా మీదా పడుతూ పరస్పర జయేచ్ఛలతో వర్తించడం పేరే స్పర్ధంటారు. "స్పర్ధయా వర్ధతే విద్యా". కనక దీనికి ప్రధాన ఫలితం విద్యాభివృద్ధి. దానికి యీ స్పర్ధ వంటి దోహదం లేదు. కాని యిది కొంత శత్రుత్వాన్ని కలిగిస్తుంది. తిశా

నాకంటె కొంత ముందుగా ప్రవేశించాడు గురుసాన్నిధ్యాన్ని. అతనికంటే యే మాత్రమో ముందుగా ప్రవేశించాడు సుబ్బయ్యశాస్త్రుల్లనే వొక విద్యార్థి. అతనికి తిశా కన్న గ్రంథం చాలా యెక్కువయింది కాని వాదోపవాదాలు వస్తే యితనిదే పయిచేయిగా వుండేది. దానిమీద సుబ్బయ్యశాస్త్రుల్లుకి తిశా అంటే అంతా యింతా కాదు, చంపేదామన్నంత అసూయ వుండేది. ఒకప్పుడు కలియబడి కొట్టేవాడు. తిరిపంగాడనడమే కాని అతని పేరు సరిగ్గా వుచ్చరించడానికి యెప్పుడూ ఆ సుబ్బయ్యశాస్త్రికి యిష్టం వుండేది కాదు. వీరిద్దఱూ పరమశత్రువులుగానే వుండి విద్యాభ్యాసం చేసే రోజులలో నేను విద్యార్థిగా వెళ్లాను. తరువాత మా యిద్దఱికీ ప్రారంభమయింది రంధి. నేను అప్పటికే కవిని అంతో యింతో పౌరాణికుణ్ణి. నేను కవిత్వం చెపితే తిశా ఆక్షేపించడం. ఆ బాపతే లోగడ వుదాహరించినది. "భార్గవుం డీడన బరగు" అన్నచోట పూర్వపక్షం. పరశురాముడు రాజుల నందఱినీ వధించి యావద్భూమినీ బ్రాహ్మణులకు దాన మివ్వడంచేత ఆయన్ని శిబి, దధీచి మొదలైన మహాదాతలలో పరిగణించవచ్చునని నే ననేకున్నాను. అంతేనే కాని యెక్కడో చూచి వాడలేదు. అతడు భూదానం చేసిన మాట సత్యమే కాని కవు లెవ్వరూ వాడలేదు గనక కవిసమయసిద్ధం కాదని తిశా వాదం. గురువుగారిదాకా వెళ్లింది. వారికి శాస్త్రాలగోలేకాని, కవిత్వమన్నా సాహిత్యమన్నా బొత్తిగా నిస్సాకారం. అందుచేత యెటూ చెప్పక వూరుకొని రాజీ చేయడానికి ప్రయత్నించేవారు. తుదకి వెతగ్గా వెతగ్గా మహాకవి ప్రయోగమే దొరికింది. దొరికితే మాత్రం అంతతో ఆ వాదం ఆగుతుందా? అలా ప్రయోగించిన కవికి తగినంత కవిసమయజ్ఞత్వం లేదంటూ మళ్లా పిడివాదం. యీలాగే కొట్టుమిట్లాడుతూ కాలక్షేపం జరిగేది. యిది కవిత్వ విషయంలో వాదోపవాదాల గోల.

యిక అప్పుడు చదువుకునే శాస్త్రవివాదాన్ని గూర్చి వ్రాస్తాను. అనాధ్యాయాలల్లో గురువులే శిష్యులకు కొంత పోట్లాట నేర్పుతారు. యీలా నేర్పడం యెందుకంటే? దీనివల్ల కాశీలో వీరికి కొంత జీవనాధారం వుంది. యాత్రకు వెళ్లిన రాజులు మొదలైన సంపన్నులు పండితసభ చేసి శక్త్యనుసారంగా సత్కరిస్తూ వుంటారు. ఆ సభలలో పూర్వపక్షం చేయడం విద్యార్థులవంతుగాని సుప్రసిద్ధులైన పండితులవంతు గాదు. యెందుచేతనంటే? పూర్వపక్షం యెప్పుడూ పూర్వపక్షమే (ఉత్తరపక్షంచేత కొట్టుకుపోయేదే) కనక తుట్టతుదకి పూర్వపక్షం చేసిన వ్యక్తి వోడిపోయినట్టు పరిణమిస్తుంది. దానితో వొక్కొక్క దేశానికో, వొక్కొక్క లోకానికో సరిపడ్డ పండితులు అలాటి అవమానాన్ని భరింపలేక మంత్రశాస్త్రంద్వారా వొకరికి

వొకరు చంపుకోవడం దగ్గఱికి కూడా రావడం క్వాచిత్కంగా సంభవిస్తూవుండడంచేత యే విద్యార్థిచేతో పూర్వపక్షం చేయించడం చేత ఆచారమయింది. దానిమీద ఆ పెద్దపండితులు అందుకుని సభ చేయించినవారికి వినోదం కలిగేటట్టు కొంతసేపు మాట్లాడడం ఆచారం. అలాటి సభలకు ఆహ్వానం రావడం కొంత వాగ్ధాటి వున్న వాళ్లకి గాని సంభవించదు. దాన్ని గురువులు నేర్పడం కాశీలో ఆచారం. ఆ పండితులు యీదేశం వచ్చి శిష్యులను తయారు చేయడంలో ఆ విధానాన్నే అనువర్తిస్తారు. ఆయీ శాస్త్రార్థాలు వగయిరా యిప్పటి నవనాగరకులు యీసడిస్తారు గాని వీరు ఫీజుకోసం కోర్టులలో వాదించే వాదాలు పూర్వరకం పండితులు ఆక్షేపిస్తే జవాబు మాత్రం చెప్పలేరు. "పరధనమ్ము హరించెడి త్రోవలిన్నియున్" అన్నాడు దేవీభాగవతకర్త. అవి యేవంటే, యివి –

దేవతలన్ యజింత్రు పరదేశములన్ జరియింత్రు దాతలై
కోవిదకోటికిన్ ముదము గొల్పుదు రుత్తము, లల్పలోభులో
జీవుల హింస సేయుదురు చేయుదు రెంతయు జౌర్యముం దగన్
భావనజేయగా బరధనంబు హరించెడి త్రోవ లిన్నియున్

వొకరివృత్తి వేఱొకరికి ఆక్షేపణీయంగా కనపడడమే కాని బాగా ఆలోచిస్తే అన్నీ ఉదరపోషణకే అవలంబించడం. కాశీపండితులకీ, యితర పండితులకీ వొక భేదం వుంది పరిగ్రహించే విషయంలో. యేదానమైనాసరే (కుక్కదానంబట్టి కుటుంబాన్ని రక్షించుకోమన్నాడు) నిరాఘాటంగా పడతారని వినడం. మనదేశప్పండితులు కన్యా, భూ, సరస్వతీ దానములు మూడు తప్ప తదితర దానాలు యితరమూ స్పృశింపని వారుకూడా వున్నట్టు కొన్ని యితిహాసాలున్నాయి. పోతరాజుగారు యీ భావాన్నే బాగా బలపఱిచారు. "మర్యాదన్ జెందు కరంబు క్రిందగుట మీదై నాకరంబుంట మేల్గాదే" అన్నారు. ఆయీ వేదవేదాంగ విద్యాభ్యాసం వుద్యోగాలకు పనికి వచ్చే దెప్పుడూ కాదు గనక వీళ్ల జీవనం భవిష్యత్తులో భిక్షాటనం ద్వారాగానే జరగవలసి వుంటుందని కాబోలును తమతమ విద్యార్థులకు గణపతి నవరాత్ర పూజోత్సవవ్యాజంమీద యాచనకూడా అలవాటు చేసేవారు. యెంతసేపూ నిరాడంబరంగా వుండడమే వారికి యిష్టం. వొక్క విద్యలోతప్ప వారికి పట్టుదల లేనేలేదు. అట్టి మహనీయుల శుశ్రూషా కాలంలో పుట్టుకతోనే వెంటాడించిన కవిత్వాన్ని పూర్వోక్తరీతిని వృద్ధిపఱుచుకున్నాం. నేను యీ వ్యాసంలో వ్రాసిన సోదె (ప్రసక్తానుప్రసక్తాలు కాక) యావత్తూ ఒక శార్దూలశ్లోకం కొంతలో యిమిడ్చాడు ప్రాచీన మహాకవి –

బీజం యస్య పురార్జితం సుచరితం ప్రజ్ఞా నవీనాంకురః
కాండః పండితమండలీ పరిచయః కావ్యం నవపల్లవః,
సూక్తిః పుష్పపరంపరాపరిణతి స్సోఽయం కవిత్వద్రుమః

దీనిలో వుదాహరించిన సామగ్రీసంపాదనానికి మేము చిన్నప్పటినుంచీ పడ్డపాట్లు వుదాహరించాను. దీన్ని ఆత్మోత్కర్షానికి వ్రాసినట్టు భావించేవారున్నూ వుంటారు. దీన్ని అట్టివారికోసం నేను వ్రాయలేదు. వొకవిద్యార్థి – మిద్నపూరు ప్రాంతంలో రామకృష్ణామిషన్ పాఠశాలలో చదివేవాడు, మన ఆంధ్రదేశీయుడు – మన ఆంధ్రదేశంలో మీ చిన్నతనంలో విద్యాభ్యాసప్పద్ధతి యేలా వుండేదో పత్రికద్వారాగా ప్రచురించవలసిందని కోరివున్నాడు. అతని మాట తోసివేయదగ్గది కాదని, 'వెనుకటి పండితులు' అనే వ్యాసంలో ప్రసక్తి కల్పించి కొంత వ్రాశాను. అది కృష్ణాపత్రికలో ప్రకటితమయింది. మఱికొన్ని విశేషాలు యీ మిషమీద ప్రకటించినట్టయింది. యిక దీన్ని ముగిస్తున్నాను. సంస్కృతంలో తప్ప తికమక కవిత్వం మేము తెలుగులో రచించనేలేదు. పండితులు కవులౌదురా, కారా అనే సందేహం తీర్చడానికని విజయనగరం మహారాజావారిమీద చెప్పిన పద్యాలలో కొన్ని తికమక ధోరణిలో నడిచినవున్నాయి. కొంచెం వుదాహరిస్తాను:

1. తే. అర్థవత్తని అర్థవత్సూత్రమందు నీయశముకొంత
గూఢముగ జెప్పె బాణిని కువలయేశ

2. శ్లో. తత్కిం చంద్రాతపోయం
శాస్త్రార్థం కుర్వతేఽ తార్కికాః

3. శ్లో. అస్వాప్తమానవహయః
ఆనందభూమిపతి రేవహి రాజమౌళిః.

4. క. మాపసమానీపాగమ, గాపసమా!
పరిపరితుష్టిజెందె నానందనృపా![9]

ఆ మహారాజు యీ కవిత్వంకంటే కూడా తేలిక శైలిలో వున్న

సీ. విక్రమార్కునితోడ వేం చేయకుండునే
భోజభూపాలుడు పుట్టడేని

9. పై నాలుగు పద్యాలలో మొదటిపాదం, చివరిపాదం మాత్రే వేంశా ఉదహరించారు.

మొదలైన పద్యాలకే యెక్కువగ సంతోషించినట్టు తోచింది మాకు. కవిత్వ మన్నప్పుడు చట్టన భావం యెదటివాళ్లకి (యేమాత్రం సంస్కారమేనా వుంటేనే) అవగాహన మయేమాదిరిగా వుంటేనే తప్ప అలా వుండక కొన్ని నిర్జీవసాధనాలూ (నిఘంట్లు), కొన్ని సజీవసాధనాలూ (పండితులు) పని చేస్తేనేకాని అవగాహన కాని స్థితిలో వుంటే "మూగ చెవిటివారి ముచ్చట" అని మొల్ల చెప్పిన తరగతిలోకే చేరుతుంది. పాండిత్యం చూపుకోవాలంటేకూడా ఆ సులభమార్గంలోనే చూపుకోవచ్చు. పాండిత్యం తోవ పాండిత్యానిదే, కవిత్వం తోవ కవిత్వానిదే. పాండిత్యం అభ్యాససాధ్యం.

> ముగ్ధేనాఽపి నితాంతఘర్షణవశా
> ద్విద్వా పున శ్ఛాందసీ
> సంపాద్యైవ....................
> శాస్త్రం చాఽపి తథైవ కింతు కవితా

కవిత్వం అట్టిది కాదు. ద్రాక్షాపాక కదళీపాకాలే దేశభాషాకవిత్వానికి పరిగ్రహణ యోగ్యాలు. తక్కినవి క్వాచిత్కంగా మాత్రమే గ్రహించతగ్గవి. తెలుగులో అడుగుపెట్టేనాటికే దానంతట అదే మా కీలాటిబాట పడింది. దీనివల్లనే మేము లోకానుగ్రహానికి పాత్రుల మైనాము. కంకణబంధం చెప్పి పెద్ద పెద్ద అగ్రహారాలు సంపాదించినవారు వున్నారు. ఆ అగ్రహారాలు శాశ్వతంగా జరుగుతూ వున్నాయి. ఆ బంధం యెవరికీ రాదు. వస్తే అర్థం రాదు. అర్థం సాధిస్తే తాత్పర్యం కాదు. దీన్ని బట్టి కవిత్వం సులభంగానే వుండాలో, కఠినంగానే వుండాలో పరిశీలించుకోవచ్చు. నన్నయ్యగారి "నిండుమనంబు" పద్యమే అనండి, తిక్కన్నగారి "చిచ్చుఱకన్ను మూసికొని" పద్యమే అనండి, యెఱ్ఱన్నగారి "నీమగ దంత యెక్కుడె?" పద్యమే అనండి, యెందఱికో వాచోవిధేయంగా వస్తాయి కదా! కంకణాదిబంధాలో? అలా వస్తాయా? ఆ పద్ధతిని "లోకుల రసనలె యాకులుగా నుండునట్టివి" యేకవిత్వా లవుతాయి? అయీ భావం నేను నూతనంగా కల్పించింది కాదు, ప్రాచీన కవులలో పరిపక్వమనస్కులంతా యీ అభిప్రాయాన్నే వెలువరించారు. "అంత ర్గూఢా నర్థాన్...... న రసః ప్రీత్యై రసజ్ఞానామ్" అన్నాడు ఆచార్య గోవర్ధనుడు. అక్కడక్కడ ఆయీ సంగతులు వుదాహరించినవే. మళ్లా చర్విత చర్వణ మెందుకు? అప్పకవి "నిలుకడ వలయు" అన్నాడు కనక కవిత్వానికి దీర్ఘాలోచన అవసరమని కొందఱంటారు. కొందఱి అనుభూతి అట్టిదే కావచ్చును

గాని నా అనుభూతి అట్టిది కాదు. అసలు వర్ణ్యం మనస్సుకు వచ్చిందయితే ఆశువులో రచించినా బాగానే వుంటుందనిన్నీ, నచ్చనిదైతే యెంత వ్యవధి పుచ్చుకున్నా రసవత్తరంగా వుండదనిన్నీ నేననుకుంటాను. దీనికి కొన్ని వుదాహరణాలు చూపుతాను. కీ.శే. గద్వాల రాజాగారు అవధానంలో కోరిన పద్యం యిది :

సీ. పురుషాయిత మొనర్చు పూబోడికటిమీద
నాట్యంబు సల్పు పుణ్యమ్ముకొఱకొ?[10]

తే.గీ. వేణి కాంతల వెన్నంటి వ్రేలుచుండె
లేకయుండిన నిధువనలీల కుపచ
రించునంగమ్ము లెదుటనే సంచు నించ
దాని కట్లుండ నేయుపద్రవము వచ్చె

తీరికగా సావకాశంగా కూర్చుని రచిస్తే మాత్రం యింతకన్న బాగుంటుందా పద్యం? దీనిమీద మళ్లా రాజాగారు శంకిస్తే చెప్పిన పద్యం కూడా వుదాహరిస్తాను.

మ. ఎదుటన్ వర్తిలునట్టియంగముల కెంతేని న్నఖాదిక్షతా
పద పల్మాఱును గల్గుసంగతిని దాఁబ్రత్యక్షముం జూచి నె
మ్మదిలో భీతిలి చాటుచోటనుచు సంభావించి వెన్నంటుచుం
బొదలం బోలును వేణి, లేకునికి దాముందుండ కట్లుండునే?

యింకా అవధానాలలో నుంచి యీలాటివి కొన్ని చూపవచ్చును. భారతాది గ్రంథ రచయితలందఱూ అశుకవితావిశారదులే. కాని మెల్లిగా ఆలోచించి వొక్కొక్క వాక్యంవంతున రచించిన వారు కారనే అనుభవజ్ఞులు అంగీకరిస్తారు. వొక్కొక్కప్పుడు కోపం మీద కూడా కవిత్వం బాగా నడుస్తుంది. యీ పద్యం ఆ బాపతే :

సీ. నిను గాల్చిన గాని నీబుద్ధి మానదే !
చీ! యేమనందునే ! చీకుముల్ల !

---

**10.** ఒక సీసపద్యం మొదటిపాదం ఇది. మిగిలిన మూడు పాదాలు –
పదిమంది దృష్టులు పడిన కంటకమంచు నూహించి కనుపడకుండు కొఱకొ
ఘననితంబ స్థలంబను పెన్నిధానంబు బహుభద్రముగను గాపాడు కొఱకొ
తానాశ్రయించు కాంతకు వెన్కభాగమ్మున గూడ సౌందర్యమనుపు కొఱకొ

యిది వేమవరాగ్రహార శతావధానంలోది. పృచ్ఛకుడు అడిగేటప్పటికల్లా వూడిపడ్డదే యీచరణం. పృచ్ఛకుడు శత్రుకోటిలోనివాడు. చీకుముల్లు స్వల్ప వస్తువుగదా! దీనిమీద సీసపద్యం చెప్పగలుగుతారా అని పృచ్ఛకుని వుద్దేశం. అప్పుడు వుండే శత్రుకోటికి తగిలేటట్టు పద్యం యెత్తుగడ. పేరుకు చీకుముల్లు గాని పద్యంలో ప్రతిపాద్యం వేఱుగదా! యిక మేటరుకు లోటేమిటి? సమృద్ధిగా దొరికింది. తుదకు పృచ్ఛకుని వుద్దేశం తాఱుమాఱై మాకు మేటరు సమకూర్చి పెట్టినట్టయింది. శత్రుకోటే కానక్కఱ లేదు, అవధానాలలో మిత్రకోటి కూడా చాలా తిప్పలు పెడతారు. వాట్ల నన్నిటినీ నేర్పుగా, శాంతంగా సమర్థించుకొనేశక్తి (ధారణశక్తివల్ల అవి సమర్థించబడవు) వేఱే వుండాలి. ప్రతిపాద్యం మనస్సుకు వచ్చిందయితే ఆశువులో చెప్పినా పద్యం బాగానే వుంటుందన్నది వక్తవ్యాంశం. యీ అంశమందు మాకు బాగా నమ్మకం వుండబట్టే ఒక సభలో పట్టుపటాంగం వచ్చి యీ విధంగా ప్రతిజ్ఞ చేయడానికి సందేహించలేదు. దాన్ని వుదాహరిస్తాను :

ఇతరకవుల్ ప్రయాసపడి యెంచి రచించిన నూటి కెన్ని పె
ద్దతనము గాంచి సత్కవులదన్పునొ, మే మవధానసంగత
స్థితిగని ఆశుగా రచనజేసి పద్యములందు జూచినన్
శతమున కన్ని పద్యములు జక్కగ నుండు నసంశయమ్ముగన్

మామట్టుకు ఆశువులో సాధ్యం కాదని తోచిందల్లా చిత్రబంధకవిత్వాలు మాత్రమే. యీ సంగతి కూడా ఆ రోజుల్లో వివరించే వున్నాయి :

ఉత్తానశయా టొమ్ముడ నధర్మముగా బరు వెత్తినట్లు బం
ధాను గవిత్వమల్లు మవధానమునం దన మర్త్యకోటి నె
వ్వానికి శక్యమౌను గలవాణికి వాణికిగాక.....

యేదో వ్రాస్తూవుంటే పెరుగుతూనే వుంటుంది. మేము మొదట తెలుగులో కవిత్వాన్ని మొదలు పెట్టి పిమ్మట తెలుగుకవుల మనిపించుకోవడానికి యిష్టం లేక సంస్కృతం లోకైతే దిగాము గాని తుట్టతుదకు తెలుగుకవులుగానే లోకానికి పరిచితులమైనా మన్నది యీ వ్యాససారాంశం. తెలుక్కి సమగ్రమైన వ్యాకరణం లేకపోవడంచేత కేవలం దానితో కాపరం తుద నెగ్గదని తలచి భారతాది మహాకవుల ప్రయోగాలు ప్రత్యక్షరశోధగా చదివి తదనుగుణంగా రచన సాగించుకున్నా. మాకు భారతాదులు చూడవలసిన ప్రసక్తి రచనకోసం ఆవశ్యకం కాలేదు. రచన అవి చూడకపోయినప్పు

డెంతో చూచినప్పుడున్నూ అంతే. శ్రీనివాసవిలాసరచన పర్యంతమూ సాగిన రచన శ్రవణానందాదికం నాటికి పట్టుదలగా భారతాదికం లక్ష్యాలకోసం పరిశీలించలేదు. శ్రీనివాసవిలాసం వినికి చేసేటప్పుడు ప్రతీపదమందూ (తెలిసీ తెలియని) శంకలు చేసే పండితుల మూలాన అట్టి అవసరం కలిగింది. యితరకవులని అసలే వొప్పమనిన్నీ, భారతమ్మాత్రం యిస్తే వొప్పుతాము అనిన్నీ, దానిలోనేనా నన్నయ్యగారిని వొప్పినంత ప్రమాణంగా తిక్కన్న ఎఱ్ఱన్నగార్లని లేదనిన్నీ ఆ సంస్థానపండితులు ఒక కొత్తపంథాలోకి దిగి చాలా తిప్పలు పెట్టారు. అప్పుడు భారతలక్ష్యాల ద్వారా వారివాదం ఖండించి రాజుగారికి సంతుష్టి కలిగించవలసి వచ్చింది. వారి ధర్మమా అని మాట్లాడేటప్పటికల్లా ప్రయోగం (నూటికి తొంభై తొమ్మిదులకు భారతమే) యిచ్చే త్రోవ అది మొదలు యేర్పడింది. మేము 'శ్రీ గురుభ్యో నమః' అని చదవకపోయినా ఆ సంస్థాన పండితులు మాకు యీ విషయంలో గురువులే అయినారు. తెలుక్కి లక్ష్యజ్ఞానమే విశేషించి కావలసింది. యెందు కంటారు? సమర్థనానికి. రచనకో? అక్కఱలేదు. జిజ్ఞాసువులు యీ మాట బాగా జ్ఞప్తిలో వుంచుకోవాలి.

*(భారతి – 1941, ఏప్రిల్, మే)*



అనుబంధము - 1

# కాశీ - విజయనగరం వారు

- రవికృష్ణ

తీరాంధ్రవాసులకు, కాశీకి ఘనిష్ఠ సంబంధం ఏర్పడటంలో విజయనగరం జమీందారులది పెద్దపాత్ర. విజయనగరాధీశులు మొదటినుండీ ఉద్ధతులు. గోలకొండ కుతుబ్‌షాహీలు, తరువాత మొగలుల ప్రతినిధులుగా పాలించిన ఫౌజుదారులు, వారి తరువాత వచ్చిన నిజాములతోనూ, ఫ్రెంచివారితోను, ఇంగ్లీషు వారితోనూ సఖ్యంగా ఉన్నారు. ఫౌజుదారుల హయాం (1687-1724)లోనే విజయనగర సంస్థానం రూపుదిద్దుకుంది. అంతకుముందు వారు సర్దారులే. 1713లో మొదటి ఆనందగజపతి (1674-1720) విజయనగరంలో కోట నిర్మాణం మొదలుపెట్టాడు. 1766 తరువాత ఇంగ్లిష్‌వారి సైన్యసహకారంతో విజయనగరంవారు ఇరుగుపొరుగు సంస్థానాలను రకరకాల కారణాలతో ఆక్రమించడం మొదలుపెట్టి సంస్థానాన్ని విస్తరించుకొన్నారు. 1794లో ఇంగ్లిష్ వారికి, విజయనగరంవారికి జరిగిన చారిత్రాత్మక పద్మనాభయుద్ధంలో ఇంగ్లిష్ వారు గెలుపొంది లోగడ ఆక్రమించబడిన సంస్థానాలన్నింటినీ విజయనగరం వారి నుండి విడిపించి తిరిగి పూర్వపాలకవారసులకు అప్పగించారు. ఇక్కడి నుండి విజయనగరం ఔద్ధత్యం తగ్గిందని చెప్పాలి. అయినా విజయనగరంవారు కళింగపెదరాజులే. సంస్థానాల పంపిణీలు పూర్తయిన తరువాత కూడా విజయనగర సంస్థానంలో కొన్ని ముక్కలను వేలంకూడా వేశారు. చివరకు 10 లక్షల జనాభాగల 1300 గ్రామాలతో విజయనగర 'సమస్థానం' నిలబడింది.

విజయనగరం రాజులు 1802కి పూర్వం స్వతంత్ర సంస్థానాధిపతులు, మహారాజులు. 1802 తరువాత ఈస్టిండియాకంపెనీవారు విజయనగరంవారు బలపడితే ఎప్పటికైనా తమకు ముప్పేనని గ్రహించి, స్వతంత్ర సంస్థానం హోదాను తగ్గించి ఇంగ్లిష్‌వారి కట్టడిలో పాలన జరిగేటట్లు జమీందారీ స్థాయికి తగ్గించి వేశారు. అందువలన పద్మనాభయుద్ధంలో వీరస్వర్గం అలంకరించిన చిన విజయరామరాజు (1748-1794) విజయనగరానికి చివరి స్వతంత్రరాజు. ఆయన కుమారుడు నారాయణగజపతి (1786-1845) విజయనగరం మొదటి జమీందారు.

విజయనగరంరాజులకు మొదటనుండీ కాశీ అంటే అమితభక్తి. అయితే వారు తీర్థయాత్ర రూపంగా పోయి రావడమే కానీ దీర్ఘకాలం నివాసం ఎప్పుడూ ఉండలేదు. కానీ మొదటి జమీందారు నారాయణగజపతి చాలా కాలం – సుమారు నలభైయేళ్లు కాశీలోనే జీవితం గడిపేశారు. నేను గ్రహించినంత మేరకు కారణాలు ఇలా ఉన్నాయి.

పద్మనాభయుద్ధంనాటికి చినవిజయరామరాజు, సీతయ్యమ్మల కుమారుడు నారాయణగజపతి ఎనిమిదేళ్లవాడు. యుద్ధసమయంలో కుమారుణ్ణి తీసుకొని తల్లి మన్యప్రాంతాలకు తరలివెళ్లి తలదాచుకొన్నారు. రాజ్యం కంపెనీవారి పరమయ్యింది. అయితే వారికి పాలన అంత సులభం కాలేదు. విజయనగర రాజులపట్ల భక్తిభావం గల స్థానికులు, ఉద్యోగులు, రైతులు వారికి సహకరించలేదు. పన్నులు జమ కాలేదు. దీనితో ఇంగ్లిష్‌వారే దిగివచ్చి నారాయణబాబును తిరిగి రాజ్యానికి రమ్మని ఆహ్వానించారు. ఆయన వారిని నమ్మక ఒక పట్టాన స్వక్షేత్రానికి తిరిగి రాలేదు. అనేక రాయబారాలు జరిగిన తరువాత వచ్చినా విజయనగరంలో ఉండటానికి అంతగా ఇష్టపడలేదు.

సమర్థతకు, దుర్మార్గానికి పేరుమోసిన పూసపాటివారి కుదురులో పుట్టిన అమాయకపు మారాజు నారాయణగజపతి(ఈ మాట కెయన్‌వై పతంజలి అన్నారు). వీరి కాలంలో ఇద్దరు దివానులు. మొదటివారు జంపెన జగన్నాథరాజు, తరువాతి దివాను ఆయనకి స్వయానా అల్లుడే అయిన సాగి రామచంద్రరాజు. ఇద్దరూ ఇంగ్లిష్‌వారి కంటే అన్యాయంగా సంస్థానాన్ని కొల్లగొట్టారు. వీరిలో సాగి రామచంద్రరాజు చినవిజయరామరాజుకు తోడల్లుడు. అంటే నారాయణగజపతికి బాబాయి. ఏ రైతులైతే కుంపిణీవారికి పన్నులు కట్టక తిరిగి నారాయణగజపతికి రాజ్యం రావడానికి కారణమయ్యారో ఆ రైతులనే దివానులిద్దరూ డబ్బుకోసం విపరీతంగా పీడించారు. ఒక దశలో నారాయణగజపతిని గద్దె దించి తానే పట్టం కట్టుకొందామని సాగి రామచంద్రరాజు ఆలోచన చేశాడట. అంతర కారణాలేమిటో కానీ ఆ కుయుక్తి పారలేదు.

ఇటు బంధువులకు నచ్చచెప్పలేక, అదుపు చెయ్యలేక, అటు ఇంగ్లిష్‌వారి ఒత్తిళ్లు భరించలేక, ప్రజలకు న్యాయం చేయలేక, విరక్తుడై నారాయణబాబు కాశీకి వెళ్లిపోయి అక్కడే ఉండిపోవడానికి నిశ్చయించుకొన్నాడు. కాశీలో 1750 నాటికే విజయనగరంవారికి పెద్దహవేలీ ఉన్నది. ఈ నిశ్చయం చేసుకొనేటప్పటికి సంస్థానం బాధ్యత అంతా తానే తీసుకొని, కంపెనీవారి నుండి సంవత్సరానికి లక్షాయాభైవేలు

భృతి రాజుకి ఇచ్చేటట్లు దివాన్ రామచంద్రరాజు ఒప్పందం చేయించాడు. రాజుకి ఇష్టం లేకపోయినా ఆ పరిస్థితులలో ఇమడలేక కాశీ వచ్చేశాడు. ఎన్నో కవి, పండిత కుటుంబాలు కూడా రాజుతోపాటు కాశీకి తరలివెళ్లాయి. వంటవాళ్లు, నౌకర్లు, చాకర్లు సంగతి చెప్పేదేముంది! వారి కోసం ఇక్కడి నుండి రాకపోకలు, వారి తరువాత మరికొన్ని కుటుంబాలు కాశీ వెళ్లడం – ఇలా తీరాంధ్ర వాసులకు కాశీతో సంబంధబాంధవ్యాలు పెరిగాయి. అంతకు ముందు లేవని కాదు. నారాయణబాబు కాలం నుండి మరింత పెరిగాయి.

నారాయణబాబు, అప్పలకొండయ్యమ్మల కుమారుడు మూడవ విజయరామ గజపతి (1826–1879) సంస్థానపాలనను 1854లో చేపట్టారు. ఉత్తరాది క్షత్రియ కన్యకనే వివాహమాడారు. ఇక్కడి నుండి పట్టాభిషిక్తులైన విజయనగరం జమీందారులు ఉత్తరాది కన్యకలనే వివాహమాడారు. తెలుగు క్షత్రియులతో వివాహ సంబంధాలు మానేశారు. విజయరామగజపతి కూడా చిన్నప్పుడంతా కాశీవాసమే. విజయనగరాన్ని సర్వవిధాలా కాశీగా మార్చివేయాలనే ఉద్దేశం కలవారు. ఆ కారణంచేత కాశీలో ప్రసిద్ధులైన పండితులను విజయనగరం రప్పించి తగు సన్మానాలతో గౌరవిస్తుండేవారు. కాశీలో స్థిరపడిన తెలుగుకుటుంబాల పండితులూ, ఇతర ప్రాంతాల నుండి వచ్చి స్థిరపడిన పండితులతోడి సహవాసంతో మన ప్రాచీనవిద్యలపట్ల అభిమానం పోగొట్టు కోకుండా నిలుపుకున్నారు. కాశీలో సంస్కృత విద్యాపీఠాలు ఉండటం చూసి విజయనగరంలోనూ సంస్కృతకళాశాల ఏర్పరచారు.

మూడవ విజయరామగజపతి కొడుకు జగత్ప్రసిద్ధుడైన అభినవాంధ్రభోజ ఆనందగజపతి మహారాజుకి (1850–1897) కాశీ అంటే అమితభక్తి. కాశీ నివాసమంటే అత్యంతాసక్తి. తరచూ అక్కడికి వెళ్లలేకపోయినా అక్కడినుండి పండితులను – ముఖ్యంగా వ్యాకరణ పండితులను పిలిపించి విద్యావినోదాలు జరిపించేవాడు. ఉత్తరాదినుండి ప్రముఖ సంగీతవిద్వాంసులను, నట్టువరాండ్రను పిలిపించి విజయనగరంలో ప్రదర్శనలు ఏర్పాటు చేయించేవారు. కాశీలోని పండితుల సహాయంతో 'విజయనగర సంస్కృత కావ్యమాలిక' అనే పేరుతో గ్రంథ ప్రచురణ సంస్థను నిర్వహించి 15 వరకు సంస్కృత గ్రంథాలను పరిష్కృత పాఠాలతో ముద్రించారు. విజయనగరంలో కాశీపేరు ఎంత మార్మోగకపోతే కన్యాశుల్కం నాటకంలో పదే పదే కాశీపేరు వస్తుంది!

నాలుగవ విజయరామగజపతి (1883–1922) మొదటి కుమారుడు అలకనారాయణగజపతి (1902–1937) రెండవ కుమారులు సర్ విజ్జిగా పేరొందిన విజయానంద గజపతి (1905–1965). సర్ విజ్జి నారాయణగజపతి తరువాత పూర్తిగా కాశీవాసం చేసినవారు. క్రికెటర్. సర్ డొనాల్డ్ బ్రాడ్‌మన్ శిష్యుడు. సి.కె. నాయుడుకి సహచరుడు. వీరు కాశీలోని భవనంలోనే నివాసం ఉండిపోయారు.

అప్రస్తుతమైనా ఇక్కడే ఇంకొక విషయం. విజయనగరం రాజుల పూర్వ స్థానం నేటి ప్రకాశం జిల్లా ఇంకొల్లు మండలంలోని పూసపాడు గ్రామం. అందుకే వారి ఇంటిపేరు పూసపాటి అయ్యింది. వీరి పూర్వీకులలో ఒకరు రాచిరాజు గుంటూరు జిల్లాలో కృష్ణానది ఒడ్డున ఉన్న కేతవరం దుర్గాధిపతి. కటకాధిపతి ప్రతాపరుద్రగజపతి అల్లుడు. శ్రీకృష్ణదేవరాయలకు తోడల్లుడు ఇప్పుడు ఉత్తరాంధ్రలో నివసిస్తున్న అనేక క్షత్రియకుటుంబాల పూర్వీకులు గుంటూరు జిల్లా నుండి వెళ్లినవారే. పేరేచర్ల, చింతలపాటి, పాకాలపాటి, గొట్టిముక్కల, ఉప్పలపాటి, వేజెళ్ల, అల్లూరి, జంపెన వగైరా క్షత్రియుల ఇళ్లపేర్లు గుంటూరుజిల్లా గ్రామనామాలే.

బొమ్మిడాల శ్రీకృష్ణమూర్తిగారితో కాశీ ప్రయాణం అనుకొన్నప్పుడే అక్కడి విజయనగరంవారిని కలవాలి అనుకొన్నాము. విజయనగరంలో నాకు ఒక లోకల్ గార్డియన్ ఉన్నారు. పేరు యన్‌కె బాబు.  నేను ఆయనకు ఒక వరుసలో మామగారిని. అంచేత ఆయన్ని కాశీలో విజయనగరంవారి చహరా తెలుసుకో వలసినదిగా కోరిన మీదట, ఆయన కిందామీదా పడి ఆ 'భోగట్టా' ఇచ్చారు. ఆ



కాశీలో విజయనగరంవారి కోఠి ముఖద్వారం



వెంకటేశసింగ్‌గారు – బొమ్మిడాల శ్రీకృష్ణమూర్తిగారు

ప్రకారం కాశీలో బేల్‌పుర ప్రాంతంలో విజయనగరం కోఠీలో సర్ విజ్జీ చిన్న కుమారుడు 'కువర్ వేంకటేశసింగ్ అలక్‌నారాయణగజపతి'గారిని కలిశాము. వారికి ఛోటేభయ్యా అని స్థానికనామం. విశాలమైన భవంతి. లోపల ఇంకా రాచరికకళ పూర్తిగా మాసిపోలేదు. వారు చాలా ఆదరంగా మాట్లాడారు. తెలుగు మాట్లాడలేరు కానీ అర్థమవుతుంది. భవనం లోపల చూపించారు. ఆనందగజపతి గారి ఫోటో ఒకటి పెద్దది చూసి సంతోషం కలిగింది. వేంకటేశ సింగ్ గారికి ఆనందగజపతి గొప్పదనం, గురజాడ – ఈలాంటి సంగతులేవీ తెలియవు. విజయనగరం కోఠీ బయటనే ఒక చౌరస్తాకి కాస్త పక్కగా సర్ విజ్జీ విగ్రహం – క్రికెట్ వేషధారణలో నాలుగు అడుగుల ఎత్తు ఉన్నదానిని నిలబెట్టారు.

నారాయణగజపతి కాలంలో, మూడవ విజయరామరాజు కాలంలో రాచకొండ, చల్లా, రాజవరపు తదితర ఇంటిపేర్లున్న పండిత, పురోహిత కుటుంబాలు కాశీ వెళ్లాయి. వారి వారసులు ఇంకా అక్కడ ఉన్నారు. కాశీనివాసి చల్లా అన్నపూర్ణ ప్రసాద్‌గారు ఇచ్చిన సమాచారం ప్రకారం సుమారు రెండువందల తెలుగు కుటుంబాలు అప్పటినుండీ స్థానికంగా నివాసముంటున్నారనీ, ఆ కుటుంబాలకు చెందినవారు సుమారు వెయ్యిమంది తెలుగువారు ఇప్పుడు ఉంటారనీ తెలిపారు. ఇటీవలి కాలంలో బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు, శ్రీ సామవేదం షణ్ముఖ శర్మ వంటి పెద్దల ప్రసంగాల వలన ప్రేరణ పొంది ఎంతోమంది తెలుగు వారు విరివిగా వస్తున్నారని తెలిపారు.



అనుబంధము - 2

## తిరుపతి వేంకటకవుల సాహితీసర్వస్వం

### నాటకములు

1. పాండవజననము
2. పాండవప్రవాసము
3. పాండవోద్యోగము
4. పాండవవిజయము
5. పాండవాశ్వమేధము
6. పాండవరాజసూయము
7. దంభవామనము
8. అనర్ఘనారదము
9. సుకన్య
10. పండితరాజము
11. ప్రభావతీప్రద్యుమ్నము
12. ఎడ్వర్డు పట్టాభిషేకము
13. వ్యసనవిజయము
14. సౌవర్ణపాత్రికము
15. మృచ్ఛకటికము
16. ముద్రారాక్షసము
17. బాలరామాయణము

### ప్రహసనములు

18. రసాభాసము
19. త్రిలోకీవిజయము
20. పల్లెటూళ్ల పట్టుదలలు
21. అపూర్వ కవితావివేచనము
22. కవిసింహగర్జితములు

### చాటువులు

23. నానారాజసందర్శనము
24. కలగూరగంప
25. శతావధానసారము

### వచనములు

26. కథలు - గాథలు (మూడు సంపుటములు)
27. హర్షచరిత్రము
28. విక్రమాంకదేవచరిత్రము
29. చంద్రప్రభచరిత్రము
30. సారస్వతవిమర్శలు (1-2 భాగములు)
31. భారతవీరులు
32. కాశీయాత్ర
33. విక్రమచెళ్లపిళ్ల
34. షష్టిపూర్తి
35. దివాకరాస్తమయము
36. ఆంధ్రభోజుడననేమి?
37. సతీజాతకము

### సంస్కృత గ్రంథములు

38. కాళీసహస్రమ్
39. ధాతురత్నాకరమ్
40. శృంగారశృంగాటకమ్
41. క్షమాపణమ్
42. శిష్టపేషణమ్
43. శలభాలభనమ్

**ప్రబంధములు**

44. శ్రవణానందము
45. పాణిగృహీత
46. లక్షణాపరిణయము
47. బుద్ధచరిత్రము
48. శ్రీనివాసవిలాసము
49. ఏలామాహాత్మ్యము
50. పూర్వహరిశ్చంద్రచరిత్రము
51. శివభక్తి
52. సుశీల
53. పతివ్రత
54. గోదేవి
55. దేవీభాగవతము (పురాణము)
56. శివలీలలు (డిటో)
57. జాతకచర్య (చెళ్లపిళ్ల స్వీయచరిత్ర)
58. ఇటీవలిచర్య

**వివాద గ్రంథములు**

59. గీరతము (4 భాగములు)
60. గుంటూరు సీమ (2 రంగములు)
61. వేమవరాగ్రహార శతావధానము
62. చెళ్లపిళ్ల జయంతి
63. మల్లేశ్వర విజ్ఞప్తి

**లఘుకావ్యములు**

64. వ్రతకథలు
65. పురాణగాథలు
66. రసికానందము
67. శనిగ్రహము
68. గ్రామసింహము
69. బిడాలోపాఖ్యానము
70. వ్యాసనిష్కాసనము
71. దైవతంత్రము
72. వైరాగ్యశతకము
73. శుకరంభా సంవాదము
74. శివశంకర విజ్ఞప్తి
75. రాసభకుమారుడు
76. దివ్యతిరుపతి

**శతకములు, స్తవములు**

77. కామేశ్వరీ శతకము
78. ఆరోగ్యకామేశ్వరి
79. ఆరోగ్యభాస్కరస్తవము
80. మృత్యుంజయస్తవము
81. నమశ్శివాయస్తోత్రము
82. శివస్తవము
83. సౌభాగ్య కామేశ్వరి
84. కాళికాదిస్తోత్రమాల



# కాశీయాత్ర

శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి రెండు తరాలపాటు ఆంధ్రదేశం ఆబాలగోపాలానికి అవధానమంటే ఏమిటో రుచి చూపించిన తిరుపతివేంకటకవులలో ఒకరు.

షడ్దర్శనీవేది చర్ల బ్రహ్మయ్యశాస్త్రి గురువరేణ్యుల కటాక్షం పొందినవారు. వీరిని ఆదర్శంగా తీసుకొని తయారయిన కవులకు, అవధానులకు లెక్కలేదు. పాండవోద్యోగ విజయ నాటకాల ద్వారా విఱుగు తఱుగులేని చిరయశస్సు ఆర్జించారు. వీరి అవధానశక్తి అత్యంత విలక్షణం. ధారాశుద్ధితో కూడిన ధారణశక్తి, ఆశుధారాపటిమ ఆజన్మసిద్ధమా అనిపిస్తుంది. అవధానమనే యాగాశ్వంతో దిగ్విజయ యాత్ర సలిపి కవితా సామ్రాజ్య పట్టాభిషిక్తులయ్యారు. పద్యమైనా, వచనమైనా కరుబుర్లైనా చవులూరించేటట్లు రాయగలరు; చెప్పగలరు.

శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి 18 యేండ్ల వయసులో శ్రీ కాశీ మహాక్షేత్రానికి వ్యాకరణాధ్యయనం కొరకు వెళ్లి ఆ అనుభవాలను రాశారు. అదే కాశీయాత్ర. కాశీ గురించి చెప్పాలంటే అది భారతీయ ఆత్మ. ప్రాచీన సంప్రదాయ విద్యలకూ అప్పుడూ, ఇప్పుడూ అధ్యయన అధ్యాపన కేంద్రం.

చెళ్లపిళ్లవారు చెప్పిన కథలు - గాథలులో చేరని మరి నాలుగు రచనలు కూడా కలిపి ఈ తరానికి అర్థం కావడానికి చక్కటి పాద సూచికలతో, అలనాటి ఛాయాచిత్రాలతో, విశ్వనాథ సత్యనారాయణ, శ్రీరమణ మందుమాటలతో ఈ కాశీయాత్ర పొత్తాన్ని ప్రచురించాము.

